


# 'పిల్లి' ప్రపంచం



ప్రసిద్ధమైన అమెరికన్ కార్టూన్ పిల్లి 'గార్‌ఫీల్డ్' అంటే ఈవిడగారికి ఎంతో ఇష్టం. అందుకని ఆ గార్‌ఫీల్డ్‌కు సంబంధించిన నానారకాల బొమ్మలూ సేకరించిందీమె. ఆ పాత్ర ఉన్న కార్టూన్ సినిమాల వీడియోలన్నీ ఉన్నాయామె దగ్గర. ఇందునిమిత్తం ఆవిడ ఇప్పటికి ఓ లక్షన్నర రూపాయలు ఖర్చుచేసిందిట.

# ఏరిన ముత్యాలు

☆ అజ్ఞానం సిగ్గు ఎరగదు

-రూసో

☆ కేవలం పదప్రవాహమే పాండిత్యానికి నిదర్శనం కాదు

-అంగ్లసామెత

☆ వయస్సు మీరిన తరువాత మనకు అవసరమైన ఆశ్రయం ఇవ్వగలిగింది విజ్ఞానమే. అయితే వయస్సులో వున్నప్పుడే మొక్క నాటితే తప్ప పెరిగి పెద్దదై వార్ధక్యంలో అది తగినంత నీడను మనకు సమకూర్చలేదు.

-చెస్టర్‌ఫీల్డ్

☆ పని చేయనివాడే సోమరిపోతు కాదు. పని బాగా చేయనివాడు కూడా సోమరిపోతే

-సోక్రటీస్

☆ పరిపాలనలో పాల్గొనడానికి బుద్ధిమంతులు నిరాకరించి దూరంగా వుంటే దుష్ట పరిపాలన క్రింద జీవితం గడిపే శిక్ష వారూ అనుభవించవలసి వుంటుంది.

-ప్లేటో

☆ యుద్ధోన్మాదం అంటే శాంతి సమస్యలనుండి పిరికితనంగా తప్పించుకోవడమే తప్ప ఇంకేమీ కాదు.

-థామస్‌మాన్

☆ ప్రపంచంలో అనేకచోట్ల అశేష ప్రజానీకం పేదరికంతో అలమటిస్తున్నప్పుడు భద్రత, వాస్తవమైన శాంతి వుండబోవు.

-నెహ్రూ

☆ కిరీటాన్ని ధరించే శిరస్సు సుఖానికి దూరమవుతుంది.

-షేక్స్‌పియర్

☆ హద్దులులేని అధికారం మనిషిని అవినీతి పరుడుగా చేస్తుంది.

-విలియంపిట్

☆ ప్రతి పౌరుడూ హక్కులను మాత్రమే కోరుకుంటూ బాధ్యతలను విస్మరిస్తే అరాచకం తప్పదు.

-గాంధీజీ

☆ శాసనసభల చాటున వుండెడి నిరంకుశ అధికారం కన్నా, సైనిక నిరంకుశాధికారమే కోటి రెట్లు సుఖప్రదం

-గాంధీజీ

సేకరణ: **ఆముదాల అజయ్‌బాబు**

# చతుర ప్రపంచం

## బంగారు తిరుపతి

'తిరుపతి' అనగానే మనకి స్ఫురించేది చిత్తూరు జిల్లాలోని ఏడుకొండల వెంకటేశ్వ రుడి స్వస్థానం. కానీ... కర్నాటకలో చాలా తిరుపతులున్నాయి. అందులో కోలార్ జిల్లా లోని 'కోలార్ బంగారు గనుల'కు దగ్గరగా వున్న 'బంగారు తిరుపతి' ఒకటి. నిజానికి ఒకప్పటి దీని పేరు గుట్టహల్లి. అయితే ఇది బంగారు గనులకు దగ్గరగా వుండటం, అక్కడ వేంకటేశ్వరుడి ఆలయం వుండ టంతో ఇది బంగారు తిరుపతి అయింది. బంగారు అనే తెలుగు పేరు ఎందుకు వచ్చిందని అనుమానం రావచ్చు. ఈ ప్రాంతం ఆంధ్రా సరిహద్దులకు దగ్గరగా వుండటంతో ఆ పేరు వచ్చింది. ఈ ప్రాంత మంతా పచ్చని ప్రకృతి శోభతో కనువిందు చేస్తూవుంటుంది. గుట్టహల్లి ఓ చిన్న కుగ్రామం. దేవాలయానికి చుట్టూవున్న 90 ఎకరాల స్థలం మొత్తం దేవాలయానికే చెందుతుంది. ఆ కారణంగా గుడికి కనుచూ పుమేరలో ఇళ్ళుగానీ దుకాణాలుగానీ కని పించవు. మనకి మొట్టమొదట కనిపించే అతిపెద్ద కట్టడం కల్యాణమంటపం. మా మూలు రోజుల్లో అక్కడ జనసందోహం వుండక ప్రశాంత వాతావరణం నెలకొని వుంటుంది. గర్భగుడిలోకి వెళ్ళి దైవదర్శనం చేసుకోవాలంటే కొండమీదకు కొన్ని మెట్లె క్కి వెళ్ళాలి. మొట్టమొదట గరుడ దర్శనమ వుతుంది. ఈ గరుడ వాహనాన్ని ప్రత్యేక దినాల్లో ఊరేగింపుల్లో ఉపయోగిస్తారు దేవా లయం వారు. కాళ్ళకు పాము చుట్టుకుని వుండి ఎగురుతున్న భంగిమలో కనిపిస్తుంది ఈ గరుడవాహనం. ఇవన్నీ దాటి గర్భగుడి సమీపించగానే ముందుగా కిటికీ ఊచల్లోంచి స్వామిని దర్శించాలి. దీనిని నేత్ర దర్శన మంటారు. అంటే ఊచలు కూడా పూర్తి రేకుతో కప్పబడి ఓ కంటి ఆకారపు రంధ్రం మాత్రం ఆ కిటికీకి వుంటుంది. ఆ రంధ్రం గుండా స్వామిదర్శనం చేసుకోవాలి. కానీ ప్రస్తుతం అది తొలగించి కిటికీ మొత్తం తెరిచి పెట్టడంతో ఇప్పుడు భక్తులు తనివి తీరా స్వామి దర్శనం చేసుకుంటున్నారు. లోపలి విగ్రహం రెండున్నర అడుగుల ఎత్తున వుండి పాదాల కింద ఏడు తలల పాము చుట్టుకుని వున్నట్టు కనిపిస్తుంది. శ్రీ వెంకటేశ్వరుడు అనుకోగానే మనకు తిరుప తిలోని నిలువెత్తు విగ్రహం తలపుకు వస్తుంది. కానీ... బంగారు తిరుపతిలో అలా కాదు. అయినా... ఓసారి దర్శించుకుంటే ఆ విగ్రహాన్ని పదేపదే చూడాలని వుంటుందంటారు భక్తులు.

శ్రావణమాసంలో ప్రతి శనివారం దేము డ్ని ప్రత్యేక పద్ధతుల్లో అలంకరిస్తారు. ఇది కాక ఆ మాసంలో ప్రతి శుక్రవారం రాత్రి తెప్ప ఉత్సవం నిర్వహిస్తారు. 3, 4 శనివారా లలో 30 వేలకు పైగా యాత్రికులు ఈ బంగారు తిరుపతికి వస్తారు. మాఘపౌర్ణమి కి బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు. ఆ సమ యంలో పదిరోజులు జాతర జరుగుతుంది. భక్తులకు అన్న సత్రం కూడా వుందక్కడ.

ఈ దేవాలయానికి ఆసక్తికరమైన స్థల పురాణముంది. ఇక్కడ భృగుమహర్షి తప స్సు చేశాడని, ఆయనకు జ్ఞానోదయమ యిందని చెబుతారు అక్కడ. ఒకప్పుడు






భృగుమహర్షి విష్ణుదర్శనానికి వైకుంఠానికి వెళ్ళినపుడు శృంగారలీలలో మునిగిన విష్ణువు తనని ఆదరించి ఆతిథ్యమివ్వలేదని ఆగ్రహిస్తాడు. ఆ ఆగ్రహాన్ని శాంతింపచేసే మిషతో విష్ణువు భృగువు పాదాలను ఒత్తుతూ ఆయన పాదంలో వుండే నేత్రాన్ని చిదిపివేస్తాడు. ఇన్నాళ్ళూ ఆ నేత్రకారణంగానే ముక్కోపిగా మారిన భృగువు ఆ నేత్రం పోగానే తన తప్పు తెలుసుకుని పశ్చాత్తాపపడతాడు. విష్ణువుకు క్షమాపణ చెప్పుకుని తనకు మోక్షాన్నిమ్మని కోరతాడు. అప్పుడు విష్ణువు "శేషాచల పర్వతానికి పోయి తపస్సు చేసుకో. అక్కడికి వచ్చి నేను దర్శనమిస్తాను'' అని చెబుతాడు. ఆ శేషాచలమే ఈనాటి గట్టహల్లి లేదా బంగారు తిరుపతి. అక్కడి అర్చకులు ఈ కథనువీనులవిందుగా వినిపిస్తూ ఈ దేవాలయం భృగుమహర్షి కాలానికి చెందినదని చెబుతారు భక్తులకు.

20 సంవత్సరాలకు పూర్వం ఈ దేవాలయం ప్రభుత్వ హయాములో తిరిగి పునరుద్ధరించబడింది. చక్కని గోపుర నిర్మాణం జరిగింది. ఇప్పుడక్కడ నాలుగు సత్రాలు కట్టబడ్డాయి. పెళ్ళిళ్లు, ఉపనయనాలు జరుగుతూ వుంటాయక్కడ. కానీ... భక్తులు కొద్దిరోజుల పాటు వుండటానికి తగిన వసతి సౌకర్యాలు అక్కడ లేవు. రాత్రిళ్ళు అక్కడ వుండాల్సివస్తే గుడారాలేసుకుని వుంటారు భక్తులు. దేవాలయం మేనేజ్‌మెంట్‌వారు ఈ విషయంలో శ్రద్ధ తీసుకుని వసతి గృహాలు నిర్మించాల్సిన అవసరముంది.

ఇది బెంగుళూరుకు వంద కిలోమీటర్ల దూరంలో వుంది. దగ్గరగా వున్నట్లయితే ఇది ఓ అద్భుత పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చెందేది అంటున్నారు కొంతమంది. అసలు చాలామందికి ఈ దేవాలయం వున్నట్టే తెలియదని కొంతమంది అంటున్నారు. అక్కడ ఒక విద్యాసంస్థ ను ప్రారంభిస్తే ఆ ప్రాంతం వెలుగులోకి రావచ్చని కొంతమంది అభిప్రాయపడుతున్నారు. దేవాలయానికి చుట్టూ వున్న 90 ఎకరాల భూమిలో యూకలిప్టస్ చెట్లున్నాయి. అక్కడ తగినంత నీటిసౌకర్యం లేని కారణంగా మామిడి, కొబ్బరి, చింత మొదలయిన ఫలసాయాన్నిచ్చే చెట్లు నాటడానికి అవకాశంలేదు. బోర్‌వెల్స్‌ను తవ్వి నీటి సదుపాయాన్ని కలిగించుకుని ఆ ప్రాంతాన్ని అభివృద్ధి చేయడానికి ఎవరూ శ్రద్ధగా నడుం కట్టడంలేదని కొంతమంది వాపోతున్నారు. అవన్నీ జరిగి ఆ ప్రాంతం సౌకర్యవంతంగా తయారయితే భక్తులకు పర్యాటకులకు మనదేశంలో కొరతే లేదు మరి.




## క్రీడల కమామీషు

మల్లయుద్ధం ప్రపంచంలో అతి పురాతన క్రీడ అంటారు. గుహల గోడలపై నేటికీ కనిపించే 300 బి.సి. నాటి చిత్రాలు అప్పటి ఆటగాళ్లు మల్లయుద్ధంలో పాల్గొన్నట్టు తెలియచేస్తున్నాయి. ఇండియాకూ, సుదూర తూర్పుదేశాలకి కూడా మల్లయుద్ధానికి సంబంధించిన చరిత్ర వుంది. సుమో అనే జపాన్ మల్లయుద్ధ వీరుడు 23 బి.సి. దాకా కూడా ప్రఖ్యాత యోధుడుగా గుర్తింపు పొందాడు. కానీ అప్పట్లో ఈ మల్లయుద్ధం అత్యంత హింసాత్మక పద్ధతుల్లో సాగేది. రాజు తనకు తోచిన ఇద్దరు మల్లయుద్ధ వీరులను ఎన్నుకుని వారిద్దరి మధ్య పోటీ పెట్టేవాడు. వాళ్లిద్దరూ ఆపకుండా కుస్తీ పడుతూ వారిలో ఎవరో ఒకరు చనిపోయాకనే ఆట ముగిసేది.

జూడో కూడా జపాన్‌లోనే పుట్టింది. జపాన్‌లో దీన్ని 'జి-జుట్సు' అంటారు. జూడోలో ఆయుధాలు లేకుండా కొట్టుకుంటారు. ఆ తరువాత దీనిని చైనీయులు అనుసరించి 12వ శతాబ్దంలో యుద్ధ ప్రయోజనాలకి దీన్ని ఉపయోగించేవారు. 1882లో జపాన్‌కి చెందిన జిక్రోకానో అనే ఓ ప్రొఫెసరు అహింసాత్మక పద్ధతిలో సాగేవిధంగా జూడోను సంస్కరించాడు.

కరాటే ఇండియానుంచి జపాన్ వెళ్లింది. 17వ శతాబ్దంలో ఒకినావాకి చెందిన గెరిల్లా యుద్ధ వీరులు దీనిని ఉపయోగించారు. 1916నుంచి మాత్రం కరాటే వినోదపు ఆటల్లో చేర్చబడింది.

బాక్సింగ్‌ను గురించిన ప్రస్తావన కూడా మన శాస్త్రాల్లో వుంది. ప్రస్తుతం చలామణి అవుతున్న ఎన్నో వినోదభరితమైన ఆటలు అప్పటి యుద్ధ విద్యలుగా వుండేవి. పూర్వం యుద్ధవిరామ సమయాల్లో భారతీయ సైనికులు చదరంగాన్ని కాలక్షేపంగా ఆడేవారు. అప్పుడే యుద్ధానికి సంబంధించిన ఏనుగు, గుర్రం మొదలైన జంతువులు, రాజు, మంత్రి, బంటు మొదలైన పాత్రలను ప్రవేశపెట్టి యుద్ధాన్ని ప్రతిబింబించేలా ఈ ఆటను ఆడేవారు. అటుపైన ఈ ఆట ఇండియానుండి పర్షియాకి, అక్కడినుండి యూరప్‌కి పాకింది.

పరుగు పందాలు, జంపింగ్, స్కిప్పింగ్ వగైరా ఆటలన్నీ యుద్ధవిద్యలుగా నేర్చుకునేవారు పూర్వం. మామూలు మనుషులు వీటికి దూరంగా వుండేవారు. అలాగే పుట్‌బాల్‌కి కూడా ఓ చరిత్ర ఉంది. 350 బి.సి.లో



చైనీయులు ఓ రకం బంతి ఆటను ఆడేవారు. నెమ్మదిగా అది ఇంగ్లండు, ఇతర యూరోపియన్ దేశాలకి పాకింది.

ఒకప్పుడు ఈ ఫుట్‌బాల్ ఆట కొన్ని ప్రాంతాల్లో చాలా హింసాత్మకంగా సాగింది. అందుకే రెండవ ఎడ్వర్డ్, 3వ ఎడ్వర్డ్, 4వ హెన్రీ మొదలైన ఎంతోమంది బ్రిటిష్ రాజులు తమ తమ పరిపాలనా కాలాల్లో దీనిమీద నిషేధాజ్ఞలు జారీచేశారు.

19వ శతాబ్దంనుంచీ ఈ ఫుట్‌బాల్ ఆట పాఠశాలల్లో, కళాశాలల్లో, క్లబ్‌లలో వినోదభరితంగా, మంచి పద్ధతుల్లో తీర్చిదిద్దబడి కొనసాగింది. ఇంగ్లండునుంచి ఇది అమెరికాకు పాకింది.

ఇప్పటి టెన్నిస్ ఆట కూడా పురాతన గ్రీసుదేశంలో వ్యాప్తిలో వుండేది. రుమేనియన్లు, గ్రీసు దేశస్థులు ఈ ఆటని పెద్దపెద్ద టెన్నిస్ కోర్టులలో చాలా మోటు పద్ధతుల్లో ఆడేవారు. లిబియా తవ్వకాల్లో బయల్పడిన ఓ రాతిబంతి క్రీ.పూ. రెండవ సంవత్సరంది గా గుర్తించబడింది. అదే అలనాటి టెన్నిస్‌బాల్‌గా గుర్తించారు పరిశీలకులు.

ఏడవ హెన్రీ రాజు కాలంలో కట్టిన ఓ టెన్నిస్ కోర్ట్ ప్రపంచంలోకెల్లా పురాతనమైన టెన్నిస్ కోర్ట్ అంటున్నారు. 1874 నాటికి టెన్నిస్ కోర్టులలో ఆధునిక పద్ధతులు చోటుచేసుకున్నాయి.

క్రికెట్ ఆట 1744లో ఇంగ్లండులో కొన్ని నియమనిబంధనలతో ప్రవేశపెట్టబడింది. 1598లో కూడా కొన్ని ఫ్రెంచి గ్రంథాలలో ఈ క్రికెట్ ఆట ప్రస్థావన వుంది. మొదట్లో ఈ క్రికెట్ ఆటని స్టూల్‌బాల్ అని పిలిచేవారు. అంటే అప్పట్లో బల్లలమీద కూర్చుని ఈ ఆటని ఆడేవారు. బంతులను కేవలం చేతులతో అడ్డుకుని ఆపేవారు. అటు తరువాత క్రమంగా చేతుల స్థానంలో కర్రలు, అటుపైన బ్యాట్‌లు చోటుచేసుకున్నాయి.

ఇలా ఎన్నో ఆటలు శతాబ్దాలక్రితంనుంచీ వున్నా కాలానుగుణంగా అనేక మార్పులను పొందుతూవచ్చాయి.

---

## గతం మరువని మహానటి

సినీరంగంలో అతి ప్రతిష్ఠాత్మకమైన అవార్డ్ 'ఆస్కార్' అన్న సంగతి అందరికీ తెలిసిందే. నటీనటులు, సంభాషణా రచయితలు, దర్శకులు, ఫొటోగ్రాఫర్లు, వగైరా... అన్ని రకాల కళాకారులు తమ కళాకౌశలం గుర్తింపుకు ఆస్కార్ అవార్డు గీటురాయిగా భావిస్తారు.

ఓ సంవత్సరం ఆస్కార్ అవార్డ్ అమెరికన్ నటీమణి ఛెర్‌కి వచ్చింది. దానికి కారణం ఆమె నటించిన 'మూన్‌స్ట్రక్' అనే చిత్రం. అందులో ఆమెపాత్ర భర్త చనిపోయిన భార్య పాత్ర. అవార్డ్ పొందిన తరువాత ఆమె చెప్పిందేమిటంటే - 'ఈ అవార్డు ఈ సినిమాలో నేను వేసిన పాత్రకిగానీ, ఆ పాత్రలో నా నటనకిగాని లభించలేదు. సినీరంగంలోని ఇన్నాళ్ల నా కృషికి గుర్తింపు ఈ అవార్డ్'. అలా ఆమె చెప్పగానే ప్రేక్షకులంతా విడకుండా చప్పట్లుకొట్టడం ప్రారంభించారు. ఎందుకంటే ఆమె మాట్లాడేది అక్షరసత్యమని వారందరికీ తెలుసు.

ప్రస్తుతం తన ఇద్దరు పిల్లల్తో లాస్ ఏంజెల్స్‌లోని హాలీవుడ్‌లో ఓ చిన్న ఇంట్లో నివాసముంటోన్న ఆమె సినీ నటనా జీవితంలో శిఖరాగ్రం చేరుకోడానికి ఎంతో కష్టపడింది. ఆమె బాల్యం దుర్భర దారిద్ర్యంలో గడిచింది.

ఆమె తల్లితండ్రులు, కుటుంబ సభ్యులు మెక్సికన్ సరిహద్దులో (డింగీ ఏరియా) వుండేవారు. ఆమెకి 11 ఏళ్ల వయసులో ఆమె తండ్రి ఇల్లు విడిచిపెట్టి వెళ్లిపోయాడు. దాంతో ఛెర్, ఆమె మిగతా కుటుంబ సభ్యులు కూడా దారిద్ర్యంలో మగ్గి అష్టకష్టాలుపడ్డారు.







కానీ పసితనంనుంచీ తనొక ప్రసిద్ధ వ్యక్తిగా నిలబడాలని, నలుగురిలో పేరు తెచ్చుకోవాలని కలలుకనేది. రచయిత్రిగానో, కవయిత్రిగానో జీవితంలో ఖ్యాతి పొందాలనుకునేది.

ఆ దశలో ఆమెకు సాల్వేడార్ ఫిలిప్పనో అనే వ్యక్తి తారసపడ్డాడు. ఆమె అతణ్ణి ఎంతో గౌరవనీయమైన వ్యక్తిగా, గురుసమానంగా భావించేది. సామూహిక గానకచేరీలో పాడుతూవుండేవాడు సాల్వేడార్. అతడు బృందగానాల్లో తనకు తోడుగా ఛెర్‌ని సెలెక్ట్ చేశాడు. అలా ఓ రెండేళ్లపాటు ఇద్దరూ అనేక బృందగానాల్లో పాల్గొన్నారు.

1965లో ఈ బృందం పాడిన 'ఐగాట్ యుబేబీ' అన్న పాట చాలా పేరుతెచ్చిపెట్టింది ఇద్దరికీ. అటు తర్వాత ఛెర్ సోనీ అనే పాటగాడితో కూడా పాడింది. అలా ఆమె కీర్తిశిఖరాలను ఎక్కడం ప్రారంభించింది. సోనీ, ఛెర్... మంచి జంటగా పేరుపొందారు. చివరకు ఇరువురూ పెళ్లిచేసుకుని పిల్లవాడు కూడా కలిగాక సోనీ ఆమెనుంచి విడాకులు కోరాడు. అటుపైన సోనీ ఖ్యాతి తిరోగమిస్తే ఛెర్ ఖ్యాతి పురోగమించడం ప్రారంభించింది.

ఓ నిర్మాత ఆమెను 'కమ్‌బ్యాక్‌టు ది ఎండ్‌టైమ్' అనే చిత్రానికి ఎంపికచేశాడు. అదొక ప్రేమకథాచిత్రం. అందులోని ముద్దులు వగైరా అశ్లీల సన్నివేశాలని అత్యంత సునాయాసంగా చేసింది ఛెర్. దాంతో ప్రేక్షకుల మనసుల్లో ఆమె చెరగని ముద్రగా నిలిచిపోయింది. ఆమె పేరును సినిమా పరిశ్రమలోని ఇతర కళాకారుల పేర్లతో కలుపుతూ అసభ్య ప్రచారం చేయసాగారు కొందరు. అయినా ఆమె బాధపడలేదు. కేవలం ఒక వారంరోజుల్లో ఆమె స్టేజిపై పాటలు పాడి దానిద్వారా నాలుగు లక్షల డాలర్లు సంపాదించింది. మరో 20 వారాలకు కాంట్రాక్టు ఫారంమీద సంతకం చేసి గానకచేరీలు చెయ్యమని వారు అర్థించారుగానీ ఆమె తన ఉత్సాహాన్నంతటినీ నటనకే అంకితం చెయ్యాలని నిశ్చయించుకుంది.

ఆమె దుర్భర దారిద్ర్యంలో పుట్టి పెరిగింది కాబట్టీ, పేదరికం అంటే ఏమిటో తెలిసిన మనిషి కనుకా తాను సంపాదించినదంతా ఎప్పుడూ పేదలకు దానంచేస్తూవుండేది.

# చతుర

సంపుటి: 19 సంచిక: 3 ఏప్రిల్ 1996

అర్ధరాత్రి సమయంలో... అర్ధబలం మాత్రమే గల అపర కుబేరులు బసచేయగలిగే ఆ హెూటల్ రూమ్‌లో... అరడజనుమంది హేమాహేమీలతో... అరవయ్యోసారి స్టోరీ డిస్కషన్‌కి కూర్చున్నాడు ఆ నిర్మాత.

మందు సీసాలు ఖాళీ అవుతున్నాయి. మాస్ ఎట్రాక్షన్‌పరంగా... అంటే జనం సీట్లు చింపి మరీ హర్షాతిరేకాన్ని ప్రదర్శించే సీన్లు అల్లడంలో అందెవేసిన చెయ్యి అనిపించుకున్న... అద్భుత రచయిత కమ్ దర్శకుడు స్టోరీ ఆరంభించడానికి నాందిగా సుదీర్ఘాలోచనలో ఉండగా... ఆ నిశీధి నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ అందెల రవళి... క్రమంగా దగ్గరవుతూ తలుపు కొట్టిన సవ్వడి. అక్కడున్న ఆరుగురినీ అప్రతిభుల్ని చేస్తూ... లోపలికి అడుగుపెట్టింది ఆ వయ్యారి. అంతేకాదు... అంతవరకూ సినిమా కథ అల్లడానికి జుట్టు పీక్కుంటున్నవారందర్నీ... మంత్రముగ్ధుల్ని చేసి... సమ్మోహనకరంగా ఆమె చెప్పిన అసలు సిసలు సినిమా కథ ఏమిటి? అలా... అర్ధాంతరంగా రంగప్రవేశం చేసిన ఆ... రమణీ లలామ... ఎవరు?

సినీ విజయరహస్యాల్ని, మాస్ మసాలా మేళవింపుల్నీ... నవరసభరితంగా... నవలాతెరపై నింపిన భాగవతుల సుబ్రహ్మణ్యం రచన

# సూపర్ హిట్

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



స్టార్లూ స్టారున్నవాళ్లూ మాత్రమే బస చేయ గల ఏసీ హోటల్లో రూం నెంబర్ త్రీనాట్ త్రీ...!

దాదాపుగా అర్ధరాత్రి...

సినీరంగ సారపారంగతుడూ దర్శక విచిత్రవీరుడూ అయిన శ్రీమాన్ జనమేజయం డబుల్‌బెడ్‌మీద అడ్డం?గా బాసింపట్టు వేసుక్కూర్చున్నాడు.

దేశవాళీ ఇప్పసారాలో విదేశీ విస్కీని మిళాయించి గుటకేస్తూ వీసీపీలో నడుస్తున్న విదేశీ చిత్రాన్ని మధ్యమధ్య అరమోడ్పు కళ్లతో చప్పరిస్తూ, అలవోగ్గా అరడజను మందితో స్టోరీ డిస్కషన్ పెట్టుకుక్కూర్చును న్నాడు.

ఉన్నట్టుండి ఒక్కసారిగా లైట్లారిపోయాయి...

దాంతో అక్కడున్నవాళ్ల కదలికలూ ఆగిపోయాయి...

ఆ అరడజనుమందివీ చిత్రమైన పేర్లే!

జానపదాల్లో అగ్గివీరుడు, అగ్గిమనిషి, అగ్గిపిల్ల వగైరా అగ్గిలాంటి కథలందించి ప్రస్తుతం చల్లబడిపోయిన కథన కుతూహలుడు ఫోక్‌సింగ్‌బాబు (పాత జానపద చిత్రాల్లో రాజుగార్ని మట్టుబెట్టి రాజ్యం హస్తగతం చేసుకోడానికి కుట్ర పన్నే సేనాధిపతీ కమ్ బామ్మర్దీ టైపు క్యారెక్టర్ని అనుకరిస్తూ) "డిస్కషన్ ఆపక్కర్లేదు కానీండి'' అంటూ హూంకరించాడు.

సినీ నిర్మాణ పరిభాష ప్రకారం అప్పటికది అక్షరాలా అరవయ్యో స్టోరీ సిట్టింగు. మూడు నెల్లవుతోన్నా కథ మాత్రం అంగుళం మేర కూడా ముందుక్కదలడంలేదు. నిర్మాతకి మందుబిల్లు మాత్రం భారీగా అందుతోంది.

తన ఏకైక పుత్రిక పేర్న ప్రొడక్షన్ పెట్టి అంతకుముందు తీసిన భారీ సినిమాలన్నీ చీదెయ్యడంతో ఆయనో నిర్ణయానికొచ్చాడు.

ఈసారి కూతురు పేర్నగాకుండా బ్యానర్ ఇంట్రడక్షను తనదే ఇచ్చుకోడానికి ఉత్సాహపడ్డ ఆ నిర్మాత సదాశయంగారి ఆదేశం మేరకు గత ఎనభై తొమ్మిది రోజులుగా అదిరిపోయేకథ కోసం జనమేజయం ఈ అరడజను మందితోనూ మందుతోనూ స్టోరీ సిట్టింగ్స్ వేస్తున్నారు.

ఇప్పుడు తీయబోయే పిక్చర్‌తో తన సినీ భవిష్యత్ అటో ఇటో తేలిపోవాలన్నది సదాశయంగారి పట్టుదల.

తాను ఫీల్డులో నిర్మాతగా కొనసాగడమో నెత్తిన పైపంచె వేసుకుని స్వంత ఊరు పారిపోయి శ్రేష్టమైన పొగాకు బేళ్లు అమ్ముకోవడమో ఏదో ఒకటి జరగాలన్న స్థిర నిశ్చయానికి వచ్చేసినందున, సదాశయంగారు తన శాయశక్తులా పవరూ- ఫైనాన్సూ ఈ చిత్రానికి ధారపోస్తున్నారు.

అంచేత సదాశయం, సవాలక్ష సాధక బాధకాలున్న ఇప్పటి ఫీల్డులో చీటికీ మాటికీ ప్రొడ్యూసర్‌కు బీపీ పెరక్కుండా హీరోహీరోయిన్ల కాల్షీట్ అరేంజ్‌మెంట్స్ దగ్గర్నుంచి లాబ్‌లోంచి ప్రింట్లు బైటికొచ్చేదాకాగల సమస్త చిత్రప్పన్లూ తన నెత్తినే వేసుకునే దర్శకుడిని చేరదీశాడు. నిర్మాతకి టెన్షన్ నిల్లూ భారీగా బిల్లూ ఇవ్వగల లేటెస్టు ఫిలిం యుగపురుషుడని పేరు వడసిన డైరెక్టర్ జనమేజయంగారి పేరు అలా అనౌన్స్ చేస్తేచాలు... ఇలా రయ్యిన బయ్యర్లు పరిగెత్తుకొస్తారని ప్రతీతి.

అందుకే ఖర్చుకు వెనకాడకుండా షరతులకు వెరవకుండా దేంట్లోనూ తాను వేలూ, కాలూ పెట్టకుండా కేవలం నోర్మూసుకుని చెవులూ- గుడ్లూ అలా అప్పగించి చూస్తున్నాడు సదాశయం.

మాస్ అట్రాక్షన్ పరంగా అంటే బిగ్రేడ్, సిగ్రేడ్ సెంటర్లలో జనం సీట్లు చింపేసి మరీ తమ హర్షాతిరేకం ప్రకటించే సీన్లు అల్లడంలో, అల్లించడంలో జనమేజయంది




అందెవేసిన చెయ్యి.

ఒక్కమాటలో చెప్పాలంటే అతడి విజయ రహస్యం జనమే.

అతడి సినీ సర్వ్‌యాగానికి సహక రించడం కోసం అన్ని రకాల కథలూ చెప్ప డంలో దిట్టలైన సింగ్‌బాబులాంటి కథా సింగాలు నిత్యం పరివేష్టితులై ఉంటారతడి చుట్టూ.

కావాలంటే దేనికదే విడివిడిగానూ కలిపి కాక్‌టెయిల్‌లాగానూ సెర్వ్ చెయ్యగల సమ ర్థులు వీళ్లు.

అతి పాత (రెండు పౌరాణిక పిక్చర్లనుంచి యమఫాస్ట్‌గా సాగే సైన్స్ ఫిక్షన్ వరకూ దేన్నైనా వీరు సృష్టించగలరు.

అంతా డిస్కషన్‌కంటిన్యూ చెయ్యబో తూండగా ఎక్కడినుంచో గానీ సుతారంగా ఓ అందెల రవళి విన్పించింది.

"ఈ చీకట్లో 'సిన్‌జినీరవం ఏంటబ్బా?" ఆశ్చర్యపోయాడు జనమేజయం.

"చీకట్లో శింజినీరవం... టైటిల్ భలే వెరైటీగా ఉందిసార్!" సునీల్ కాంప్లిమెంటు.

"టైటిల్ సరే! ఇంత అర్థరాత్రి... అందెల చప్పుడు... అదేదో సినిమాలోలాగ.. ఉల్లిపొ రలాంటి తెల్లచీరతో తేలిపోతూ వస్తోన్న ఏ ఆత్మో, దయ్యమో కాదుగదా!"

"అసలైన నిశాచరులం మనమే! రాక్షసు ల్లా, దయ్యాల్లా రాత్రి తెల్లార్లూ మేలుక్కూ ర్చుంటాం! మనని మించిన ఘోస్ట్ లెక్కడు న్నాయ్?" శ్లేష ధ్వనింపజేస్తూ ఘోస్టు పదా న్ని వత్తి పలుకుతూ అన్నాడు ఏమన్.

అయినా, అందరి గుండెల్లోనూ సన్నగా దడ...

రూం బాయ్ దస్తగిరి ఎమర్జెన్సీ లైటుతో లోపలికొచ్చాడు.

ఆ వెనుకే శ్రావ్యంగా దగ్గరైన నూపుర ధ్వని.

ఆ కలరవానికి కారకురాలైన పాతికేళ్ల పరువం, వెలవెల బోతూన్న చిన్నలైటు ముందు తళుక్కున మెరిసింది.

అందరి దృష్టీ ఆమె మీదే కేంద్రీకృత మైంది.

దస్తగిరి చిన్నగా దగ్గి పరిచయం చేస్తూ న్నట్టుగా అన్నాడు,

"ఈవిడ మంచి డాన్సర్ సార్! పేరు నమీచి. మన ఈ హోటల్‌కి అటాచ్డ్ బార్‌లో వీక్లీ ట్వయిస్ వీరి ప్రోగ్రాం వుంటుంది" అని కొంచెం ఆగి అందరి ముఖాల్లోకీ పరిశీలనగా చూశాడు.

జనమేజయం వైపు తిరిగి "మీరు స్టోరీ డిస్కషన్స్‌లో ఉన్నారుగదా అని, మిమ్మల్ని కలపమంటేనూ తీసుకొచ్చేను" అన్నాడు.

దస్తగిరి చెప్పడం ఆపగానే "నమస్తే డైరెక్టర్‌సాబ్!" అంది నమీచి వయ్యారంగా చేతులు జోడించి.

చాలా స్టయిలిష్‌గా ఉంది...

మాంచి వయసులో ఉంది...

ఒక్కసారి చూస్తే చాలు! చూపు మరల్చు కోలేనంత అందం కాదుగాని ముఖ్యంగా ఆమె ముఖారవిందం మీద టోటల్‌గా చెప్పు కోదగ్గ ఆకర్షణ ఆమె కళ్లు.

ఆ కళ్లలో ఏదో వింత మెరుపు. అనిర్వచనీ యమైన ఆకర్షణ!

ఆ కళ్లలో కాంక్షలేదు. అర్థమయీ అర్థంకాని తీక్షణత ఉంది. తాపంకాదు... ఏదో సాధించాలన్న తపన ఉంది... కామంలే దు... ఏదో అభివ్యక్తం చెయ్యాలన్న కామన ఉంది.

కవ్వింపులేదు... గాని చెప్పడానికి తనకో ఛాన్సివ్వమంటున్న అభ్యర్థన ఉంది.

అప్రయత్నంగా "నమస్తే!" అంటూనే "ప్లీజ్! బీ సీటెడ్" అన్నాడు ఖాళీకుర్చీకేసి చూపిస్తూ జనమేజయం.

"థాంక్స్ ఎలాట్" అంటూ కూర్చుంది నమీచి.



"నమీచి... నమీచి అనే పేరు ఏదో చైనీస్ నేమ్‌లా, నవీనంగా ఉందికదూ!" డీఎస్కే గుసగుసగా అన్నాడు.

"కాదు! పాతదే. కాకపోతే కాస్త పౌరాణికం వాసనేస్తోంది" అన్నాడు కర్తవ్యరాయ్.

"ఆం!" అన్నారు మిగతావాళ్లు ఆశ్చర్యంగా.

"యస్! మనకందరికీ కామన్‌గా తెలిసిన అప్సరస స్త్రీలు రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమలే. ఇతర పేర్లు మూడో నాలుగో మించి తెలీదు. కాని ఇంకా చాలామంది అచ్చర కన్నెలున్నట్టు ప్రబంధాలు ఎన్నో చెప్తున్నాయి. ఉదాహరణకి అనంతరాజకవి తన కాకుత్స్థ విజయంలో హారిణి, అనంగలతిక, సౌరభేయి, శుభానన అండ్..."

ఆ వాక్ప్రవాహానికి అడ్డుకట్ట వేస్తూ "ఓకే ఓకే! ది ఎండ్. అక్కడికి ఆపు! ఇప్పుడా పురాణ కాలక్షేపం మనకొద్దు!" డిక్లేర్ చేశారు జనమేజయంగారు.

ఆమెని అప్సరస్త్రీగా రాయ్ గుర్తించడంతో అంత మంచి పేరు పెట్టుకున్నందుకూ అర్ధరాత్రయినా అరడజనుమంది మగాళ్ల దగ్గరికి జంకూ గొంకూ లేకుండా వచ్చినందుకూ మరో రూట్‌లో ఆమెని భావించుకున్న సింగ్ అడిగాడు.

"వాట్‌కెన్ వుయ్ డూ మిస్? సిన్మా ఛాన్స్ కోసమా? అఫ్‌కోర్స్! ఫిగర్ ఓకే అనుకో! కానీ మా ప్రొడక్షన్ ఇంకా డిస్కషన్ స్టేజీలోనే ఉంది. వేషాలేం ఫిక్స్ చెయ్యలేదు''

కిందినుంచి పైదాకా పరిశీలనగా చూస్తూ ఫీలింగ్స్ కోసం ఆమె ఫేస్ దగ్గర ఆగాడు.

"నోనో! తెరమీద కన్పించాలన్న తపన నాకేం లేదు. నటన మీద మోజూలేదు. నేనుంటున్నదీ ఈ గ్లామరస్ ఫీల్డులోనేగా! ఇక్కడికొచ్చే కష్టమర్లకి కనువిందుగా డాన్స్ చేసే ప్రొఫెషన్ నాది! అయినా ఈ అందమైన నర్తన వెనుక నటన ఉంది. ఇంకా చెప్పాలంటే అంతులేని ఆవేదన ఉంది. బట్.. అదంతా ఇప్పుడు అప్రస్తుతం! నేనిప్పుడొచ్చింది మీరు అనుమతిస్తే మీ డిస్కషన్‌లో పాలు పంచుకోవాలని''

ఎంతో ఈజ్ ఉంది నమీచి మాటల్లో.

"ఇక్కడ పాలు పంచుకోవడమన్న ప్రసక్తే లేదు. ఉన్నదంతా ద్రవమే! హాట్ డ్రింక్..." స్పాంటేనియస్‌గా అన్నాడు సునీల్.

"ఐసీ! నైస్ జోక్, అయినా, అదీ నాకేం కొత్తకాదు! సరే! నా పద్ధతిలో నేనో స్టోరీ చెప్పాలనుకుంటున్నాను, మీకు పనికొస్తుందేమో చూస్తారనీ''

"నీకథా?" అడిగాడు జనమేజయం.

"నాకథ కాదు... అంటే నా పర్సనల్ స్టోరీ కాదు! సిన్మాకో కథ. అచ్చంగా సినిమా కోసం సినిమాలాగే సాగే పరమ సిన్మాటిక్ కథ"

"నువ్వు తయార్చేశావా?"

"వైనాట్?"

"ఏం అనుభవం ఉందని? పైగా సిన్మా స్టోరీ అంటే అంత ఆషామాషీ అనుకుంటున్నావా? కొన్ని లక్షల మంది ప్రేక్షకుల్ని రెండున్నర గంటలు సీట్లో కట్టిపడెయ్యగల గాలి! ఇక్కడ ఇంత మందిమి ఉన్నాం! అలాంటికథ మేం తయారు చేసుకోలేమా?"

"మీరు చేసుకోలేరని నేననడం లేదు. కానీ 'టూ మెనీ కుక్స్ స్పాయిల్ ద సూప్' సామెతలా అందరూ కలిసి పాకంపట్టి వండిన కథ ఛండాలంగా తయారవ్వొచ్చేమో! ఐ మీన్ మరోలా భావించకండి! పూర్తి అవగాహనతో ఒకే బ్రెయిన్లో రూపొందిన కథ పవర్ఫుల్‌గా ఉంటుందని నా ఉద్దేశం. అంచేత నా కథ విన్నాక కామెంట్ చేస్తే బాగుంటుందేమో!"

నమీచి సమర్ధనకు అబ్బురపడ్డారందరూ.

జనమేజయం ఆమెనెక్కడ భయపెట్టి తరిమేస్తాడోనని నమీచి అందాన్నాస్వాదిస్తూ ఆనందిద్దామనుకుంటున్న ఘోస్టు షష్టకం ఆమె డైలాగ్స్‌నే బలపరుస్తూ "అవున్సార్! విన్నాకేకదా కామెంట్ చెయ్యడం" అన్నారు.

"మనకి మరేం పన్లేదా? ఏ దారిన పోయేవాళ్ల కథో తీరిగ్గా విన్డానికిక్కడ కూర్చున్నామా? ఏం మన బుర్రల్లో ఐడియాలు ఇంకిపోయేయా? అందరూ సిన్మా స్టోరీలు చెప్పెయ్యడమేనా?"

తన అనుచరగణం వంకా, నమీచి వంకా మార్చిమార్చి చూస్తూ అడిగాడు జనమేజయం.

"అలా అనొద్దు డైరెక్టర్ సాబ్!"

"ఏ స్టోరీలో ఏ హిట్టుంటుందో ఎవరు చెప్పగలరు?"

"మొనాటనీ బ్రేక్ చేసి వెరైటీని స్వాగతించాలంటే ఎవరిస్టోరీనైనా విని తీరాల్సిందే!"

"ఆమధ్య ఓ ప్రముఖ డైరెక్టర్ గారన్నట్టు కథ అనేది కాఫీలందించే కుర్రాడి దగ్గర్నుంచీ





కాసులు గుప్పించే నిర్మాతదాకా అందరూ వేళ్లూ కాళ్లూ పెట్టగలిగిన కళ. ఎవరి ఊహనె గ్గుకొస్తుందో ఎవరు చెప్పగలరు సార్?"

"ఒక్కో సబ్జెక్టుని ఒక్కొక్కరో వెర్షన్‌లో డీల్ చేస్తారు''

విభిన్న స్వరాలు విన్నాక, జనమేజయా నికి సరేననక తప్పలేదు.

"అలాగే! మెజారిటీ ఇష్టపడుతున్నారు కాబట్టి, వినడానికి మాకేం అభ్యంతరం లేదు. కాని ప్రస్తుతం మేం కామెడీ సబ్జెక్టని కథ కూడా అనుకోకముందే ఓ ప్రముఖ కామెడీ హీరోతో ద్విపాత్రాభినయం చేయిస్తు న్నట్టు మొన్నామధ్య ప్రెస్‌మీట్‌లో అనౌన్స్ చేశాం! మీ కథ మాకెలా పనికొస్తుందా అన్నదే ఆలోచన"

అంతవరకూ నోరు విప్పని సదాశయం, గత యాభై తొమ్మిది రోజులుగా జరుగుతు న్న తంతు చూస్తున్నందువల్ల ఈవిడవల్లనై నా ఈనాటికి కథ ఓ కొలిక్కి వస్తే బావుండు ను అనుకున్న వాడై "స్టోరీ బావుంటే మా ర్పులూ చేర్పులూ చేసుకోవడం మనకేం కష్టం కాదుగా!" అన్నాడు.

జనమేజయం నవ్వుతూ సదాశయం వంక చూశాడు. "అయితే మీతో సహా అంతా ఆవిడ కథ వినాలన్న ఇంట్రస్టు చూపిస్తున్నారన్న మాట!"

"ఆవిడ కథకాదు ఆవిడ చెప్పేకథ" సవ రించాడు సదాశయం.

"సరే! కాని ముందే చెప్పేనుగా అది పాత్రద్వయానికి సూటవ్వాలి అనీ, పైగా అనుకున్న కామెడీ హీరోగారి ఇమేజ్‌కి తగ్గ ట్టుగా ఉండాలి అనీ మధ్యలో అందంగా పాటలకీ ఫైట్లకీ చోటుండాలి అనీ''

"ఓహ్! ఇంతేకదా! పాటలు కష్టపడి ఇరి కించక్కర్లేకుండా సన్నివేశం మీదుగానే వచ్చేలా కథ చెప్పమన్నా కూడా సిద్ధమే!" చిన్న చురక అంటించింది నమీచి.

"సీన్ల అల్లిక ఎంతో పకడ్బందీగా ఉంటే తప్ప అలా సిట్యుయేషనల్ సాంగ్స్‌కి చోటుండదు'' అన్నాడు డీఎస్కే.

"అందులోనూ ద్విపాత్రాభినయానికి ప్రా ధాన్యత ఉండేలా కథ అల్లుకు రావడమంటే మజాకా? జోడు మద్దెల వాయింపు'' అందు కున్నాడు జంబులింగం.

"కథ అల్లే చాకచక్యం ఉండాలేగాని ద్వి పాత్రలూ త్రిపాత్రలూ ఓ లెక్కా? ఇంకా చెప్పాలంటే బహు పాత్ర చిత్రణల మధ్యా ఎన్ని కసరత్తులైనా చెయ్యొచ్చు. ఆయనెవరో సినీ మహానుభావుడు చెప్పినట్టు తెలుగు సిన్మా కథల్లేక కదలలేకపోతోంది అని''

"అబ్బా! అంత చాతుర్యం ఉందా తమ కి?" వెటకారం సంధించాడు జనమేజయం.

"పూర్వాశ్రమంలో నేనో రచయిత్రిని సార్!"

అదిరిపడ్డారందరూ సదాశయంతోసహా.

"ఆc... అంటే హాబీగా ఈ ప్రొఫెషన్లో కొచ్చానన్లెండి అయినా నా పర్సనల్‌స్టోరీ మీక నవసరంగదా!"

"ఏంటేంటీ? ఓ లేడీ రైటర్ స్టార్ హోటల్లో సెక్సీ డాన్సరా? ద్విపాత్రాభినయం అన్న మాట!"

"అటునుంచి ఇటెందుకు కాకూడదూ? నర్తకిలోనే రచయిత్రి ఎందుకుండకూడ దూ?" చాలా మామూలుగా అంది నమీచి.

గట్టిగా నవ్వేసి "ఎలాగైతేనేంగాని ఏదో అచ్చులో పేరు చూసుకున్నంత మాత్రాన రచయిత్రినంటే సరా? ఇవాళ ఆంధ్రదేశంలో అచ్చులో పేరుపడ్డ ఎంతోమంది ఆడాళ్లు నీలాగే మా వెంటబడితే నా సిన్మాల గతేంగా ను?"

జనమేజయం నమీచిని డిగ్రేడ్ చేస్తున్నా ఆమె తొణకలేదు.

"సారీ! నేను మీరనుకుంటున్నట్టు ఉత్తర రచయిత్రినికాను'' అంది.

"అసలూ నా సిన్మాలహిట్టు వెనుక సీక్రెట్టొ

# భలే పిట్ట!




ఈ పంచెవన్నెల రామచిలుక వయసు ఏడేళ్ళేగానీ, నకల విద్యాపారంగతురాలు. అమెరికాలోని ఫ్లారిడాకు చెందిన సైప్రెస్ గార్డెన్స్‌లో వాటర్ స్కేటింగ్ ప్రదర్శనలిస్తుంటుంది. వైరుమీదుగా చిన్న సైకిల్ సైతం నడుపుతుందీ రంగుల రామచిలుక.








కటి ఉంది. అదేమిటో తెల్సా? చిత్రంలో అంతర్లీనంగా ప్రవహించే ఆదర్శం', ఒక మెసేజ్ మిక్స్ చేసి, దానికి ఇతర కోటింగ్స్ పూసి, కథ నడిపించుకుంటూ పోవడం నా ట్రెండ్''

"మీ విధానం తెలీకుండానే మిమ్మల్ని కథ వినమంటున్నానని మీరెందుకనుకుంటున్నారు? అయినా నేను ముందే చెప్పాకదా ఊహ ఉండాలేగానీ అసాధ్యమేదీ లేదని''

"ఓకే! కాని ఓ డౌటు.ఆడాళ్ల కథల్లో ఐమీన్ ఆడవాళ్లు చెప్పే కథల్లో సీరియస్‌నెస్సే ఎక్కువ వుంటుంది. కష్టాలూ కన్నీళ్లూ ఏడ్పులూ మొరలూ''

"ఆగండాగండి! లైటర్ వెయిన్లో రాయడమో చెప్పడమో స్త్రీలకి రాదనా మీ ఉద్దేశం? మిర్చిమసాలా తీసిన మీరానాయర్ సంగతేంటి? అంతెందుకూ! లేడీ రైటర్ అండ్ డైరెక్టర్ సాయి పరాంజపేని ఉదాహరణగా తీసుకోండి! చష్మే బద్దూర్, జాదూకా షాంక్ ఇవి హాస్య చిత్రాలకిందికి రావా?"

నమీచి సూటి ప్రశ్నకి జనమేజయానికి నోట మాట రాలేదు.

"ఈమె సామాన్యురాలుకాదు! ఫీల్డుమీద అవగాహన ఉన్నట్టే కనిపిస్తోంది'' అనుకుంటూనే "అయినా హిట్స్ జాబితాలో ఉన్న లేడీ డైరెక్టెడ్ చిత్రాలెన్ని? ఫార్ములా విడిచి సాముచేస్తే ఎలా?" అనేశాడు.

"నోనో! అలా నేనెందుకంటాను? లేడీ రైటర్ అండ్ డైరెక్టర్ కల్పనాలజ్మీ 'రుడాలి' తీశాక ఓ యింటర్వ్యూలోనూ ఇదేమాట చెప్పిందిగా! ఫార్ములా కూడా ఉండి తీరాలి, కమర్షియల్ సక్సెస్‌కి. వాటివల్ల సిన్మాకి మినిమమ్ గ్యారంటీ వుంటుంది అని''

ఈ మాటల్తో నమీచి పట్ల ఓ సదభిప్రాయం క్రమంగా కలగసాగింది జనమేజయానికి.

"ఓకే! అయితే మా అవసరాల ప్రకారం, స్టోరీ ఉన్నట్లయితే ఇంతకాలంగా మాకున్న సిద్ధాంతానికి విరుద్ధంగా మీకే టైటిల్ క్రెడిట్ ఇస్తాం!''

"అంటే?"

"మా టీమ్‌లో వర్కింగ్ పార్ట్ అందరికీ సమానంగా ఉంటుంది. సాధారణంగా మేమంతా కలిసి యూనిట్‌లాగా కథ తయారు చేస్తాంకదా! అంచేత కథ ఎవరిదైనా కథ, స్క్రీన్‌ప్లే, డైలాగ్స్, దర్శకత్వం అన్నిటికీ జనమేజయంగారి పేరే సామాన్యంగా వస్తూంటుందనేది మీకు తెలీని సంగతి'' జంబులింగం జవాబిచ్చాడు.

"కానీ మీ కథలో ఐమీన్ మీరు చెప్పే కథలో కొన్ని పాయింట్లు మేం ఉపయోగించుకుంటే మాత్రం మీకు కేవలం రెమ్యూనరేషన్ మాత్రమే ఇస్తాం" అన్నాడు జనమేజయం.

"షరతులు తర్వాత ముందుకథ"

"రైట్! కానివ్వండి''

నమీచి ఆ సినిమా కథ చెప్పసాగింది...

  

సందడిని సంతరించుకుంటున్నాయ్ సిటీ రోడ్లు...

క్లాక్ టవర్లో గడియారం ఉదయం పది గంటలు సూచిస్తోంది.

ట్రాఫిక్ సిగ్నల్ అల్లంత దూరంలో ఉంది. రెడ్‌లైట్ పడేలోగా, దాన్ని దాటిపోవాలని గ్రీన్‌కలర్ మారుతీ కారొకటి ఆత్రపడుతోంది.

కారు బ్యాక్‌గ్లాస్ మీద తేనెరంగు స్క్రీన్ పేపర్ ఉండటంతో కార్లో ఎవరున్నదీ తెలీడంలేదుగాని పేపర్‌పైమాత్రం గోల్డెన్ ఎల్లో కలర్లో దీపిక అనే అక్షరాలు మాత్రం కన్పిస్తున్నాయ్!

అప్పటికి ఓ పది నిముషాల ముందు నుండి బుల్లెట్ మీద ఆ కారుని ఫాలో అవుతున్నాడు తరుణ్ అనే పాతికేళ్ల అందగాడు.

అతగాడు చురుకు చూపుల చినవాడు.

గమ్మత్తయిన లుక్స్, హుషారు మాటలతో అమ్మాయిల్ని ఇట్టే ఆకట్టుకుని ఎక్కడికైనా ఎంతవరకైనా తనతో తీసుకెళ్ళిపోగల నేర్పరి. ప్లేబాయ్ టైపు క్యారెక్టరన్నమాట!

నిజానికి అతడి దృష్టి గ్లాసమీద ఉన్న అక్షరాలపై లేదు. కారుని డ్రయివ్ చేస్తున్న గాజుల చేతిమీదే ఉందతడి దృష్టి. ఎప్పటికప్పుడు కారుని దాటేద్దామనీ, కారుని నడుపుతున్న లలనామణి ముఖారవిందాన్ని దర్శిద్దామనీ మహా కుతూహలంగా ఉన్నాడుకాని, ప్రతిసారీ ఛాన్స్ మిస్సవుతున్నాడు. ఇంచుమించు కారు వెనక చక్రాలతో సమానంగా ఫాలో అవుతున్నాడు.

తరుణ్ వెనుక | బర్ముడాస్, లూజ్ షర్ట్, ఫ్రెంచ్‌కట్ మీసం, కర్లింగ్ హేర్‌ని దాచే హేటూ, జారు కళ్ళద్దాల విచిత్ర వేషధారణతో గేమ్సుబాండ్ అనే ఓ ముప్పయ్యేళ్ళ ప్రయివేటు డిటెక్టివ్ నిశితంగా దీపిక అనే ఆ అక్షరాలవంకే చూస్తున్నాడు.

నగిషీతో తీర్చిదిద్దినట్టున్న ఆ రవ్వల గాజులమీద నుంచి దృష్టి మరల్చుకోలేకపోతున్నాడు తరుణ్.

కారూ, బుల్లెట్ ట్రాఫిక్ సిగ్నల్‌కు చేరువగా వచ్చేసరికి సడెన్‌గా ఎర్రలైటు పడింది.

తన కోటూ, హేటూ స్టయిలిష్‌గా సవరించుకున్నాడు డిటెక్టివ్ గేమ్సుబాండ్.

గ్రీన్‌కలర్ మారుతీ ఒక్క జర్క్‌తో ఆగింది.

తానూ ఆమె డ్రయివ్ చేస్తున్న సైడ్‌కే బుల్లెట్‌ను లాగించబోయాడు కానీ, తనకంటె స్పీడ్‌గా ఓ బొండాంగాడు స్కూటర్‌తో రయ్యిన వచ్చి ఆమె పక్క ఆగడంతో విసుగ్గా 'షిట్' అనుకుంటూ సడెన్‌బ్రేక్ వేసి కాలు కింద ఆన్చాడు తరుణ్!

వెనుక కూర్చున్న గేమ్సుబాండ్ చప్పున దిగి, "పచ్చలైటు పడేలోగా ఈ సెంటర్లో ఓ చిన్న కునుకు తీసి లేవొచ్చు!" అన్నాడు హుందాగా ఫేంటుని సగానికి కట్‌చేసినట్టున్న బెల్టు నిక్కర్ జేబుల్లోకి తన చేతులు పోనిస్తూ.

అసలే విసుగ్గా ఉన్న తరుణ్ మెడ బాగా ముందుకి సాచి లాభం లేకపోవడంతో ఆ విసుగుని గేమ్సుబాండ్‌మీదకి మళ్ళించి "నువ్వేం డిటెక్టివ్‌విరా బాబూ? నిద్ర మొహమూ నువ్వూనూ'' అన్నాడు.

"నో! నో! అయాం గేమ్సుబాండ్! డిటెక్టివ్ గేమ్సుబాండ్' నిక్కరు పట్టీ వెనక్కీ ముందుకీ లాగుతూ తమాషాగా అన్నాడు ఇంకా స్టయిలిష్‌గా.

ఇంతలో సిగ్నల్‌లో పచ్చలైటు పడింది. కారు కదిలింది.

కార్లోని అమ్మాయి చేతివంక తినేసేలా చూస్తూనే, పళ్ళబిగువున "తొందరగా ఎక్కరా!" అంటూ స్టార్ట్ చేయబోయాడు తరుణ్.

గేమ్సుబాండ్ ఎక్కబోతూంటే, అతడి తలమీదున్న హేట్ ఆ తొందరకి కిందపడిపోయింది. అది తీసుకోవడంకోసం మళ్ళీ ఎక్కడ దిగబోతాడోనని, తానే ముందుగా "పోతే పోనీ!" అన్నాడు తరుణ్.

ఆ వెంటనే తాతలనాటి కోటు బొత్తాం కూడా ఊడిపోయిందతడిది ఎక్కడో!

"నా కోటు బటన్ కూడా!" అంటూన్న గేమ్సుబాండ్‌ని మధ్యలోనే కట్‌చేస్తూ, "పోతే పోనీరా!" మరింతగా పళ్ళు నూరుతూ అన్నాడు తరుణ్.

గేమ్సుబాండ్ దిగిపోతూ "నో! నో!! నో!!! అదేం కుదర్దు. హేట్ పోయినా కొత్తది దొరుకుతుంది... బట్... ఈ కోటు బటన్.... లార్డ్ మౌంట్‌బాటెన్ కాలంనాటిది. ఇలాంటి పాత మాస్టర్‌పీస్..." ఇంకా ఏదో చెప్పబోతుండగా మళ్ళీ తరుణ్ అందుకుని, "ఒరేయ్! ఈ నడిరోడ్డు సెంటర్లో దొరకడం కష్టంరా!" అన్నాడు చిరాగ్గా.

వెనక వాహనాలవాళ్ళ హారన్ల మోత...





"ఎక్కరా బాబూ! అసలు తప్పంతా నాది! పెళ్లికి వెళ్తూ పిల్లిని చంకన పెట్టుకెళ్లిన ట్లు..." అని రుసరుసలాడసాగాడు తరుణ్.

"జస్టె మినిట్" అంటూనే, కింద వెతకసాగాడు గేమ్స్‌బాండ్.

మళ్లీ వెనక వాహనాల హారన్లమోత.

"సరే! నువ్వలా సెర్చ్ చేస్తూనేఉండు! నే వస్తా!" అంటూ రయ్యిన తానే దూసుకుపోయాడు తరుణ్ అప్పటికే ట్రాఫిక్ సిగ్నల్‌ని దాటి అవతలకి వెళ్లిపోయిన గ్రీన్ కలర్ మారుతీనే తదేకంగా చూస్తూ.

"జాగ్రత్తరోయ్! ఆ బుల్లెట్ అసలే కండిషన్లో లేదు నీలాగ" అనే గేమ్స్‌బాండ్ కేక వెనకనుంచి విన్పిస్తున్నా వినిపించుకోనట్టు వెళ్లిపోయాడు తరుణ్.

అతడి దృష్టి అంతా ఆ గ్రీన్‌కలర్ మారుతీలో ఉన్న ఆ గాజుల చెయ్యి ఎవరిదో చూడాలన్న ఆత్రంలో ఉంది.



ముమ్మూర్తులా తరుణ్‌నే పోలివున్నాడు చరణ్.

ఆకారంలో, హైటూ, వెయిటూ, కలరూ అచ్చుగుద్దినట్టున్న చరణ్ స్వభావంమాత్రం తరుణ్‌కి పూర్తిగా విరుద్ధం.

బుద్ధుడిలా, అతి బుద్ధిమంతుడిలా రోడ్డు పక్కగా చాలా జాగ్రత్తగా నడిచివెళ్తున్నాడు.

ఆ రంగూ, రూపురేఖా విలాసాలూ చూసినవాళ్లు చరణ్‌ని తరుణ్‌గా భ్రమపడే ప్రమాదం ఉంది. ఆ ఒక్క దూకుడుతత్వం కూడా చరణ్‌కి పట్టుబడినట్లయితే తరుణ్ దిమ్మదిరిగి పడిపోవడం ఖాయం.

వెనుకనుంచి వస్తూన్న పల్లవి తన కారు హారన్ మోగించేసరికి ఆలోచిస్తూ నడుస్తున్న చరణ్ కంగారుగా రోడ్డుమధ్యకి వచ్చేశాడు.

గాగుల్స్‌ని స్టయిల్‌గా సవరించుకుంటూ, మళ్లీ హారన్ మోగించింది పల్లవి.

కదలడు చరణ్...

కంగారుగా రోడ్డుమధ్య నిలబడిపోయాడు...

కారు స్లో చేసుకుంటూ దగ్గరగా వచ్చి, "ఏయ్ మిష్టర్! ఏమన్నా చెవుడా? హారన్ విన్పించలే? రోడ్డుకి అడ్డంగా నడుస్తున్నావ్?" గద్దింపుగా అడిగింది.

"సారీ అండీ!" నిదానంగానూ, నమ్రతగానూ చెప్పాడు చరణ్.

"సారీ...ట...సారీ! ఈమధ్య ప్రతివాళ్లకీ ఇదో ఊతపదం అయిపోయింది" చిరుచిరాకు ప్రదర్శించింది పల్లవి. బాగా స్వేచ్ఛా వాతావరణంలో ఎలాంటి కట్టుబాట్లూ లేకుండా చలాకీగా పెరిగిన పిల్ల. ఆకతాయి గుణం, అల్లరిపట్టించే సరదా చిన్నప్పటి నుంచీ అలవడ్డాయి ఆమెకు.

ఏం మాట్లాడకుండా, తల మరోవైపు తిప్పి పక్కగా నడవసాగాడు చరణ్.

"ఇలాగే... పరమ బుద్ధుడిలాగ కార్లకడ్డంపడ్డం, ఏక్సిడెంట్ చేశారంటూ వేలకి వేలు గుంజడం..."

రెచ్చగొట్టాలనే, కావాలని ఓరకంట చరణ్‌ని చూస్తూ కారు స్లోగా నడపసాగింది.

మళ్లీ నిలబడిపోయిన చరణ్, "నాకటువంటి బుద్ధుల్లేవండి" అన్నాడు తలెత్తకుండానే.

మరింత కవ్వింపుగా "తెలుస్తూనేవుంది!

గొప్పగా నటిస్తున్నావే!" అంది పల్లవి.

"నేనేం చేశానండి బాబో!" కణతలమీద అరచేత్తో రుద్దుకున్నాడు చరణ్.

"చెయ్యడంకాదు... చూడ్డం! సరిగ్గా చూడు! నన్నెక్కడైనా చూసినట్టు గుర్తుందా?" అధికారికంగా ప్రశ్నించేసరికి ఆ పిల్లవంక చూడ్డానికి అరచెయ్యి మెల్లగా తలమీదకి జరుపుకోబోతూండగా మళ్లీ పల్లవే అంది కవ్వింపుగా, మునిపంట వస్తూన్న నవ్వుని ఆపుకొంటూ "నేనసలే సామాన్యురాల్ని కాను'' అంటూ.

వెంటనే ఠక్కున మోచేతిని కళ్లకడ్డం పెట్టుకుని, అటు తిరిగి, "అయితే అస్సలు చూడనండి బాబో! నాదార్న నన్ను పోనివ్వండి!" కంగారుగా అన్నాడు చరణ్.

"ఎక్కడికి పోవాలి?" దర్పంగా అడిగింది.

"ఎక్కడికైతే మీకెందుకండీ? మీరసలే సామాన్యురాలు కాదుగా!" అమాయకంగా అన్నాడు చరణ్ ఇటు తిరగకుండానే.

"అందుకే... మర్యాదగా చెప్పు!" మరింత దర్పాన్ని, కవ్వింపునీ మిళితంచేస్తూ అంది పల్లవి.

"చెప్పక తప్పదాండీ? అయితే చెప్పేస్తున్నాను వినండి! పండూ ట్యుటోరియల్స్ అండ్ లైఫ్ ఇన్స్టిట్యూట్కండి!"

"ఆల్రైట్! కారెక్కు!" ఆర్డర్ వేస్తున్నట్లు అందామె స్వరం.

కొంచెం భయంభయంగా "ఎ... ఎ... ఎందుకూ?" అడిగాడు చరణ్.

"డ్రాప్ చేస్తాను'' సింపుల్గా అంది పల్లవి.

భయం తీరినవాళ్లాగా, పూర్తిగా ఇటు తిరిగి "థాంక్స్!... వద్దండి... నేను నడిచెళ్లగల్ను!" గబగబా రెండడుగులు వేశాడు చరణ్.

"నా కారెక్కుతావా! లేక నీమీదకి కారు ఎక్కించేయమంటావా?"

"యూ మీన్... యాక్సిడెంట్?" అమాయకంగా మొహంపెట్టి, భయం అభినయిస్తూ అడిగాడు చరణ్.

"య్యా!" స్థిరంగా అంది పల్లవి గాగుల్స్ సర్దుకుంటూ.

"అలా అయితే కారెక్కడమే నయం" సన్నగా అని, వెనకడోర్ తీసుకుని ఎక్కబోయాడు.

ఈలోగా తన పక్కడోర్ ఓపెన్చేసి "డ్రైవరుండే కార్లో అయితేనే వెనకసీట్లో! ఫ్రెండ్స్ ఉంటేమాత్రం పక్కసీట్లో కూర్చోవాలి'' అంది పల్లవి చొరవగా.

"హమ్మయ్య! బతికించారు! ఇంతకీ మీరు నా ఫ్రెండా?" కాస్త బరువు తీరిన ఫీలింగ్ పెట్టి అన్నాడు చరణ్.

"కాదు! మీ స్టూడెంట్ని'' గాగుల్స్ తీస్తూ అంది పల్లవి.

"ఓహ్...! పల్లవి..." తడుముకుంటున్నట్టు అన్నాడు.

"ఫర్వాలేదులే... సార్కి పేరు గుర్తుందే!"

"పేరు గుర్తుంది... నీ తీరూ, అల్లరీ ఇప్పుడు గుర్తొస్తోంది!"

ట్యుటోరియల్ కాలేజీలో ఆమె చేసే అల్లరీ, పాఠంమధ్యలో కావాలని వేసే కొంటె ప్రశ్నలూ గుర్తుకొచ్చాయి చరణ్కి.

ఆమె అల్లరికి తానేం చేయలేక ఎన్నోసార్లు తలపట్టుకోవడం కూడా గుర్తొచ్చిందతనికి.

"ఆ అల్లరి వల్లరే..." చరణ్ మాటని అందుకుంటూ "ఈ పల్లవి అన్నమాట!" పూర్తిచేసిందామె. ఆ వెంటనే "ఆc!... అయితే మనం ఇవాళ ట్యూషన్, ఆ ఇరుగ్గదుల్లో కాకుండా ఓపెనెయిర్లో పెట్టుకుంటాం!" డిక్లేర్ చేస్తున్నట్టుగా అంది.

ఆమె ఊహల్లో... అప్పుడో విశాలమైన ఓపెన్ ఆడిటోరియం.




"అంటే... కొత్త ప్లేస్‌లో టీచింగా?" అమాయకంగా అడుగుతున్నాడు చరణ్.

అరమోడ్పు కళ్లతో, "టీచింగ్ కాదు... టీజింగ్' అంది పల్లవి.

★ ★ ★

"సీన్ బావుంది సార్! ఇక్కడ మనం పాట పెట్టుకోవచ్చు! ఇలాంటి అమాయక చక్రవర్తిని ఓ టీనేజ్ ఆడపిల్ల... టీజ్ చేసే సాంగ్‌కి, థియేటర్లో బోల్డంత రెస్పాన్స్'' సునీల్ కాంప్లిమెంట్.

"ఇప్పటి ట్రెండ్‌నిబట్టి, అది ఫాస్ట్ సాంగ్ అయితే బంపర్ హిట్టే! ర్యాప్‌మ్యూజిక్ బ్యాక్‌గ్రౌండ్‌లో సాగితే ఆడియో మార్కెట్‌నీ భారీగా పట్టుకోవచ్చు!" కమర్షియల్ పాయింట్లు ఏ విషయంలో ప్లస్ అవుతాయో ఇట్టే పసిగట్టే డీఎస్కే అందుకున్నాడు.

"మొత్తంమీద మాస్‌కు పట్టే కథే సార్... ఇలాగే సాగితే..." జంబులింగం కూడా సర్టిఫై చేశాడు.

"ఒకటి రెండు సీన్లు... అందులోనూ పాత్రల్ని పరిచయం చేసే సీన్లు వినగానే సర్టిఫై చెయ్యడం అంత మంచిదికాదు. అదే రైటర్‌కీ, డైరెక్టర్‌కీ ఉన్న తేడా. ఓవరాల్‌గా ఆలోచించేవాడే డైరెక్టర్. ఇంకా మనం చూడాల్సిన అంశాలెన్నో ఉన్నాయి''

ఇప్పుడప్పుడే ఏమీ చెప్పలేమన్నట్టు జనమేజయం మాటల్లో ధ్వనించింది.

★ ★ ★

తరుణ్ దూకుడుని భరిస్తూ బుల్లెట్ జోరుగా సాగిపోతూనేవున్నా, ట్రాఫిక్‌మధ్యలో అంతకంటే ఫాస్ట్‌గా ఇట్టే కనుమరుగైపోయింది మారుతీకారు ఓ జంక్షన్‌లో.

తన బుల్లెట్‌కి అడ్డంగా ఓ సిటీబస్సు, ఆ వెనువెంటనే ఓ లారీ, దానివెనక స్కూల్ పిల్లల వ్యాన్... ఇలా ఛైన్‌లా ఒక్కసారిగా రావడంతో, "డామిట్' అని కసిగా పళ్లు నూరుతూ బ్రేక్ వెయ్యక తప్పింది కాదు తరుణ్‌కి.

★ ★ ★

చరణ్‌తో ఊహాలోక విహారాల్లోంచి పల్లవి ఊడిపడేసరికి అతడక్కడ లేడు.

ఆవిడ టీజింగ్ ధాటికి తట్టుకోలేక సందు చూసుకొని మెల్లగా తప్పించుకుని బయటపడ్డాడు చరణ్.

నీరసంగా నిట్టూర్చి, కారు డ్రయివ్ చేసుకుంటూ సిటీలోని మంచి బిజీ సెంటర్లో ఉన్న సేఠ్ విక్రమ్‌చంద్ జ్యూయలర్స్ షాపు దగ్గర ఆగింది పల్లవి.

"అమ్మాయిగారొచ్చేరండి'' గుమస్తా చెప్పడంతో నోట్లు లెక్కబెట్టుకుంటున్న విక్రమ్‌చంద్ "బాబోయ్! వచ్చేసిందా నా సిరితల్లి'' అంటూనే కంగారుగా వాటిని సేఫ్‌లో సర్దేసుకున్నాడు.

దేవుడి ఫొటోలవైపు చూస్తూ, "భగవంతుడా! ఇవాళెవరితోనూ ఎలాంటి తంటా లేదుగదా! ఏ యాక్సిడెంట్లూ చెయ్యకుండానే వచ్చిందంటావా! అంతా నీ దయ...." స్వగతంగానే గొణుక్కున్నాడు.

అప్పటికే లోపలికొస్తున్న కూతుర్ని చూసి, ఆప్యాయంగా "దామ్మా! దా!..." అని కూతురు డల్‌గా ఉండటం చూసి ఆగిపోయి, "అమ్మాయిగారికివాళ మూడ్ బావున్నట్టు లేదే!" అంటూనే కూతురి ఫేస్‌రీడింగ్ ప్రారంభించాడు విక్రమ్‌చంద్.

"అదేంలేదు డాడీ!" అంటూనే కళ్లతోనే షోకేసులన్నీ సోదాచేస్తూ ఓచోట దృష్టి నిలిపి, "ఓహ్! హౌ లవ్లీ! బ్యూటిఫుల్ ఛైన్... డిజైనింగ్ ఈజ్ సో సింప్లీ అండ్ సూపర్బ్... మన షాపుకిది ఎప్పుడొచ్చింది డాడీ?" అడిగింది పల్లవి.

"జస్ట్... ఇందాకేనమ్మా! బాంబేలో ఇదే లేటెస్ట్ డిజైనట" తండ్రి చెప్తూండగానే గుమస్తా భయంభయంగా దాన్ని షోకేస్‌లోంచి తీస్తూ సేఠ్‌వంక బెదురుతూ చూస్తూ పల్లవికి అందించాడు.

ఆ చైన్‌ని, దానికున్న లవ్ సింబల్ లాకెట్‌ని తమకంగా ముద్దుపెట్టుకుని, మెళ్లో వేసుకోబోయిందల్లా ఆగి, సన్నగా, స్వగతంగా 'వూఁహూ' అనుకుంటూ, హ్యాండ్ బ్యాగ్‌లో వేసుకుంది.

"బై డాడీ!" అంటూ బయటికి కదుల్తోన్న కూతురివంక నిర్నిమేషంగా చూస్తుండిపోయాడు సేఠ్ విక్రమ్‌చంద్.

★ ★ ★

తరుణ్ రైడ్ చేస్తున్న బుల్లెట్, ఓ ఫ్యాక్టరీ ఆవరణంలోకొచ్చి ఆగింది.

బిల్డింగ్‌మీద 'దీపికా ఇండస్ట్రీస్' అనే బోర్డు చూసి దిగాడు బైక్.

మళ్లీ మరోసారి బోర్డుకేసి చూసి, తన జేబులో ఉన్న కవర్‌వంక చూసుకుని, హుందాగా లోపలికి అడుగుపెట్టాడు.

రిసెప్షన్‌లో ఓ అందమైన అమ్మాయి, స్టన్నింగ్ బ్యూటీ కాకపోయినా, అలంకరణవల్ల అద్భుతంగా కనబడ్డంతో, ఓ క్షణం ఆగిపోయి చూసి దగ్గరకెళ్లి తనని పరిచయం చేసుకుని కవర్ అందించాడు తరుణ్.

అలంకరణతో ఆకర్షణీయంగా ఉన్న ఆమె అదోలా సిగ్గుపడిపోయింది.

"అలా సిగ్గు పడిపోతారేం? ఇదేం లవ్ లెటర్ కాదులెండి''

తరుణ్ చొరవకూ, చురుకు చూపులకూ ఒక్కసారి రోషంగా చూసిందామె.

అదేం పట్టించుకోకుండా "మీ కంపెనీయే పంపిన ఇంటర్వ్యూ లెటర్..." అన్నాడు తరుణ్.

"ఐసీ..." అని అందుకుంటూ, కవర్లోంచి పేపర్‌తీసి చూస్తున్నట్లుగా నటిస్తూనే ఓరకంట అతని పర్సనాలిటీని చూడసాగిందామె.

అది గమనించీ గమనించనట్టుగా "అరె! అంతసేపు చూడాలా! మీరు పంపిందేగా! అసలూ... మీకు ఇంగ్లీషొచ్చా?" వేళాకోళంగా అడిగాడు తరుణ్.

"వాడ్డూయూ మీన్ మిస్టర్..." కోపం ప్రదర్శించబోయింది రిసెప్షనిస్ట్.

"మిస్టర్ కాదు... ది గ్రేట్ లవ్‌మాష్టర్' సర్దాగా కాలరెగరేస్తూ అన్నాడు తరుణ్.

"వేషాలేస్తున్నావే! ఉద్యోగం చేద్దామనే వచ్చేవా?" పళ్లబిగువున తెచ్చిపెట్టుకున్న కోపాన్ని కంట్రోల్ చేసుకుంటూనే అన్నా, చిర్నవ్వుని దాచలేకపోయిందామె.

ఆమె ఫీలింగ్స్ అతని దృష్టిని దాటిపోలేదు.

"అది మీమీద ఆధారపడి ఉంది'' కొంటెగా అంటూనే, "ఏం చేస్తాం! తమరు దయతల్చి దారెటో చూపిస్తే... ఐమీన్... లోపలికి దారెటో చూపిస్తే..." కవ్వింపుగా అన్నాడు.

నవ్వేసి, "ఓకే... మీకివాళ ఇంటర్వ్యూ ఉందని బాస్ చెప్పారు. కాని అర్జెంటుగా ఓ కాంట్రాక్ట్ ఫిక్సప్ చెయ్యడంకోసం మార్నింగ్ ఫ్లయిట్‌కే ఢిల్లీ వెళ్లారు. రేపొచ్చేస్తారు''

"మరి నాగతీ.... సంగతీ''

"అది చూడ్డానికి మేమున్నాంగా!" దోరనవ్వు చలాకీగా రువ్వి, అంతలోనే, "అయ్ మీన్.... అంటే మా పిలుపుమీద మీరొచ్చారు కాబట్టి మీరిక్కడ స్టే చెయ్యడానిక్కావాల్సిన ఏర్పాట్లు చూడమన్నారు బాస్. స్టార్ హొటల్ మయూరలో రూం బుక్‌చేశాం! ఒక్క క్షణం..." అని ఇంటర్‌కమ్ నొక్కి "మిష్టర్ తరుణ్ ఈజ్ హియర్' అని అవతలివైపు మేనేజర్ మాటలకి రెస్పాన్స్‌గా తలాడించి, రిసీవర్ క్రెడిల్‌మీద ఉంచుతూ, "రూం నెంబర్ ఫైవ్ నాట్ ఫైవ్' అంది తరుణ్‌ని ఏకాగ్రంగా చూస్తూ.

నిలువుగా తలూపాడు తరుణ్ నవ్వుతూ.

"ఈరోజుకి రెస్ట్ తీసుకోండి. మీరిప్పుడు మా గెస్ట్‌లు కదా! మా కంపెనీ కార్లోనే పంపిస్తాం!"

"థాంక్స్! కారొద్దులెండి! మా ఫ్రెండ్ బండిమీదొచ్చాను''




"ఏం బండీ? ఎడ్లబండీనా?" సర్దాగా అడిగిందామె.

"భలే జోక్ చేస్తారే! అయినా కండిషన్లో లేదు కాబట్టి ఎడ్లబండీయే అనుకోండి! ఎంత స్లోగా ఉంటుందో ఒక్కోసారి అంత ఫాస్ట్‌గా నూ మూవ్ అవుతూంటుంది"

మునిపంటితో కింద పెదవి నొక్కిపెట్టి కొంటెగా "చిలిపివారేనే!" కాంప్లిమెంట్‌గా అందామె.

"మీకన్నానా?"

"ఇంతకీ ఆ ఫ్రెండ్ ఎవరు?"

"డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ అనీ... ఇక్కడో ప్రయివేటు డిటెక్టివ్ ఏజన్సీ నడుపుతున్నాడు లెండి"

"ఊహూఁ!" ఆరాధనగా చూస్తూ అంది ఆమె.

"సాయంత్రం మీ డ్యూటీ అయిపోయాక అలా రూమ్‌కేసి రాకూడదూ! సరదాగా..." అని నాలిక్కరుచుకుని, "అదీ మీకభ్యంతరం లేకపోతే..." అని చిన్న పాజ్ ఇచ్చి "అదీ మీకు వేరే పనేం లేకపోతే!" అని ఓ తమాషా నవ్వు నవ్వాడు తరుణ్.

"దేనికీ?" చాలా కాజువల్‌గా అందామె.

"అఁ!... అహ!... అహహా!... ఊరకే... జస్ట్... ఏదో అలా... అలా... మీ గెస్ట్‌ని కదా! కంపెనీగా డిన్నర్లో షేర్ చేసుకోవచ్చుగా!"

ఏమంటారన్నట్టు కళ్లతోనే ప్రశ్నించాడు తరుణ్.

"ఓ.కే!" మధురంగా అందామె.

"థాంక్యూ!" అన్నాడతను.

★ ★ ★

అదో రెండు పట్టర్లున్న పోర్షన్.

మంచి సెంటర్‌లోనే ఉంది.

'పండూ ట్యుటోరియల్స్ అండ్ టైప్ ఇన్‌స్టిట్యూట్' అనే బోర్డున్న ఆ శిక్షణాసంస్థ ఓనర్ రాంపండు.

మధ్యలో పార్టిషన్ ఏర్పాటుచేసి, ఒకవైపు టైప్ ఇన్‌స్టిట్యూట్, మరోవైపు ట్యుటోరియల్స్ నడిపిస్తున్నాడు అతడు. నడివయస్కుడైనా చాలాభాగం జుట్టు నెరిసింది అతనికి.

క్వార్ట్జ్ వాచ్ పదిన్నర సూచిస్తోంది.

అసహనంగా, "ఏమైపోయాడబ్బా ఈ చరణ్!? ఇంకా రాడేం?" అనుకోసాగాడు రాంపండు.

ట్యుటోరియల్ క్లాస్ సైడు విద్యార్థుల గోల క్రమంగా ఎక్కువకాసాగింది.

"సాయ్‌లెన్స్" అని గట్టిగా అరచి, డస్టర్‌తో తలమీద కొట్టుకోగానే, సుద్దపొడి అతడి తలనిండా పరచుకొని మొత్తం తల అంతా ముగ్గుబుట్టలా తయారైంది. స్టూడెంట్లంతా గట్టిగా నవ్వారు.

డస్టర్ టేబుల్‌మీద పడేసి, మళ్లీ, "సైలెన్స్" అంటూ అరిచి, తానే క్లాస్ తీసుకున్నాడు రాంపండు.

అమ్మాయిలు చిరాగ్గా మొహం పెట్టారు.

అదేం పట్టించుకోకుండా, టెక్స్ట్‌బుక్ అందుకుని "ఈపూట కెమిస్ట్రీ చెప్పుకుందాం!" అంటూనే పచార్లు చేస్తూ, పుస్తకంలోకి తలదూర్చాడు.

"కెమిస్ట్రీ కాదు... పామిస్ట్రీ చెప్పండి" వెనక బెంచీలోంచి అరిచారెవరో.

"పామిస్ట్రీ అయితే నా చెయ్యే ముందు చూడాలోచ్' కంటిన్యూ చేస్తున్నట్టు ఇంకొకరు అందుకున్నారు.

ఒక్షణం సీరియస్‌గా చూసి, "న్యూటన్ గమనసూత్రం పాఠం ఇది... హియర్... ప్రతి చర్యకూ ఒక వ్యతిరేక ప్రతిచర్య ఉంటుంది. దిసీజ్ థర్డ్‌లా ఆఫ్ మోషన్' రాంపండు వాక్యం పూర్తయ్యేసరికి "లవ్‌లో ఫస్ట్ లా ఆఫ్ ఎమోషన్ ఏంటి సార్?" కొంటెప్రశ్న వేశాడో కుర్రాడు.

అందరూ పెద్దగా నవ్వారు.

ఇంతలో అవతలి పార్టిషన్‌లోంచి "సార్! ఏఎస్‌డీఎఫ్‌జీహెచ్ తర్వాతేం కొట్టాలీ?"



అంటూ కేకలాంటి ప్రశ్న.

"ఒక్క నిముషం!" అని ఆ పార్ట్ చూస్తా ద్దామని వెళ్తే "సార్! వియ్‌హావ్ ఫర్గాటెన్ సెకెండ్‌లా! ప్లీజ్!" అంటూ ఇవతలివైపు నుంచి అరుపు.

"ఇదుగో వచ్చేస్తున్నా!" అంటూ రాంపండు ఇటువైపు ఉరుకులూ, పరుగులూ పెట్టేడు.

రాంపండు కాసేపు అటూ ఇటూ ఉరుకు లూ, పరుగులూ... చేశాక మొత్తంమీద కొంతసేపటికి ఓపిక నశించిపోవడంతో రెండు రూమ్‌లకీ మధ్య ద్వారం దగ్గర జారపడిపోయి "నాయనా చరణం! నా వల్ల కాదయ్యా బాబూ! నువ్వే శరణం" అని కళ్లు మూసుకున్నాడు.

"సారీ సర్! కొద్దిగా లేటైనట్టున్నాను'' వాచీ చూసుకుంటూ అన్నాడు అప్పుడే వచ్చిన చరణ్.

"బోల్డు లేటు'' ఓ అమ్మాయి స్వగతంగా అనుకుంటూనట్టు అంది పైకే.

ప్రాణం లేచొచ్చినట్లయి, ఠక్కున నిలబ డిన రాంపండు "హమ్మ! వచ్చావా తండ్రీ!

నువ్వు లేకపోతే ఇటు ఈ ట్యూషన్లూ అటు ఆ సైపూ అంగుళం జరగవు. నీకు జోహార్ నాయనా! ఎలా మెయింటైన్ చేస్తున్నావో ఏమిటోగాని- నీకు నువ్వే సాటి'' అని రెండు చేతులూ జోడించాడు.

"ఛ! అదేంటి సార్! మీరుండండి... నేను వచ్చేశాగా!" అభయం ఇస్తున్నట్టు అన్నాడు చరణ్.

"బతికించావ్ బాబూ! త్వరగా లెసన్ అందుకో! వీళ్లమధ్య ఫుట్‌బాల్ అయిపోయా న్నేను''

"డోంట్ వర్రీ! నేను చూసుకుంటాగా'' అంటూనే స్టూడెంట్స్‌వైపు తిరిగి "మీరెంతో మంచి స్టూడెంట్స్‌కదా! ప్రిన్సిపాల్‌గార్ని అలా అల్లరి చెయ్యొచ్చా?" అని చిరుకోపం ప్రదర్శించాడు.

స్టూడెంట్స్ ముఖాల్లో కళకళ.

మెల్లగా గోడవారగా నక్కి నక్కి నడుస్తూ, బెంచీ చివరిసీటులోకి వెళ్లి కూర్చుంది పల్లవి.

"ప్రవరాఖ్యుడొచ్చాడోచ్' చిలిపిగా అంటూ, పక్కన సర్దుక్కూర్చుంటున్న పల్లవితో, "అరె! నువ్వెప్పుడొచ్చావోయ్?" అంటూ ఆమె స్నేహితురాలు రమణి చిత్రంగా కళ్లు తిప్పుతూ ప్రశ్నిస్తూంటే, తానూ కళ్లతోనే జవాబిచ్చింది పల్లవి.

★ ★ ★

హెూటల్ మయూరలోని ఏసీ రూమ్.

డబుల్ బెడ్...

డ్రస్సింగ్ టేబుల్.

షాండిలీర్స్, సింపుల్‌గా వున్న రెండు మూడు మాడర్న్ ఆర్ట్ పెయింటింగ్స్ అలంకరించిన ప్లాస్టిక్ ఎమల్షన్ కోటెడ్ వాల్స్...

కాస్ట్లీ ఫర్నిచర్‌తో చాలా ఆహ్లాదకరంగా ఉందా గది వాతావరణం.

సెంటు సువాసనలు వెదజల్లుతూ, చీరని సర్దుకుంటున్న ఇరవయ్యేళ్ల అమ్మాయి.

ఉదయం తరుణ్ చిలిపితనానికి సరిజోడీగా తన కొంటెతనం జతచేసిన రిసెప్షనిస్టే ఆమె.

పక్కనే వున్న ఫైబర్ ఛైర్లో కూర్చొని వున్నాడు, తరుణ్ సిగరెట్ పొగ రింగులుగా వదుల్తూ.

లేచిన రిసెప్షనిస్టు పిల్ల, డ్రస్సింగ్ టేబుల్ అద్దం దగ్గరకెళ్లి పైట సర్దుకుంటూ కురులు సరిచేసుకుంటూండగా "థాంక్స్! ఎస్వీట్ మెమొరీ ఆఫ్ ది నైసెస్ట్‌డే! ఇలా నదురూ బెదురూ లేకుండా జాలీగా ఉండే అమ్మాయిలంటే ఎంతో ఇష్టం నాకు!" క్రీగంట చూస్తూ అన్నాడు తరుణ్.

చురుగ్గా ఓ చూపు చూసి మూతి మూడు వంకర్లు తిప్పి అల్లరిగా చిర్నవ్వు నవ్వింది రిసెప్షనిస్టు. అదీ చాలా సెక్సీగా.

"అసలు ఈ జీవితమంతా ఇలాగే సరదాగా మజామజాగా గడిచిపోతే ఎంతో బావుంటుందికదూ!"

"మగాళ్లకి బాగానే వుంటుంది. లేడీస్‌కే అంత బాగోదు''

"అదేం?"

"అదంతే! జల్సా జోరెక్కువైతే, పిల్ల బతుకు బేజారే'

"ఓహెూ! అవునుకదూ! మనది యూరోపియన్ కల్చర్ కాదుగా! అమ్మాయిలకిక్కడ సవాలక్ష సమస్యలు''

"కానీ, నాలాటివాళ్లక్కాదులే! ఎ లిటిల్ కేర్ సేవ్స్ మోర్..." అల్లరిగా నవ్విందామె.

"ఐ.సీ." సిగరెట్ యాష్‌ట్రేలో కుక్కుతూ అన్నాడు తరుణ్, "నాకూ వెస్టర్న్ కల్చరంటేనే లైకింగ్'

"అందుకే ఎంజాయ్ చెయ్యగలిగాం! ఎనీవే కబుర్లేమైనా చెప్పు! అన్నట్టూ- మీ బాస్ ఏవైపు? జోవియలా? సీరియస్సా? ఛాందసుడా? ట్రెండ్ మూవరా?"

"బాబోయ్! ఇంత మంచి మూడ్‌లో బాస్ ఊసెందుకు?"




"ప్లీజ్! చెప్పరాదూ?"

"పక్కా ట్రెడిషనల్ ఆయన. పరమ ఛాందసుడు''

"అంటే-?"

"ఒక్క మాటలో చెప్పాలంటే- మన సనాతన తెలుగు సంస్కృతికి నిలువుటద్దం ఆయన"

"ఇంకా!?"

"ఇంకేవుంది చెప్పడానికి? ఫారిన్ వాసనలు ఏమాత్రం గిట్టని 'ప్యూర్ ఇండియన్ మిర్రర్' అని చెప్పానుగా''

★ ★ ★

"ఒక్క నిమిషం" జనమేజయం బ్రేక్ వేశాడు.

ఆగింది నమీచి.

అందరూ ప్రశ్నార్థకంగా డైరెక్టర్‌గారివైపు చూశారు.

"ఇలాంటి సీన్లు మరీ బరితెగించినవాళ్లు సృష్టించినట్టుంటాయ్ తప్ప, సంసారపక్షంగా ఆలోచించేవాళ్లు సృష్టించినట్టుండవ్!"

"ఓహ్! ఇదేనా మీ అభ్యంతరం? సీన్ కావాలంటే మళ్ళీ చెప్తాను. ఎక్కడా అశ్లీలం ప్రొజెక్ట్ చెయ్యలేదు నేను. సజెస్టివ్‌గానే తరుణ్ 'క్యారెక్టరైజేషన్‌కి బిల్డప్ ఇవ్వడం' అనే టెక్నిక్ వాడాను. ఇలాంటి 'ఆడబలహీనత'లున్న క్యారెక్టర్‌ని మీరు తెరమీద చూపించాల్సొస్తే, ఇంతకంటే మరో మార్గాన్ని ఎన్నుకోగలరా?" సూటిగా ప్రశ్నించింది నమీచి.

అక్కడే టీపాయ్‌మీద వున్న ఓ వారపత్రిక అందుకుని అందులోని ఓ సీరియల్ లోంచి పచ్చి బూతువాక్యాల్ని నిర్భయంగా చదివి వినిపించింది.

"ఇంత బరితెగించిన రాతల్ని, ఏ పోర్నో ఫిలిం మాత్రం అక్షరాక్షరం చిత్రీకరించగలదు? క్షమించండి! నా ఉద్దేశం ఇలాంటి వాంగ్మైథునం వైపు కారెక్టర్ల సృష్టి కాదు. ఇక్కడ హీరోకున్న 'ప్లేబాయ్' తత్వాన్ని సాధ్యమైనంత సజెస్టివ్‌గానే చూపిస్తున్నాను. దీన్నే మీరు అపార్థం చేసుకుంటే, ఆ రాతల రచయిత్రిని మీరు బూతులు తిట్టినా ఆశ్చర్యం లేదు'' ఆవేశంగా చెప్తోంది నమీచి.

"కరెక్టే సార్! ఓ పక్క 'మంచి సాహిత్యం రావడం లేదూ. మంచి సిన్మాలు రావడంలేదూ' అంటూ గోలచేసే ప్రేక్షకులూ, పాఠకులూ వీటిని ఆదరిస్తూనే వున్నారు. ఈ తరహా పత్రికలూ, సీరియల్సూ చెల్లుబాటు అవుతున్నాయనేగా రాసేవాళ్లూ, వేసేవాళ్లూ ఇలాంటివి ప్రజల్లోకి వదుల్తున్నారు. నిజంగా వీటిగ్గనక మార్కెట్టే లేకపోతే, కామర్స్ సూత్రం ప్రకారం డిమాండ్ లేనప్పుడు సప్లయ్ ఆగిపోవాలి కదా!" సమర్థించాడు సునీల్.

"అందుకే ఈమధ్య తమిళ చిత్రాలు, తెలుగులోకి డబ్ అయి, బాగా డబ్బు చేసుకుంటున్నాయి. ఈ ఆర్టికల్ చదివారా?" అక్కడే టీపాయ్ మీంచి రెండువారాల కిందటి 'సితార'లోంచి ఓ వ్యాసాన్ని చూపిస్తూ అన్నాడు ఏమన్.

యాధాలాపంగా అందులోని కొన్ని వాక్యాలు చదివాక, ఆ వ్యాసంలో ఉటంకించిన చిత్రాల్లోని సన్నివేశాలతో నమీచి చెప్పిన సీన్ పోల్చి చూసుకున్న జనమేజయం సంతృప్తిగా ఫీలై "సారీ ఫర్ ది బ్రేక్" అన్నాడు- కథ కంటిన్యూ చెయ్యమన్నట్టుగా.

★ ★ ★

రిసెప్షనిస్ట్ ద్వారా బాస్ టేస్ట్‌ని అంచనా వేసుకున్న తరుణ్, నెక్స్ట్ సీన్‌లోనే మొత్తం గెటప్ మార్చుకున్నాడు.

సాంప్రదాయసిద్ధమైన పంచెకట్టూ పైన లాల్చీ జరీ కండువా ధరించి అచ్చమైన ఆంధ్రుడిలా విచ్చేసి, మర్నాడు కంపెనీలో అడుగుపెట్టాడు అతడు.

రిసెప్షనిస్ట్ ముందు నిలబడి "అంటే ఇలా అన్నమాట" అన్నాడు చిర్నవ్వుతో.

"వావ్! వండ్రఫుల్" అందామె అమ్మాయి రింగ్‌గా.

"తెలుగుదనం కొట్టొచ్చినట్టుందా?" కొంటెగా అడిగాడు తరుణ్.

కళ్లెగరేస్తూ "డైలాగ్ మాత్రం కొట్టొచ్చినట్టుంది. మార్చేయ్'' అందామె.

"పోనీ! తెలుగుదనం మూర్తీభవించినట్టు అననా?" ఆమె చూపుల్లో చూపు కలుపుతూ అడిగాడు.

"వూc! నిన్నటి జల్సారాయుడికీ ఈ జంటిల్మేన్‌కీ ఎక్కడా పోలికే లేదు''

"థాంక్యూ ఫర్ యువర్‌నైస్ కాంప్లిమెంట్' మనస్ఫూర్తిగా మెచ్చుకొని "అన్నట్టు అయ్యగారు.. అదే బాస్ వేంచేసేరా?" మెల్లగా అడిగాడు.

ఇంటర్‌కమ్‌లో "బాస్! హి హేజ్ కమ్ పంపించమంటారా?" అడిగిందామె.

లోపల్నుంచి వచ్చిన జవాబుకి తలూపి "మీరు వెళ్లొచ్చు. కానీ బీ కేర్‌ఫుల్. యూరోపియన్ మేనర్స్ కనిపించాయో మీరే రివర్స్ అయి వెనక్కొచ్చి పడతారు'' హెచ్చరిస్తూనే అల్లరిగా చూస్తూ నవ్వింది.

జరీకండువా సవరించుకుంటూ తమాషాగా తరుణ్ లోపలికి అడుగుపెడుతూంటే, దేశభక్తిగీతం 'ఏ దేశమేగినా ఎందు కాలిడినా, ఏ పీఠమెక్కినా ఎవ్వరెదురైనా' టేప్ ఆన్‌చేసి అప్రయత్నంగా విన్పించింది రిసెప్షనిస్ట్.

★ ★ ★

సీరియస్‌గా పాఠం చెప్తూన్నాడు చరణ్.

అల్లరి పల్లవి, రెండు చూపుడు వ్రేళ్లమధ్యా రాకెట్‌ని సెట్‌చేసి, రబ్బర్ బ్యాండ్ మధ్యకి లాగి గురిచూసి చరణ్‌కి తగిలేలా విసిరింది.

అదిరిపడిన చరణ్, చేతిలో పుస్తకాన్ని పక్కనపెట్టి, రాకెట్ పట్టుకుని అటూ ఇటూ తిప్పి పాపం! దీన్నెవరో చాలా ఓపిగ్గానూ, కళాత్మకంగానూ తయారుచేశారు. దీనిమీద చూపించిన శ్రద్ధలో సగం కేవలం సగం కాన్సన్‌ట్రేషన్‌ని లెసన్‌మీద చూపించి వుంటే, డెఫినెట్‌గా క్లాసు తెచ్చుకోగలుగుతారు'' అనేసి, దాన్ని చించేయబోతూండగా, పల్లవి లేచి,

"అంత ఆర్టిస్టిక్‌గా వున్నదాన్ని, ఎంత నిర్దాక్షిణ్యంగా చిదిమేస్తున్నారు సార్! మీకు చేతులెలా వచ్చాయ్?" బాధ నటిస్తూ అడిగే సరికి, క్లాసులో అబ్బాయిలు కూడా లేచి "హియర్! హియర్!" అంటూ కోరస్‌గా గొంతు కలిపారు.

"సైలెన్స్! కళాశాల చదువులు ఇలాంటి పనికిరాని కళలు వెలగబెట్టటానిక్కాదు పనికొచ్చే చదువుల్తో ఎవరికాళ్లమీద వాళ్లు నిలబడ్డానికి'' సీరియస్‌గా చెప్పాడు చరణ్.

"ఇవి పనికొచ్చే చదువులా? ఆ నమ్మకం మాకెంతమాత్రం లేదు'' పెదవి విరుస్తూ అంది పల్లవి.

"అమ్మడూ! ఆ సంగతి చూసుకోవలసింది సర్కారువారు. మీరు చూసుకోవాల్సినవి మీ స్టడీసూ, మేనర్సూ అంతే!"

"ఒక్క స్టడీసేనా సారూ! చూసుకోవాల్సినవి ఇంకేవీ లేవా?" కొంటెగా చూస్తూ అంది పల్లవి.

"నువ్వేం చూసుకుంటావో నాకు తెలీదు తల్లీ! నేను మాత్రం..." చరణ్‌మాట ఇంకా పూర్తి కాకుండానే, అవతలి వైపునుంచి, "సార్!" అంటూ ఫైపు కాగితాల బొత్తితో ఓ బొద్దుగా వున్న పిల్ల తెగ ఆయాసపడిపోతూ వచ్చేసరికి, తడబడిపోతూ "నేను మాత్రం ఈ పేజీలు చూసుకోవాలి'' అంటూ ఆదరాబాదరాగా ఆ పిల్ల చేతిలో కాగితాలు లాక్కోబోయాడు. ఆ స్పీడ్‌కి ఆ అమ్మాయి, నిల్చున్నపాటున చరణ్‌మీద వాలిపోయింది. గాభరాపడిన చరణ్ చేష్టలకి క్లాసంతా గొల్లుమంది.

★ ★ ★

డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ తన లేడీ అసిస్టెంటుకి నోట్స్ డిక్టేట్ చేస్తున్నాడు గదిలోనే పచార్లు చేస్తూ.




"కమాన్... ఫాలో మీ'' అన్నాడు సడన్‌గా.

"జస్టెమినిట్! నా కళ్లజోడు బాస్''

"ఏమైంది?"

"కనబడ్డం లేదు'' అసిస్టెంట్ రాణి.

"వాట్! ఈ డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ ఆఫీసులోనే చోరీయా? షేమ్... డామ్ షేమ్... ఎంత అప్రదిష్ఠ? ముందీ న్యూస్ బైటికి పొక్కకుండా చూడు. క్లయింట్స్ మన మొహం కూడా చూడరు''

నీట్‌గా సూటూ బూటూ వేసుకుని కూడా, చిన్న వేపకాయంత వెర్రి వున్నవాడిలాగా కోటు భుజంపైన మడతలు పెట్టిన శాలువా వేసుకున్నాడు గేమ్స్‌బాండ్.

"ఆవేశం చాల్లే... ఆపండి బాస్. కనబడ్డం లేదన్నానుగానీ, పోయిందన్లేదుగా..." టేబుల్ సొరుగులూ అవీ వెతుక్కుంటూనే అంది అసిస్టెంటు రాణి.

శాలువాని ఆ భుజంమీంచి, ఈ భుజంమీదికి మార్చుకుంటూ "లుక్... చూడు మైడియర్ రాణీ! జస్ట్ ఇప్పుడే నీ వర్డ్స్‌లోంచే ఓ పాఠం చెప్తున్నా! వెంటనే నేర్చేసుకో! మన క్లయింట్స్ కంగారులో, నీలాగే కొన్ని వివరాలు తప్పుగానైనా చెప్తారు. లేదా తిప్పి తిప్పి అయినా చెప్తారు. సో... మాటల్ని జాగ్రత్తగా అబ్జర్వ్ చెయ్యాలి. పాయింట్ నెంబర్ టూ కంప్లయింట్ ఇచ్చే మన క్లయింట్స్‌లోనే ఒక్కోసారి నేరస్తులూ వుండొచ్చు. అదీ అబ్జర్వ్ చెయ్యాలంటే, వాళ్ల మాటలు జాగ్రత్తగా వినాలన్నమాట... అండర్‌స్టాండ్''

"యస్ బాస్!" నిలబడిపోయి అంది.

"ఇంతకీ నీ కళ్లజోడు కనబడిందా?"

"కనబడింది సార్!"

"ఎక్కడ?" ఆతృతగా అడిగాడు.

"మీ మెళ్లోనే. ముచ్చటగా వుందనీ, చూసిస్తాననీ తీసుకున్నారుగా ఇందాక..."

"ఐ.సీ''

"నా కళ్లజోడు మీ మెళ్లో ఉంటే నేనెలా చూడగలను సార్?"

"బెటర్ సైట్ వితౌట్ గ్లాసెస్ అనే పుస్తకం చదువ్. అస్తమానూ ఈ కళ్లజోడు పెట్టుకొనే బాధ తప్పుతుంది''

"బెటర్ సైట్ వితౌట్ గ్లాసెస్ చదివాను బాస్!" కళ్లజోడు వంకతో దగ్గరకొచ్చి అతడి మీద వాలిపోబోతూ అంది.

★ ★ ★

దీపికా ఇండస్ట్రీస్ ఓనర్ హృషీకేశ్‌గారు.

హుందాగా సిగార్ వెలిగించుకుని వెనక్కి వాలి బజర్‌నొక్కగానే అటెన్షన్‌లో కొచ్చిన అటెండర్ తరుణ్‌ని లోపలికెళ్లమన్నట్టుగా సైగ చేశాడు.

హృషీకేశ్‌గారి ఛాంబర్‌లోకి అడుగు పెడుతూనే "దీపికా పరిశ్రమల సముదాయపు యజమాని శ్రీవారికి వందనాలు'' అని రెండు చేతులూ జోడించి నమస్కారం పెట్టాడు తరుణ్.

హృషీకేశ్‌గారు కొంచెం ఆశ్చర్యంగా చూసినా, తలూపి "వూc! నువ్వేనన్నమాట! కూర్చో'' అని సీటు ఆఫర్ చేస్తూ, తరుణ్ కూర్చుంటూండగా "నీ పేరు'' అని గుర్తు చేసుకుంటూ వుంటే, "నా నామధేయమండీ! తరుణుడు అంటారండి'' అతివినయం వొలకబోశాడు.

కనుబొమ్మలు చిట్లించిన హృషీగారు "అతిసర్వత్ర వర్జయేత్ అన్నారుకదూ పెద్దలు. మామూలుగా చెప్పొచ్చు! అతివినయం అక్కర్లేదు'' అంటూండగా, అటెండర్ ఓ ఫైలు తెచ్చి టేబుల్‌మీద పెట్టాడు.

మంచినీళ్లు తాగుతూ, ఫైలు చూస్తూ ప్రశంసాపూర్వకంగా "భేష్! బాగానే సాధించేవోయ్'' కళ్లెగరేశారు ఆయన.

"అవునండి! వ్యాపార నిర్వహణ పర్యవేక్షణ పట్టపరీక్షయందు మంచి గుణములతో ఉత్తీర్ణుడనై ప్రథమశ్రేణిని పొందితిని'' మరింత ఓవర్‌గా తెలుగులోకి దిగిపోతూ




అన్నాడు తరుణ్.

"మరీ అంత ప్యూర్ తెలుగు అక్కర్లేదోయ్. అవసరమైనచోట..." హృషీగారి మాటల్ని అంది పుచ్చుకుంటూ.

"ఆంగ్లం వాడొచ్చంటారు కానీ... మనదైన భాష" అంటూ ఓవర్ ఎక్స్‌ప్రెషన్స్ ఫేస్‌లోకి తెచ్చుకుని తరుణ్ వివరణలందుకొనేసరికి ముఖం చిట్లించాడు హృషీకేశ్.

అదేం పట్టించుకోకుండా, తన ధోరణిలో చెప్పుకుపోసాగాడు తరుణ్.

"కానీ, మనదైన అమృత తుల్యమైన భాషామాధుర్యం ఎరగని సారహీనులకి చెప్పండామాట. అసలు ఏ జాతి మనుగడగానీ, ఉనికిగానీ స్వభాష స్వాభిమానం లేకుండా వికసించదుగదా! 'దేశభాషలందు తెలుగు లెస్స' అన్నాడు రాయలు. నేను తెలుగు బిడ్డననికదూ సగర్వంగా చెప్పుకోమన్నాడు రాయప్రోలు. మా తెలుగు తల్లికీ మల్లెపూదండ అన్నాడు భట్టిప్రోలు''

ఆ ధోరణి అలా కొనసాగేదేమోగానీ, చివరిమాటకు హృషీకేశ్‌గారు అడ్డుకున్నారు.

"ఆగు! ఆగాగు! ఈ భట్టిప్రోలు ఎవరయ్యా బాబూ?" అని ప్రశ్నించి, అదే మార్కు ఫేసులో డౌటు అభినయిస్తూ, ఆ పాట రాసింది శంకరంబాడి సుందరాచారిగారు కదా'' అన్నారు.

నాలిక్కరుచుకొని, వెంటనే సర్దుబాటుకి రెడీ అయిపోతూ, "అహ... అహహ! పాటకి పేరు ఈయన కొచ్చిందండి. పల్లవి చెప్పిన ఘనత మాత్రం ఇందాక నేను అన్న ఆ భట్టిప్రోలాయనకి దక్కుతుందండి! ఆ మధ్యేదో పరిశోధనా గ్రంథంలో ఓ అజ్ఞాత రచయిత ఈ సంగతి వెలుగులోకి తెచ్చేరండి'' సమర్థించుకుంటూ అన్నాడు తరుణ్.

ఆశ్చర్యం, అనుమానం మిళితమైన ముఖంతో "అవునా?" అన్నాడు హృషీకేశ్.

"అవునండి. డెడ్‌ట్రూత్ అది. ఛ! ఛ! చచ్చినంత నిజమండి'' నెత్తిమీద ఒట్టు పెట్టుకున్న రీతి అభినయిస్తూన్న తరుణ్ వంక ఆనందంతో, ప్రశంసాపూర్వకంగా చూస్తూ, "ఆహా! ఏం ప్రఘాఢాభిమానం? ఎంత పఠనాసక్తి! తెలుగంటే ఎంత ఆసక్తి! నీలాంటివాళ్ల భాషాభిమానమే తెలుగునాట ముక్తకంఠంతో ప్రతినోటా పలికితే, మనవాళ్ల కీర్తి దిగంతాలకి ఏనాడో స్ప్రెడ్ అయి వుండేది. అదో మధుర స్వప్నం. కలలోనే తప్ప ఇలలో జరగదు ప్చ్! అదలావుంచు! గతానుభవం ఏమైనా వుందా?" అడిగారు హృషీ.

"ఓ! చాలా అనుభవాలు... ఒకటా? రెండా?" అనుభవం అనే పదం వినేసరికి తరుణ్ మనసులో అమ్మాయిలతో తన అనుభవాలే మెదిలాయి.

"అన్ని కంపెనీలు చూశావా?" తరుణ్ అంతర్యం తెలీని హృషీకేశ్‌గార్కి తరుణ్ అనుభవం ఎంతో తెల్సుకోవాలనిపించింది.

"కాదండి! పర్సనల్. వ్యక్తిగతం... అంటే స్వానుభవం" గొణుక్కుంటున్నట్టు ఒక్కో అమ్మాయినే గుర్తు చేసుకుంటూ అన్నాడు.

"అన్నిట్లోకీ ఏది బాగా నచ్చింది?" యధాలాపంగా అడిగాడు హృషీ. ఆయన ఉద్దేశంలో ఇతడిన్ని కంపెనీల్లో పనిచేశానంటున్నాడుకదా! ఏది నచ్చి ఎందులో ఎక్కువ కాలం పన్చేసేడో తెల్సుకుందాం" అని.

ఆ క్షణంలో రమాతో పంచుకున్న కంపెనీ గుర్తొచ్చి "ది గ్రేట్ ఎక్స్‌పీరియన్స్ విత్ రమా అండి! ఐమీన్ రమా కంపెనీ అండి సూపర్' అని, నాలిక్కరుచుకుని తాను ఓవరైపోతూన్నట్టు వెంటనే గ్రహించుకుని "సారీ సర్! అహ్హా! అహ్హహ్హా! రమా ఫర్మ్ అన్నమాట" అంటూ సర్దుకున్నాడు.

"వూఁ" అని తలూపిన హృషీగారు "గుడ్! మంచివాళ్లకెప్పుడూ మా సంస్థలో స్థానం తప్పకుండా వుంటుందోయ్. నీ ప్రవర్తనా మాట తీరూ నాకు నచ్చాయ్. అధికారహో

దా ఇస్తున్నాం. జీతం పదివేలు. పనితీరు కూడా నచ్చితే చాలా అవకాశాలుంటాయ్! విదేశాలకు పంపే ఛాన్స్ వుండొచ్చు. ఇంత కీ స్థాయి నిలబెట్టుకునే గొప్ప బాధ్యత మాత్రం నీమీదే వుంటుంది'' అని ముగించారు తరుణ్‌కి ఉద్యోగం కన్‌ఫర్మ్‌చేస్తూ.

"చాలా కృతజ్ఞతలు! మీరే చూస్తారుగా నా పనితనం"

బజర్ నొక్కగానే క్లర్క్ లోపలికి రావడం బాస్ హృషీగారు ఏదో చెప్పి అతడికి ఫైలు అందించడం అతడు తలూపడం చకచకా జరిగిపోయాయి.

★ ★ ★

రాత్రయింది.

పల్లవి కారు పెద్ద బంగళాముందు ఆగింది.

స్టయిలిష్‌గా లోపలికెళ్తోంది పల్లవి.

నైట్‌కోటులో వున్న తండ్రి, తన గదిలో పచార్లు చేస్తూ ఏదో ఆలోచిస్తూండడంతో ఆగింది.

అటువైపు వెళ్దామా వద్దా అని సందేహిస్తూనే క్షణం తటపటాయించి వెళ్లింది.

"హాయ్ డాడీ!" అంటూ విష్‌చేసి "ఏంటి డాడీ! అంత సీరియస్ థింకింగ్? ఎనీ బిజినెస్ ప్రాబ్లెమ్?" అడిగిందామె.

"అదేం లేదమ్మా!"

"ఐ.సీ... పర్సనల్ అన్నమాట! అయినా నాకు తెలీని పర్సనల్ విషయాలు నీకేం ఉన్నాయ్ డాడీ?"

"పర్సనల్ ఏమున్నాయమ్మా! ఉన్నదే ఇద్దరం. దాపరికమేమీ లేదు. నీ మేరేజ్ గురించేనమ్మా!" తండ్రి విక్రమ్ అన్నాడు.

"ఫో డాడీ! ఎప్పుడూ నా మేరేజ్ గురించే ఆలోచిస్తుంటావ్!"

"అది తండ్రిగా నా బాధ్యత కదమ్మా పల్లవీ!"

"ముందు నా స్టడీస్ పూర్తవనీ డాడీ!"

ఏదో చెప్పబోతూన్న తండ్రిని ఆపుచేస్తూ "నో! ఇంకేం చెప్పొద్దు డాడీ! చదువయ్యాకనే పెళ్ళి'' స్థిరంగా అంది.

"సరేనమ్మా! వరుడ్ని వెతికి రెడీగా ఉంచితే నువ్వు ఓ.కే. అనగానే ఆ మూడుముళ్లూ వేయించేయొచ్చు!" హుందాగా అన్నాడు విక్రమ్.

"ఫో డాడీ!" అందంగా గారాలు కురుస్తూ వెళ్లిపోయింది పల్లవి తన గదిలోకి.

★ ★ ★

చరణ్ డాబామీద పచార్లు చేస్తూన్నవాడల్లా ఆగిపోయాడు. ఏదో గుర్తొచ్చినవాడిలా ఒక్క చిటికె వేసి పిట్టగోడమీద కూర్చున్నాడు.

కళ్లజోడు సర్దుకొని "యస్ మై డియర్ స్టూడెంట్స్! ఈ పాఠం మనం ఇవాళ చెప్పుకుందామనుకున్నాంకదూ! బట్ నేను ప్రిపేరయి రాలేదు. అంచేత దీన్ని రేపు చెప్పుకుందాం!" స్వగతంగా రిహార్సల్స్ వేసుకుంటున్నట్టుగా అని, అలా పక్కింటివైపు డాబామీదకి చూశాడు చరణ్.

పొద్దున్నే నోట్స్ నెపంతో తన స్నేహితురాలింటికి ఆ డాబామీదకే వచ్చింది పల్లవి.

చరణ్ తన ధోరణిలో తానున్నాడు తప్ప పరిసరాలు గమనించడంలేదు.

కాని అతన్నే దీక్షగా చూస్తున్న పల్లవి "మరేం పర్లేదుసార్! క్లాస్ డుమ్మా కొట్టటానికి మేంమాత్రం ఎప్పుడైనా ప్రిపేరయ్యే ఉంటాం!" అంటూ అల్లరిగా నవ్వింది తన స్నేహితురాలు సునీత భుజానికి ఆనుకొని నిలబడి.

"బాబోయ్!" అని పిట్టగోడమీంచి దిగిపోయి గబగబా కిందకెళ్లి ఆగివున్న వాళ్ల కారుని సమీపించి, హారన్ మోగించసాగాడు చరణ్ ఆమెని త్వరగా దిగమన్నట్టుగా.

ఎటో వెళ్లి తిరిగొస్తున్న డ్రయివర్ ఇది చూసి లుంగీ, బనీను మీదున్న చరణ్‌ని ఎగాదిగా చూసి, "పెద్దమనిషిలా ఉన్నావ్!

 

ఇదేం బుద్ధయ్యా నీకు... చిన్న పిల్లల్లాగ... ఆపు!" అంటూ చరణ్‌ని వారించాడు హారన్ మీదున్న చరణ్ చేతిపై తన చెయ్యి ఉంచుతూ.

సరిగ్గా అప్పుడే పైనుంచి అదాటుగా చూసిన పల్లవి డ్రయివర్ చెయ్యి హారన్ దగ్గర ఉండటం చూసి, "అబ్బ! వస్తున్నా గవరయ్యా!" అంటూనే మెట్లు దిగింది గబగబా "బై" అంటూ స్నేహితురాలికి చెయ్యి ఊపుతూ.

గవరయ్యే హారన్ కొట్టేడనుకుంది పల్లవి.

తన చెయ్యి వెనక్కు లాక్కుంటూ, "చిన్నపిల్లాణ్ని కాదయ్యా బాబూ! చిన్నపిల్లల్లా బిహేవ్ చేసేవాళ్లకి పాఠాలు చెప్పే ట్యూటర్ని!" గవరయ్య మాటకి జవాబుగా అన్నాడు చరణ్.

విసుక్కుంటున్నట్టు పెట్టిన గవరయ్య మొహాన్నే వెనక్కు తిరిగి చూస్తూ, చరణ్ తన మేడమెట్లెక్కడానికి రెడీ అవుతూండగా, ఫోర్స్‌గా వచ్చి గుద్దేసింది పల్లవి ఇంచుమించు అల్లుకుపోతూన్నట్లుగా.

"అయ్...! అయ్!..." అదిలిస్తూన్నట్లు ఫీలవుతున్న చరణ్‌ని కొంటెగా చూస్తూ, "సారీ అండీ! ట్యూబులైటుగారూ! ట్యూటరు సారూ!" అంది.

"ముందు వదలవమ్మా తల్లీ! ఇది నడిరోడ్డు"

గవరయ్య వాళ్లిద్దర్నీ తినేసేలా చూస్తున్నాడు.

"అటు చూడు! మీ డ్రయివర్..."

"అయితే ఏం? సిగ్గు... ఇటు చూడడు"

"స్టాప్ నాన్సెన్స్!" అంటూనే గట్టిగా విదిలించుకుని, చరచరా తన డాబా మెట్లు ఎక్కేశాడు చరణ్.

"హుం!" అని మూతి తిప్పి నిట్టూర్చి అక్కడ్నించి కదిలింది పల్లవి.

★ ★ ★

"బాస్!" గోముగా, ఏదో అడగాలని వచ్చింది గేమ్స్‌బాండ్ అసిస్టెంట్ రాణి.

"య్యస్" అంటూ స్టయిలిష్‌గా రొటేటింగ్ ఛైర్లోంచి ఇటువైపు తిరిగి "ఎనీ కేసెస్ ఆర్ ఇన్ పెండింగ్?" అడిగాడు డిటెక్టివ్ గేమ్స్‌బాండ్.

"పెండింగా! పాడా! అసలు కేసులే లేక ఆర్నెల్లుగా గోళ్లు గిల్లుకుంటూంటే?"

"నో! నో! అలా అధైర్యపడకూడదు. అయినా మనం బోల్డంత బిజీగా ఉన్నట్టు ఎప్పటికప్పుడు మన అంతరాత్మని జోకొడుతూండాలన్నమాట! లేకపోతే మనం గుండె ధైర్యం కోల్పోవడం ఖాయం!"

"అదే కదసార్! డిటెక్టివ్‌కి ముఖ్యంగా ఉండాల్సింది, ఏదున్నా లేకపోయినా"

"కరెక్ట్! బాగా ఫాలో అవుతున్నావన్నమాట! వెరీగుడ్! సరిగ్గా లైన్లోకొచ్చావ్"

"లైన్లోకెప్పుడో వచ్చాను సార్! మీరే గుర్తించడంలేదు" మరింత దగ్గరగా జరిగి, "కాబట్టి మీ గుండె తలుపు తట్టి మరీ ధైర్యం చెప్తానుబాస్!" అంటూ గేమ్స్‌బాండ్ మీదకి ఒరగసాగింది రాణి.



దీపికా ఇండస్ట్రీస్...

అడ్మినిస్ట్రేటివ్ సెక్షన్...

అందులోని ఓ వింగ్ అది...

ప్రతి విభాగానికీ మధ్యలో ఉడెన్ పార్టిషన్స్ ఉన్నాయి. తలలు వంచి ఎవరి పనిలో వారు మునిగివుంటే ఒకరికొకరు కనబడరు.

ఫ్లోర్‌నుంచి నాలుగడుగుల ఎత్తులో ఉన్న ఈ చెక్క పార్టిషన్‌లమీద ప్యాకేజింగ్‌వింగ్, రేపరింగ్ వింగ్, రిఫ్రిజిరేషన్ వింగ్, ఓల్డ్ రికార్డ్స్ వింగ్‌వంటి స్ట్రిప్స్ ఆయా విభాగాల్ని సూచించేలా అతికించి వున్నాయి.

కొంచెం పెద్ద విభాగం ప్రొడక్షన్ కంట్రోలింగ్ వింగ్. అందులో కేవలం రెండు సీట్లే ఉన్నాయి.

ఒకదాంట్లో తరుణ్, మరో సీట్లో కంపెనీ పర్సనల్ సెక్రెట్రీ సోనీ కూర్చున్నారు.

మహా హుషారుగా జోకులేస్తున్నాడు తరుణ్!

ఇద్దరూ ఆనందంగా నవ్వుకుంటూ, ఒకరి అందాన్ని మరొకరు కళ్లతోనే జుర్రుకుంటున్నారు.

సోనీమీద చాలాకాలంగా మోజుపడిన పక్క వింగ్ హెడ్ బాల్డ్‌హెడ్డు చిదంబరం సోనీ నవ్వుతూ తుళ్లుతూన్న ప్రతిసారీ తరుణ్‌వంక పళ్లు నూరుతూనూ సోనీవంక చిరచిరలాడుతూన్నట్టునూ చూసి జాలితో, 'ఆమె ఏమైపోతూందో ఇతని మాయలోపడి...' అనే ఆవేదనతో, చూస్తూన్నాడు.

చిదంబరం పరిస్థితిని ఓరకంట చూస్తున్న తరుణ్ మరింత రెచ్చగొడుతున్నట్టుగా "ఇప్పుడు మనం బాల్డ్ హెడ్స్‌మీద... అంటే తెల్సుగా! బోడిగుండ్లమీద... అదే రేపరింగ్ వింగ్ హెడ్‌గారికున్న బట్టతలల్లాంటివాటి మీద ఓ జోక్ చెప్పుకుందాం!" అనగానే, ముసిముసి నవ్వులు నవ్వింది సోనీ.

పళ్లు పటపట నూరాడు చిదంబరం తన బట్టతల తడుముకుంటూ.

"ఓ బట్టతల బాబాయ్‌గారికి, తన నెత్తిమీదున్న ఆ నాలుగు వెంట్రుకలూ తెల్లబడిపోతూంటే తెగ దిగులు పట్టుకుందట! హయ్యో! నిండా నలభైలేవు... అప్పుడే వెండిజుట్టా? ఛాల్... వీల్లేదు! జుట్టుకు రంగేసుకు తీరాల్సిందే! అనుకున్నాడు'' చెప్పడం ఆపి ఫీలింగ్స్‌కోసం సోనీ ముఖంలోకి సరదాగా చూశాడు తరుణ్.

ఆమె సన్నగా నవ్వుకుంటూ ఓరకంట చిదంబరాన్నే చూస్తోంది.

తల తడుముకుంటున్న చిదంబరం, 'ఓరి వీడి సిగదరగా! నేను హెయిర్‌డై వాడుతున్నట్టు పసిగట్టాడల్లే ఉందే!' స్వగతంగా పైకే అనుకున్నాడు.

తరుణ్ మళ్లీ చెప్పడం ప్రారంభించాడు.

"ఆఁ! చూడు సోనీ... హెయిర్‌డైకోసం షాపుకెళ్లిన బట్టతలాయన ఎప్పటికీ రంగు పోకుండా ఉండిపోయే హెయిర్‌డైని ఇమ్మని షాపువాణ్ణి అడిగాడు. 'పర్మనెంట్ హెయిర్‌డై' అని పాపం ఇతడి ఉద్దేశం. ప్రముఖ కంపెనీల తయారీలు చాలా చూపించాడు షాపువాడు. ఇతడికేదీ నచ్చలేదు. చివరికి విసిగిపోయిన షాపువాడు, 'ఎప్పటికీ పోనిదీ అంటే ఒకే ఒక్కటుంది సార్! రోడ్లకేసే డాంబర్ తెల్సుకదా! అది తీసుకొని దట్టంగా పట్టించెయ్యండి! తళతళలాడే నలుపు. పైగా ఎవర్‌బ్లాక్. పర్మనెంటుగా ఉండిపోతుంది' అనేసరికి ఇంక చెప్పాలా?"

పెద్దపెట్టున నవ్వింది సోనీ.

అవతల చిదంబరం ముఖం నల్లగా మాడిపోయింది.

ఇంతలో అటెండర్ తరుణ్ దగ్గరగా వచ్చి బాస్ వస్తున్నారన్న సంగతి అభినయం చేసి చెప్పాడు. (ఈ అటెండర్ క్యారెక్టర్‌కెక్కడా డైలాగ్ ఉండదు)

తక్షణం తరుణ్ తన ముఖంలో ఫీలింగ్స్ మార్చేసి చాలా సిన్సియర్‌గా పన్చేసుకుంటూన్నంత సీరియస్‌గా కూర్చొని కుర్చీలోనే వెనక్కి వాలి ఓ ఫైల్ అందుకుని దాన్లో తలదూర్చి ఫైల్ అంచులమీదుగా సోనీ అందాల్ని ఆస్వాదించసాగాడు.




వెనకనుంచి నెమ్మదిగా వచ్చిన ప్రొప్రయిటర్ హృషీకేశ్‌గారు ఒక్షణం తరుణ్‌వెనకే నిలబడి, స్మూత్‌గా తరుణ్ భుజంమీద చెయ్యేశారు.

సీరియస్‌నెస్‌ని సూపర్‌గా అభినయించే స్తోన్న తరుణ్, "ఇది ఆఫీసు! పైగా డ్యూటీ అవర్స్... నువ్వెంత నాకు ఫ్రెండ్‌వైతేమాత్రం..." అంటూనే వెనక్కి తిరిగి తడబాటుతో "సారీ సర్! మీరనుకోలేదు. వర్క్ ఈజ్ గాడ్ అనేది నా సిద్ధాంతం. నాకో లేజీ ఫ్రెండున్నాళ్లెండి! 'పనియే ప్రత్యక్షదైవం' అని నా సోమరి మిత్రుడికి చిరకాలంగా నూరిపోస్తున్నాను. ఇప్పుడిలా నన్ను డిస్టర్బ్ చెయ్యడానికి వాడే వచ్చాడేమోననీ..." తరుణ్ ధారాప్రవాహ అబద్ధాల గొలుసుకి పక్క సెక్షన్ చిదంబరం, తన బాల్డ్‌హెడ్‌మీదున్న నాలుగు వెంట్రుకలూ పీక్కుంటూ హైరానాపడిపోయాడు.

హృషికేశ్‌గారు భుజంతట్టి, "కీపిటప్ మై డియర్ యంగ్‌మాన్! సిన్సియారిటీకి ఈ సంస్థలో ఎప్పుడూ గుర్తింపు ఉంటుంది" అంటూ హుందాగా పైప్ నోట్లో పెట్టుకుని, పక్క సెక్షన్‌లోకి వెళ్లారు.

మళ్లీ సోనీతో సరస సంభాషణకి ఉపక్రమించాడు తరుణ్.

ఇద్దరూ ఒకటే నవ్వులు.

బాల్డ్‌హెడ్ చిదంబరం ఉడుక్కోసాగాడు.

తనకి లేని అవకాశం తరుణ్ కాజెయ్యడమే కాకుండా ఓపక్క సోనీని బుట్టలో వేసుకుంటూనే మరోపక్క సిన్సియర్ అనే క్రెడిట్ కొట్టేస్తూ ఓనర్‌గారి దృష్టిని ఆకట్టుకోవడం అతడు సహించలేకుండా ఉన్నాడు.

ఈలోగా అటెండర్ మళ్లీ చరచరా తరుణ్ దగ్గరగా వచ్చి చేసైగతో బాస్ పిలుస్తున్నారని చెప్పాడు.

సడెన్‌గా ఫీలింగ్స్ మార్చేసి, చేతిలో ఫైలుతో అలాగే లోపలికి వెళ్లబోతున్న తరుణ్ షర్ట్ పట్టుకుని ఆపిన సోనీ, అతడి చేతిలో ఫైలుని లాక్కుని అతడి టేబులుమీదే పడేసింది.

కారణం - అది ఉత్త ఖాళీఫైలు.

ఇంకో ఫైలు అతని చేతిలో కుక్కి, ముందుకు తోసింది సోనీ చొరవగా.

ఆ దృశ్యం కంటబడిన చిదంబరం ఇంకా ఉడుక్కున్నాడు.

★ ★ ★

అందమైన నగర సాయంత్రం...

పార్క్‌లో ఎదురుచూస్తున్న సోనీని కలుసుకున్నాడు తరుణ్.

అక్కణ్నించి స్కూటర్‌మీద కలిసెళ్లి, ఇద్దరూ ఓ కాస్ట్లీ రెస్టారెంట్లో కబుర్లు చెప్పుకుంటూ ఒకరి కళ్లలోకి ఒకరు తన్మయత్వంతో చూసుకుంటూ డిన్నర్ కానిచ్చారు.

సోనీని తనతోపాటు స్కూటర్‌మీద తన రూమ్‌కి తీసుకుపోయాడు తరుణ్.

బ్యాక్‌గ్రౌండ్‌లో ర్యాప్‌మ్యూజిక్ రన్ అవుతూంటే వాళ్లిద్దరూ క్రమంగా కలల్లో మునిగిపోయారు.

లైట్‌బ్లూ నైట్‌ల్యాంప్ వాళ్ల అల్లరి చూడలేక కళ్లుమూసుకుంది.

మళ్లీ లైటు వెలిగేసరికి మత్తుగా మూలుగుతూ అరమోడ్పు కళ్లతో బెడ్‌మీద ఉంది సోనీ.

"వ్వాటె టెర్రిఫిక్ ఎక్స్‌పీరియన్స్ మై డియర్ హీరో!" అంటూ మూలిగింది!

"ఈ హృదయ సామ్రాజ్యాన్ని ఇంతగా కొల్లగొట్టిన లవ్లీ యంగ్‌మాన్‌ని సన్మానించుకోవద్దూ! నీమీద బాస్‌కి వెరీగుడ్ రిపోర్ట్... ఓ.కే! ఈ అబ్బాయిగారికి త్వరలో ఫారిన్ ట్రిప్ ఛాన్స్... ఊం!" అంటూ తమకంగా కళ్లుమూసుకుంది.

★ ★ ★

ఆమె అలా అన్న మరుక్షణమే తరుణ్ ఊహాలోకాల్లో తేలిపోసాగాడు.

సోనీ బాస్ హృషీకేశ్‌గారితో తరుణ్ గురించి అద్భుతంగా వర్ణించి చెపుతున్నట్టు,

ఫారిన్ ట్రిప్‌కి రికమెండ్ చేస్తున్నట్టు, బాస్ ఓ.కే. అన్నట్టు, ఫ్లయిట్‌లో తాను విదేశాలకెళ్లినట్టు, అక్కడ విదేశీ అమ్మాయిల్తో రకరకాల భాషల సుందరీమణులతో డే అండ్ నైట్ ఎంజాయ్ చేస్తున్నట్టు... ఒకదానివెంట ఒకటి వరుసగా, ఒక్కుమ్మడిగా, కలబోతగా, గజిబిజిగా... ఓహ్! ఊహల అలల్ల దృశ్యాలు తరుణ్ కళ్లముందు చకచకా సాగిపోతున్నాయ్.

★ ★ ★

"ఓర్నాయనో! ఇంత పచ్చి పచ్చిగా హాట్ హాట్ సీన్లు మనం సిగ్గువిడిచి అల్లుకున్నా, అవి థియేటర్లదాకా వెళ్లవమ్మా! మధ్యలో సెన్సార్ అనేది ఒకటి ఉందన్న సంగతి మర్చిపోతే ఎలా?" జనమేజయం నెత్తీ నోరూ బాదుకుంటూ అన్నాడు.

"చూడండి సార్! నేను ముందే చెప్పాను... దీన్ని మీరేం యథాతథంగా తీయబోతున్నారా? అసలిది మీకు నచ్చాలికదా? తర్వాత ఇక్కడున్న వాళ్ళందరూ ఒప్పుకోవాలికదా! అప్పుడు ఆడియన్స్ యాంగిల్లోంచి



కూడా కమర్షియల్‌గా ఆలోచించి తీసేదీ, తియ్యనిదీ నిర్ణయిస్తారు. ఆమాత్రానికి మీరి లా స్టోరీకి అడ్డం పడుతుంటే కథ ముందుకె లా సాగుతుంది?" చిరు విసుగు ధ్వనిస్తున్న గొంతుతో అంది నమీచి.

"కరెక్ట్ డైరెక్టర్‌సాబ్! పూర్తిగా ఆవిణ్ణి చెప్ప నిచ్చి మనం ఏమైనా అంటే బా వుంటుందేమో!" డీఎస్కే సమాధానపరచ బోయాడు!

"నా ఉద్దేశం అదికాదు... ఇంతవరకూ ఆవిడ చెప్పిన సీన్లలో ఇంచుమించు అన్నీ శృంగారపు పాలు ఎక్కువగా ఉన్నవే"

"ముందు కథకి ఈ పాయింట్స్ ఉపయో గపడతాయేమో! ఆవిడ టూకీగా నాలుగు ముక్కల్లో చెప్పాల్సిన కథని సీన్లకింద విడగొ ట్టి చెప్తూండడంతో మనకి అతిగా కన్పి స్తోందేమో!" సమర్థించబోయాడు కార్త వ్యరాయ్.

నిర్మాత సదాశయంమాత్రం ఏమీ కా మెంట్ చేయకుండా శ్రద్ధగా వింటూన్నాడు.

"ఒక్క విషయంమాత్రం ఒప్పుకొని తీరాలి! ఆవిడ సీన్స్ చెప్పడంలో గొప్ప ఎక్స్‌పర్ట్ అనిపిస్తోంది. చెప్తున్న ప్రతి బిట్టూ కళ్లముందు కనిపిస్తోంది. అలా చెప్పడం అందరికీ సాధ్యంకాదు" ప్రశంసాపూర్వ కంగా అన్నాడు సునీల్.

"ఇప్పటి ప్రేక్షకులకి ఇదే నచ్చువచ్చేమో! ఎవరు చెప్పగలరు? ఆవిడ ముందే డిక్లేర్ చేసినట్టు ఇది అచ్చం సిన్మాటిక్ స్టోరీగదా!"

డిఎస్కే కూడా సపోర్ట్ ఇవ్వడంతో రెట్టించిన ఉత్సాహంతో కంటిన్యూ చెయ్య సాగింది నమీచి.

★ ★ ★

చరణ్ ఎంతో శ్రద్ధగా పాఠం చెప్తూన్నాడు. క్లాసంతా యమ నిశ్శబ్దంగా ఉంది.

చరణ్‌వంక ఆరాధనగా చూస్తోంది పల్లవి.

వాల్‌క్లాక్‌లో సాయంత్రం ఐదు కావస్తోంద న్న సూచనగా మ్యూజిక్‌గా ఐదు గంటలు మోగాయి. పల్లవిమాత్రం వెళ్లలేదు. మిగిలిన క్లాసులోని స్టూడెంట్సు అందరూ ఒక్కొక్కరే వెళ్లిపోయారు.

పక్క పోర్షన్‌లో టైపు మిషన్ల టకటక...

స్టూల్‌మీద బాసింపట్టు వేసుక్కూర్చున్న రాంపండు నోట్లు లెక్కబెట్టుకుంటూ, టైపు కొడుతున్న ఓ అమ్మాయికేసి తిరిగి, "గిరి జా! ఈ నెల నీ ఫీజు ఇంకా రాలేదేం...!" అన్నాడు.

"ఇచ్చేస్తా సార్"

అప్పుడే పుస్తకంలోంచి తల పైకెత్తి చూశా డు చరణ్.

క్లాసంతా ఖాళీగా ఉంది.

చేతి వాచీవంక చూసుకున్నాడు.

"ఐ.సీ... ఐదయిపోయిందన్నమాట!" అనుకుంటూనే బెంచీకి ఆ చివర్న కూర్చున్న పల్లవివైపు చూశాడు.

"నువ్వెళ్లలేదేం?" పుస్తకం టేబుల్‌మీద పెడుతూ అడిగాడు.

"ఎందుకు వెళ్ళాలి?"

"అదేం ప్రశ్న?" బిత్తరపోయాడు చరణ్.

"ఇదేం కాలేజీ కాదుగా! ప్రయివేట్ ట్యు టోరియల్"

"కాదని ఎవరన్నారు?"

"మా ఇష్టం వచ్చినంతసేపు ఉంటాం! కడుతున్నాంగా ఫీజు"

"కానీ మేం క్లోజ్ చేసుకు వెళ్లిపోవాలి!"

"నేను వెళ్లనివ్వను"

"బావుందమ్మాయ్ నీ వరస"

"వరస కుదిరిన సరసం ఇంకా బా వుంటుంది"

ఏమీ అనలేదు చరణ్.

మళ్లీ పల్లవే అంది, "వస్తానంటే ఇద్దరం వెళ్లిపోదాం!"

"ఎక్కడికి?"




"ఊహాలోకాల్లోకి! అలా... అలా... ఎవరూ చూడని సుందర ప్రదేశాలకి..." కళ్లు అరమోడ్పులు చేస్తూ అంది పల్లవి.

"నాకు టైంలేదు. నోట్స్ ప్రిపేర్ చేసుకోవాలి! రేపటి పాఠాలు చూసుకోవాలి!"

"రేపటి పాఠాలు!?... యూ మీన్... లెసన్స్ ఆఫ్ టుమారో?"

తలూపాడు చరణ్.

"కుర్రకారుకి రేపటి పాఠాలు లవ్‌లెసన్స్!" అంటూనే చేతిని నినాదాలిచ్చేవాళ్లలా పిడికిలి బిగించి పైకెత్తి "లివ్‌ఫర్ లవ్.. లాంగ్ లివ్ లవర్స్... కాల పరిమితుల్లేని ప్రేమా జిందాబాద్" అని చెయ్యి దించి "సో... లెటజ్ సీ లవ్లీ లెసన్స్" అంది పల్లవి.

"నాకు అవి రావు"

"మరేం పర్లేదు! కాసేపు మీ డ్యూటీ నేనేచేస్తా" దగ్గరగావచ్చి, "ఓహెూ ట్యూటర్‌గారూ! ట్యూబ్‌లైటు సారూ" అంటూ సరదా ట్యూన్ 'హమ్' చేయసాగింది.

★ ★ ★

"ఇదీ టీజింగ్ సాంగేనా?" అడిగాడు జనమేజయం.

"సన్నివేశంమీదుగా పాటకి ఛాన్సిచ్చాను. మీకు ఇష్టమైతే ఉపయోగించుకోవచ్చు! అదీగాక ఇప్పటి యూత్‌కి ఇలాంటి పాటలు ఎన్నివుంటే అంత మజా!" అంటూ ఈమధ్య విడుదలైన ఓ తమిళ డబ్బింగ్ చిత్రాన్ని ఉదాహరణగా చూపించింది.

అందరూ ఏకగ్రీవంగా నమ్మీచినే సమర్థించేసరికి జనమేజయం తలూపక తప్పలేదు.

★ ★ ★

డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ లోపలికొస్తూనే రాణిని చూస్తూ "క్లయింట్స్ ఎవరైనా వచ్చేరా రాణీ!" అడిగాడు.

"ఓ టీనేజ్ కుర్రాడొచ్చాడు బాస్!"

"ఓహెూ! టీ తెచ్చే కుర్రాడా! ఎన్ని నెలల బిల్లు బాకీ అంటాడూ?"

"అబ్బా! మన టీ కుర్రాడు కాదు... టీనేజ్ కుర్రాడు" వాయిస్ పెంచింది రాణి.

"నీ కోసమే అనుకుంటాను. అంటే... ఈమధ్య నువ్వు నన్నే కాదు. కుర్రాళ్లని కూడా వదల్డంలేదన్నమాట!"

"అబ్బా! నన్ను చెప్పనియ్యి బాస్!" తలపట్టుకొని "అతడొచ్చింది మీ కోసమే!"

వెంటనే పోజు మార్చేసి, "అహెూ! ఈ డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ ప్రతిభ కుర్రకారుని సైతం వెర్రెక్కిస్తోందన్నమాట! ఆబాలగోపాలం మన డిటెక్షన్‌ని తెగమెచ్చుకొనే రోజొచ్చేసిందన్నమాట! ఇంతకీ కేసేంటి?"

"అది మీవంటి జీనియస్‌లు సీనియర్ మోస్ట్‌లు చేపట్టదగింది కాదు సార్! ఉత్త బచ్చా కేసు. అసిస్టెంట్ల కింద అసిస్టెంట్లు తేల్చిపారెయ్యదగ్గది..."

"అలాగా! అంత అండర్ లెవెలా? ఏం చేశావు మరి?"

"నేనే బిల్‌చేసి తోలేశాను బాస్"

"ఇంతకీ కేసేంటి?"

"ఆ కుర్రాడికో పంథొమ్మిదేళ్లుంటాయ్!"

"అది సర్లే! సంగతి చెప్పు"

"వాళ్ల నాన్న మరణించాట్ట!"

"అయ్యో పాపం! అంత్యక్రియలకి మనీ దొరక్క మన్ని ఆశ్రయించాలనా?"

"రాంగ్ పాయింట్ సార్!"

అదిరిపడి సర్దుకుని గట్టిగా నవ్వేసి "అనుకున్నా జస్ట్... ఇదో టెస్ట్ కాబోలు! తర్వాత..."

"ఆయన్ది సహజ మరణం కాదని, వాళ్లమ్మే ఏదో చేసిందని ఆ కుర్రాడి డౌటు"

"అంటే!?" నిశితంగా చూస్తూ అడిగాడు గేమ్స్‌బాండ్.

"అక్రమ సంబంధం లాంటిదేదో వుండి, ఆమే తన భర్తని కడతేర్చి వుండొచ్చంటా

డు''

"నువ్వే మన్నావ్?"

"పీడా వదిలిందన్నాను..." తకీమని చెప్పింది రాణి.

"ఎవళ్లకి?"

"ఇంకెవళ్లకి? వాళ్లమ్మకే!"

తలపట్టుకు డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ కుర్చీలో కూలబడ్డాడు.

"అలా అయిపోయారేం బాస్?"

పిచ్చి చూపులు చూడసాగాడు గేమ్స్‌బాండ్.

"సో... మీ డాడీ మర్డర్డ్... కాబట్టి మీ మమ్మీ ఇప్పుడు ఫ్రీబర్డ్. వై ఆర్యూ వర్రీడ్?' అని ఆ కుర్రాడికి ధైర్యం చెప్పి నీ కోసం నేను నేనున్నాను కుర్రాడా!' అని గుండెలకు హత్తుకొని మరీ అభయం ఇచ్చాను''

రాణిని నఖశిఖ పర్యంతం చూడసాగాడు గేమ్స్‌బాండ్.

"అలా చూస్తారేం బాస్! అపార్థం చేసుకో అక్కర్లేదు. ఈ అక్కయ్య దగ్గరికి నువ్వెప్పుడైనా నిస్సంకోచంగా రావచ్చని చెప్పాను. పాపం! తల్లీ దండ్రీ లేని అనాథగా మిగిలిపోయాననీ తోబుట్టువులెవరూ లేరనీ బావురుమన్నాడు బాస్!"

"బతికించావ్''

"ఎవళ్లని'' అడిగింది రాణి.

"ఇంకెవళ్లని?" కొంచెం పాజ్ ఇచ్చి మళ్లీ తనే అందుకున్నాడు గేమ్స్‌బాండ్, "ఆ కుర్రాణ్ణి'' అని గట్టిగా పైకీ, మెల్లగా "నన్ను కూడా'' అన్నాడు.

★ ★ ★

'మోడర్న్ టెక్నిక్ ఇన్ బిజినెస్ మేనేజ్‌మెంట్' అనే పుస్తకం దీక్షగా చదువుతోంది దీపిక.

వాల్‌క్లాక్ రాత్రి నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రెండు గంటలు కొట్టింది. కూతురి గదిలో ఇంకా లైటు వెలుగుతూండడం గమనించిన హృషీకేశ్, నైట్‌కోటు బెల్టు సవరించుకుంటూ, మరోచేత్తో పైపు హేండిల్ చేస్తూ అక్కడికొచ్చాడు.

"ఇంత రాత్రిదాకా చదువుతూ కూర్చోవాలా అమ్మా?"

"స్టడీ.. స్టడీ... ఆల్వేస్ స్టడీ... ఫారిన్‌లో మా యూనివర్సిటీ ప్రొఫెసర్స్ ఇదే చెప్పేవారు డాడీ! ఎంత ఎక్కువగా చదువుకోగలిగితే అంత మంచిది''

పుస్తకాన్ని తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నారాయన. "కానీ తక్కువగానైనా రెస్ట్ తీసుకోవడం కూడా అవసరమే దీపా!"

"ఆఫ్టర్ మేరేజ్... ఎక్కువ రెస్టేకదా డాడీ! భర్తా పిల్లలూ, సంసారం ఇదేగా అప్పుడు లోకం. స్టడీకి ఛాన్సుంటుందా అస్సలు? ఏం నేర్చుకున్నా పెళ్లికిముందే!"

"అన్నట్టు ఆఫీస్‌లోని ప్రొడక్షన్ కంట్రోలింగ్ వింగ్‌కి ఓ జీనియస్‌ని సెలెక్ట్ చేశానమ్మా ఈమధ్య. బాగా అబ్జర్వ్ చేశాక, ఓ నిర్ధారణ కొచ్చాను''

ఇంకా తండ్రిమాట పూర్తి కాకుండానే, నవ్వుతూ అందుకుంది దీపిక "ఏంటి!? అతడు జీనియస్ కాడనా?"

"నో! నో! అదేం కాదు. బాగా హార్డ్ వర్కర్ అని కూడా. ఏదీ పెండింగ్‌లో వుంచడు. అతడికి ఎప్పటికప్పుడు అంతా ఫ్రెష్‌గా వుండాలి. పని రాక్షసుడు అనుకో. అంతేకాదు. తన కింద ఉద్యోగులనుంచి పని రాబట్టడంలోనూ, మార్కెటింగ్ టెక్నిక్స్ కొత్తవి కనిపెట్టడంలోనూ ఘనుడే! కేవలం తన వింగ్ మాత్రమేకాక ఇంచుమించు అన్ని శాఖలూ సుడిగాలిలా చుట్టబెట్టడం ఎక్కడికక్కడ విలువైన సూచనలు ఇవ్వడం.. ఓహ్! వండర్ బాయ్ అతడు'' సాలోచనగా కూతురి ముఖంలోకి చూస్తూ అన్నాడు హృషీకేశ్.

దీపిక ఏమీ మాట్లాడలేదు.




"నీలాగే యమ్.బి.ఎ. టాప్ ర్యాంకర్"

"ఇండియన్ మేడ్!?" చిర్నవ్వుతో అంది దీపిక ప్రశ్నని సంధిస్తూ. "అయితేనేం కుర్రాడు బుద్ధిమంతుడు. ఆఫీస్ సీక్రెట్స్ కాపాడ్డంలో ఎంత సిన్సియరో, కొందరిచేత కొన్ని పన్లు రహస్యంగా చేయించి, మంచి ఫలితాలు సాధించడంలోనూ అంతే నిపుణుడు''

మళ్ళీ తండ్రి పొగడ్తలు అందుకునేసరికి, కాస్త అసహనంగా మొహం పెట్టి "ఇప్పుడతని ప్రశంస దేనికి డాడీ?" అంది దీపిక.

"చెప్తా! ఆ విషయానికే వస్తున్నా! క్విక్ డెసిషన్ మేకర్.. నీలాగే! ఇంకా పెళ్ళి కాలేదులే! బ్యూటిఫుల్ బ్యాచులర్. కొన్ని విషయాల్లో అంటే- నా పరిశీలనలో కొచ్చిన ఎన్నో విషయాల్లో మీ ఇద్దరికీ చాలా పోలికలూ, అభిప్రాయాలూ కలుస్తాయ్. నీకు తగిన జోడీ అవుతాడేమోననీ'' కూతురు లేచి నిలబడ్డంతో, వాక్యం పూర్తి చెయ్యలేదు హృషీగారు.

"దేనికయినా రెండోవైపు అనేది కూడా ఒహటుంటుందిగా డాడీ! పర్సనాలిటీ ఈజ్ నాటె ఫిజికల్ షో. నిజమైన పర్సనాలిటీ మనిషి క్యారెక్టరే... అతడి ప్రవర్తన సరే! అది ఫెయిర్‌గానే వుండొచ్చు. కాని క్యారెక్టర్ వేరు. సో... అది పరిశీలించకుండా ఎలా?"

"తల్లి లేని నిన్ను ఇంత గారాబంగా పెంచిన ఈ తండ్రి ఆ మాత్రం ఆలోచించడా దీపా? కోట్లాది రూపాయల బిజినెస్ టర్నోవరున్న కంపెనీకి ఏకైక వారసురాలివి. నీవంటి అమూల్య రత్నాన్ని ఆఫర్ చేసేటప్పుడు ఏ టెస్టూ చెయ్యకుండా వుంటానా? అతడి ఆంతర్యం తెలుసుకోడానికి నేను మేరేజ్ ప్రపోజల్ పెడితే, అతడేమన్నాడో తెలుసా?"

ఓ అందమైన సాయంత్రపువేళ ఓ భారీ రెస్టారెంట్‌లో తాను తరుణ్‌కి పార్టీ ఇస్తూ జరిపిన సంభాషణను జ్ఞాపకం చేసుకుంటూ అన్నారు హృషీకేశ్‌గారు.

★ ★ ★

అదో ఫైవ్‌స్టార్ హోటల్...

డ్రింక్ సిప్‌చేస్తూ, తాను పెట్టిన ప్రపోజల్‌కి ఎలా స్పందిస్తాడా అని 'మరేమిటి నీవ్యూ?' అన్నట్టుగా తరుణ్ ముఖంలోకి చూడసాగారు హృషీగారు.

తరుణ్‌ముందు కూల్‌డ్రింక్ బాటిల్ తప్ప మందు లేదు.

"నాకు పెళ్ళి ముఖ్యం కాదు సార్... ముందు నాకొన్ని లక్ష్యాలున్నాయ్! అవి నెరవేరాలి'' ఆషాఢభూతిలా అనిపించకుండా మొదలెట్టాడు తరుణ్.

"ఎనీ బర్డెన్స్? అంటే ఫామిలీ బరువులూ, బాధ్యతలూ గట్రా ఏవైనా ఉన్నాయా?"

"నో! నో! అవేం లేవుసార్! అయాం ఫ్రీబర్డ్... ఏ బంధాలూ బాధ్యతలూ లేనివాణ్ణి"

"మరి!?"

"ఏ సమస్యలూ లేనివాణ్ణి కనుకనే, నాకు నేనే కొన్ని లక్ష్యాలు... ఛాలెంజెస్ అనండి. ఎదుర్కోవాలనుకుంటున్నాను''

"ఏమిటవి?"

"నేను పన్చేస్తున్న మన కంపెనీ ఇండియాలోనే టాప్ టెన్ ఇండస్ట్రీస్‌లో ఒకటి కావాలి. ఆవిధంగా ప్రొడక్షన్ మార్కెటింగ్ అన్నీ డిజైన్ చేయిస్తున్నాను. అదీ మీరిచ్చిన ప్రోత్సాహంతోనే! అంచేత దీంట్లో నేను నా లక్ష్యం సాధించాకనే మిగతా విషయాలేవైనా..."

"గుడ్! అంతేకదా''

"అంతేకాదు! నేను పెళ్ళి చేసుకోబోయే అమ్మాయి, తన పుట్టింటినుంచి పూచికపుల్ల కూడా వెంట తెచ్చుకోకూడదు. చివరికి ఆ పిల్ల సంపన్న కుటుంబం లోనుండొచ్చినా, పేదింటినుంచొచ్చినా నా అభిప్రాయం మారదు'' అని ఒక్క క్షణం ఆగి "ముందు నాకు అమ్మాయి నచ్చాలిగదా హుషారూ, చలాకీ

తనం నేనిష్టపడతాను'' అన్నాడు తరుణ్.

"లక్ష్యాలు రెండూ బావున్నాయ్! కాని ఇవి సాధించడానికి కొంత టైమ్ పట్టవచ్చేమో! అంతవరకూ పెళ్లి వాయిదా వేస్తూపోతే, ఆ వయసు దాటిపోతుందేమో కాస్త ఆలోచించు మై బోయ్''

"నో సార్... పట్టుదలా, సాధించాలన్న తపనా వుండాలేగానీ, ఏ మనిషికైనా అసాధ్యం అనేది వుంటుందని నేననుకోను. ట్రయ్ అండ్ ట్రయ్ అండ్ ట్రయ్... అనేదేనా పాలసీ రోజుకి ఇరవైగంటలు కష్టపడి అయినా'' పిడికిలి బిగించి టేబుల్‌మీద బలంగా మోదుతూ కళ్లు మూసుకున్నాడు తరుణ్ దృఢమైన అభిప్రాయాన్ని సూచిస్తూన్నట్టుగా.

అడ్మైరింగ్‌గా చూశారు హృషీకేశ్‌గారు.

★ ★ ★

జరిగిన సన్నివేశాన్ని గుర్తు చేసుకుంటూ... "అలా అన్నాడమ్మా! అదే మరొకరైతే, అప్రయత్నంగా వస్తున్న ఇంత ఆస్తినీ అమ్మాయినీ వద్దనగలరా? నువ్వా ఫారిన్‌లో ఎం.బి.ఎ. చేసొచ్చిన దానివేగా! ఆలోచించు'' మళ్లీ పైప్ నోట్లో పెట్టుకుంటూ అన్నారు హృషీ.

"ఎనీ వే... నీ సెలక్షన్ అద్భుతమే కావచ్చు. కాని డాడీ! ఈ బిజినెస్ వరల్డ్‌లో ఏదీ స్వంత కళ్లతో చూడనిదే నమ్మరాదని మా స్టడీస్‌లో నేర్చుకున్నాం! నేనూ ఓసారి చూడాలిగా!" అంది దీపిక.

"చూడడమే కాదు! బాగా స్టడీ చేశాకనే ఓ నిర్ణయానికి రామ్మా!" కూతుర్ని సమర్థించారాయన.

★ ★ ★

ఆహ్లాదకరమైన నదీతీరం.

ప్రకృతి సౌందర్యానికి ఆటపట్టు అయిన ప్రాంతం.





ఓ గుబురు చెట్టుకింద కూర్చున్నాడు చరణ్.

చేతిలో నోట్‌బుక్, కలం.

దీక్షగా ఏదో రాసుకుంటూంటే, వెనకగా ఎప్పుడు వచ్చిందో అల్లరి పల్లవి చెట్టు చాటునుంచి, కేట్‌బాల్‌తో గురిచేసి చరణ్ రాస్తున్న పెన్‌కేసి ఓ గులకరాయితో షూట్ చేసింది.

పెన్ ఎగిరి అవతల పడింది.

అదిరిపడిన చరణ్, వెనక్కి చూస్తే ఎవరూ లేరు.

లేచి, మళ్లీ పెన్ తెచ్చుకుని రాసుకుంటూంటే, అప్పటికే చెట్టు పైకెక్కి కూర్చున్న పల్లవి "భక్తా! నీ నిష్కల్మష అమాయక తపోదీక్షకు మెచ్చాను. ప్రేమ వరమీయ వచ్చాను. కాస్త పైకి చూడు! ఈ కొమ్మమీదున్న వనకన్యను, కిన్నెర కన్నెను'' అంటూ పౌరాణిక పాత్రధారుల గొంతుతో బరువుగా అంది.

పైకి చూసిన చరణ్, రెండు చేతులూ ఎత్తి దండం పెడుతూ "ఇక్కడ కూడా తయారయ్యావా తల్లీ! క్లాసులో, హావుసులో, ప్రతీ ప్లేసులో నీ అల్లరి భరించలేక చివరికీ చెట్టుని ఆశ్రయిస్తే..."

చరణ్ మాటలు ఇంకా పూర్తి కాకుండానే.

"నీ తపస్సుని భగ్నం చేయడానికొచ్చిన..." అప్సరస' అందామని ఆమె ఊహ.

కాని చరణ్ మధ్యలోనే అందుకొని "రాక్షసివి'' అన్నాడు కోపంగా.

తప్పు తప్పు అన్నట్టుగా నోటిమీద వేలుంచి "కాదు సార్! ప్రేయసిని. ఊహ ఊర్వశిని'' అంది పల్లవి.

నోట్స్ కాగితాలు చిందర వందరగా ఎగురుతూన్నాయి. పెన్ మూసి "నేన్నీకేం అపకారం చేశానని నన్నిలా నీడలా వెంటాడి వేధించుకు తింటున్నావ్?" జాలిగా అడిగాడు చరణ్.

"ఇది వేధింపూ సాధింపూ కాదు సార్!"

"పోనీ! కవ్వింపు..."

"ఎందుకు సార్! ప్రేమ అంటే అంత దూరం జరుగుతారు?"

"ప్రేమంటే కాదు, నేను దూరం జరిగేది. నీ వెనకున్న లక్షల ఆస్తీ ఆ విలాసాలూ చూసి''

"డబ్బంటే అంత చేదా? అదీ మనిషికి అవసరం కాదా సార్?"

"మితిమీరిన డబ్బు మనిషిని ఎందుకూ పనికిరాని పిచ్చివాడ్ని చేస్తుంది''

"ప్రేమే సర్వస్వం అనుకునే నాకు డబ్బు కూడా ముఖ్యంకాదు సార్! అదంతా వది లేసి వచ్చేస్తే మీకేం అభ్యంతరం ఉండదు గా''

ఈమె అన్నంతపనీ చేస్తుందని గ్రహించు కున్న చరణ్‌కి చెమటలు పట్టసాగాయి.

"బట్... మీ ధనవంతులవల్ల కాని పని అది..." స్థిరంగా అన్నాడు చరణ్.

సీరియస్‌గా మారిపోయిన పల్లవి "అ పోహ పడుతున్నారు సార్! ప్రేమకంటే నా కేదీ ఎక్కువ కాదు. కానిపని అని మీరను కుంటున్నది నేను చేసి చూపిస్తాను'' ఛా లెంజింగ్‌గా అంది.

"ఈ వయసువేడిలో ఈ ప్రతిజ్ఞలూ అవీ ఓ నాల్రోజులు థ్రిల్లింగ్‌గానే వుంటాయ్! నాలాంటి పేదవాడి వెంట జీవితాంతం సాగడం, నీవంటి ఆగర్భ శ్రీమంతురాలికి సాధ్యం కాదు పల్లవీ!"

"ప్రేమతత్వం మీకు అర్థం కాదేం సార్! తనని కోరుకున్నవాడికంటె, తాను కోరుకు న్న వాడికోసం ఏమైనా వదిలేసి రాగలదు స్త్రీ"

"కావచ్చు! అది అందరికీ కుదర్దు. నీకు కుదిరినా నాకు కుదరదు. 'పేదవాడి ఆశ-అసలుకే మోసం' అంటారు. ఏదేమైనా నేను నీమీద ఆశలు పెంచుకోలేను. ఇద్దరి మధ్యా ఎన్నో అంతస్తులు. మేం మీతో సరితూగలేం తల్లీ! నాదార్న నన్ను పోనీ''

"ప్లీజ్ చరణ్! నన్నర్థం చేసుకోలేవా? ఈ పల్లవి ఎప్పటికీ నీదే. నువ్వు ఏది అసాధ్యం అన్నావో, అది ఈ క్షణంనుంచే సాధ్యం చేస్తాన్నేను. కట్టుబట్టల్తో నేను నీవెంట రావడా నికి సిద్ధం..." అని చప్పట్లు కొట్టి డ్రయివర్‌ని పిల్చింది.

"డ్రైవర్! కారు తీసుకుపో' ఆర్డర్ వే సింది పల్లవి.

"కారుతోపాటు ఈ పిల్లని కూడా అర్జెంటు గా తీసుకుపో తండ్రీ!" చేతులు జోడిస్తూ, ముసలి డ్రైవర్ గవరయ్యతో అన్నాడు చరణ్.

చరణ్ వంక ప్రశంసగా చూసి, "పదండ మ్మాయిగోరూ!" అన్నాడు డ్రయివర్.

"గవరయ్యా! ఆర్డర్ వేసింది నేను'' గంభీరంగా అంది పల్లవి.

" కానీ.. బాబూ, రిక్వెస్ట్ చేసింది నేను'' చరణ్ అక్కడ్నించి వడివడిగా నదినీళ్లలో ముఖం కడుక్కోడానికి వెళ్లిపోయాడు.

అలా చూస్తూండిపోయింది పల్లవి.

★ ★ ★

డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ సీరియస్‌గా షెల్ఫ్ వెతుక్కుంటున్నాడు. అప్పుడే లోపలికొస్తూ న్న అసిస్టెంట్ రాణి "ఏంటి బాస్! వెతుకు తున్నారు?" అడిగింది.

"ఓ మర్డర్ కేస్ ఫైలు గల్లంతయింది'' తల ఎత్తకుండానే అన్నాడు.

"వ్వాట్! ది గ్రేట్ డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ ఆఫీసులోనే ముఖ్యమైన ఫైలు గల్లంతా? అలా జరగడానికి వీల్లేదు..." ఓ గొప్ప ఎక్స్‌ప్రెషనిస్తూ అంది రాణి.

"ఏం నువ్వుగాని చూసేవా? లేక... తీసే వా?"

"మర్డర్ ఫైల్‌తో నాకేం పని?" రాణి ప్రశ్న.

"మరి!? అంత ఎక్స్‌ప్రెషనెందుకూ?"

"ఏదో ఫారిన్ బ్లూఫిల్మ్ క్యాసెట్ల కేస్‌కు

సంబంధించిన ఫైల్ అయితే'' గుమ్మానికి చేతులాన్చి అంది.

"అయితే!?" రెట్టించాడు గేమ్సబాండ్.

"అయితే ఏంవుందీ! నా బొంద... మీ ఇన్‌వెస్టిగేషన్ ఎందాకా వచ్చిందో రిఫర్ చెయ్యడానికైనా- దాన్ని మిస్‌ప్లేస్ చేసి ఉండే దాన్ని''

"అంటే!? ఆ రూబెన్‌గాడి వీడియోపోర్నో ఫిలిం కేసు తాలూకు ఫైలు నీపాల బడింద న్నమాట" అని.

సాలోచనగా తలూపుతూ "నేను వెతుకు తూన్నది దాని కోసమే'' అన్నాడు గేమ్స బాండ్.

"మరి మర్డర్ కేస్ ఫైల్ అన్నారుగా'' తలుపుకి జారగిలబడుతూ అంది రాణి.

"పాయింట్ నెంబర్ థర్టీ సిక్స్! వెంటనే నేర్చేసుకో! డొంక తిరుగుడుగా విషయం కదిపినప్పుడు, అవతలివాళ్లు కంగారుపడి పోయి, అసలు తీగ... అదే కావాల్సిన లైన్ తప్పకుండా బయటపెట్టేస్తారు. సో.... ఆ ఫైలేం చేశావు. చాలా అసభ్యకరమైన మేట రుంది సుమా దాంట్లో''

"కేసుకి ఎంత అవసరం అయితే మా త్రం! అన్ని డీటెయిల్సా?"

"ఏం? అవన్నీ నువ్వుగాని చూసేవా? ఇంకెక్కడా నిజం చెప్పనివాళ్లూ, చెప్పకూడ దనుకున్నవాళ్లూ ఇద్దరి దగ్గర మాత్రం నిజం చెప్పాల్సొస్తుంది. వాళ్లే డాక్టర్లూ, డిటెక్టివ్ లూ. వీళ్ల దగ్గర నిజం దాస్తే కేసు అంగుళం ముందుకి జరగదు. అందుకే ఎంత పచ్చి విషయాలైనా,ఇక్కడంతా నిజమే చెప్పాల్సొ స్తుంది. క్లయింట్స్‌కి సంబంధించిన అక్షరా క్షరం మన ఫైల్లో కెక్కుతుంది'' చిన్నసైజు వివరణ ఇచ్చిన గేమ్సబాండ్ ఓ క్షణం ఆగి, తీక్షణంగా రాణి ముఖంలోకే చూస్తూ అన్నా డు. "అయినా నీకీమధ్య పిచ్చి మరీ ఎక్కువై పోయి, బరితెగించి పోతూన్నావ్!"

"స్టాప్! స్టాప్! అక్కడితో ఆగండి. బాస్! మీరు మళ్లీ పులుసులో కాలేశారని చెప్పడాని కి సాహసిస్తున్నా'' ముసిముసిగా నవ్వింది రాణి.

"ఆ రూబెన్ పోర్నోఫిలిం ఫైల్‌తోబాటు, ఆ రేరాణీ నైట్‌క్లబ్ వాళ్ల ఫైలు కూడా పట్టుకుపో యారు'' అంది రాణి.

"ఆం! నీకు తెల్సే పట్టుకుపోయారా!? నువ్వేం చేస్తున్నావప్పుడు? గోళ్లు గిల్లు కుంటూ కూర్చున్నావా? ఇంతకీ ఎవరు వా ళ్లు?"

"త్రీ టౌన్ పోలీస్‌స్టేషన్‌వాళ్లు. ఎస్సయ్‌గా రికి ఏదో రిఫరెన్స్ కావాల్సొచ్చిందట. సమ యానికి మీరు లేరు. దాంతో నన్నడిగీ'' ఆమె మాట పూర్తి కాకుండానే "ఆ మాట నాకు ముందు చెప్పొచ్చుగా! ఎంత హడలి పోయాను!? బుర్ర చూడు. ఎంత వేడెక్కిపో యిందో?" అంటూ కుర్చీలో కూలబడ్డాడు.

"ఏదీ నీపైట చెంగుతో కాస్త విసురు. సమయానికి ఫేన్ కూడా ఆన్ అయి చావ డంలేదు'' స్విచ్ పనిచెయ్యక తంటాలు పడుతున్న గేమ్సబాండ్ అన్నాడు.

"చీర కట్టుకు రాలేదు. స్కర్ట్‌కి చెంగులేదు గా! పోన్లెండి. దీంతోనే అడ్జెస్టయిపోండి'' ఓ చెయ్యి వీక్లీమీదా, మరో చెయ్యి అతని భుజంమీదా వేసింది రాణి.

★ ★ ★

ఆవేళ సోనీ రాలేదు. ఆమె సీటు ఖాళీ.

చాలా డల్‌గా ఫీలవుతూ ఆమె సీట్‌వంకే అదేపనిగా చూస్తూ టైం గడపసాగాడు తరుణ్.

ఇంతలో ఓ నడివయస్కుని వెంటపెట్టు కుని డిటెక్టివ్ గేమ్సబాండ్ వచ్చాడక్కడికి.

ఆ వచ్చిన అతడు నలభై ఏళ్ల వాడైనా తన వయస్సు ఓ పాతిక్కి కుదించి పబ్లిక్కి చూపించడానికి పడ్డ హైరానా అంతా అతడి వేష విలాసాల్లో కన్పిస్తోంది.




"ఏరా! ఇలా ఊడిపడ్డావ్? ఏదైనా ఇన్వెస్టి గేషనా? ఈయనెవరు?" వరసగా తరుణ్ ప్రశ్నించాడు బాండ్‌ని.

"ఈ సీట్లో పిల్ల వచ్చినట్టులేదే!" అంటూనే ఆ కుర్చీ కూడా తరుణ్ ఎదురుగా ఉన్న కుర్చీ పక్కకు జరిపి, తాను కూర్చుంటూ అతన్ని కూడా కూర్చోమన్నట్టుగా సైగ చేసి "ఈయన మిస్టర్ ప్రభుదాస్!" పరిచయం చేశాడు.

నమస్కార, ప్రతి నమస్కారాలయ్యేక ఉపోద్ఘాతంగా దగ్గి "ఇతడో గొప్ప కాంట్రాక్టర్' అన్నాడు బాండ్.

"ఇప్పుడు కాదులెండి! ఒకప్పుడు..." మధ్యలో కల్పించుకుంటూ అన్నాడు ప్రభుదాస్.

"నే చెప్తున్నాగా!" అంటూనే తరుణ్ వైపు తిరిగి "ఈ జాలీగా తిరిగే వ్యక్తి డబ్బు కోసం ఎలాంటి కాంట్రాక్టులైనా ఒప్పేసుకుంటాడు'' అని ఆగాడు.

మధ్యలోనే అందుకుని "అంటే మర్డర్లూ, రేప్‌లూ కూడానా?" అడిగాడు తరుణ్ భయం భయంగా.

అతడి దృష్టిలో డిటెక్టివ్‌లకి అప్పుడప్పుడు ఇలాంటి వాళ్లతోనూ పనిబడుతూ వుంటుందన్న అభిప్రాయం కూడా ఉంది.

"నోనో! ఆ వైపు కాదు ఇతడు. ఈయన ఒప్పుకొనే కాంట్రాక్ట్‌లు... ఎక్స్‌పోర్ట్స్ అండ్ ఇంపోర్ట్స్. ఇలాంటి భారీవేకాకుండా లోకల్‌గా చిన్నాచితకా కాంట్రాక్టులూ ఉంటాయనుకో! అయితే ఈ లావాదేవీల్లో తేడాలేవన్నా వొస్తే ఇందాక నువ్వన్నట్టుగా 'ఆ వైపు' కాంట్రాక్టులక్కూడా రెడీయే!"

నిశితంగా పరిశీలించాడోసారి తరుణ్, ఆ వ్యక్తిని. ఆ వ్యక్తి మీద అంత మంచి ఇంప్రెషన్ కలగలేదు. అయినప్పటికీ "ఐసీ! వాట్‌కెన్ ఐడూ ఫర్యూ?" అన్నాడు కర్టెసీకి.

దాన్నే మళ్లీ తెలుగులో అడిగాడు తరుణ్ "అదే! నేనేం చెయ్యగలను మీకు?" ఈసారి బాండ్‌వైపు చూస్తూ.

"నువ్వే చెయ్యగలవనీ చేయూత ఇయ్యగలవనీ తీసుకొచ్చేను. ఇతడికి ఒకప్పుడు బాగా డబ్బుండేది. ఫ్రెండ్సుండేవారు. విలాసాలకి చాలా తగలేశాడు. డబ్బు తరిగింది. ఇప్పుడూ ఫ్రెండ్సున్నారు. ఎందుకూ! ముఖం చాటు చేసేందుకు మాత్రం! కాస్త లేటుగా తెలివి తెచ్చుకున్నాడు. హెల్పింగ్ హేండ్స్‌ని చూపించమని మన ఏజన్సీకొచ్చేడు''

"ఈయన లెవెల్‌కి సరిపోయే భూరివిరాళాలు ఇవ్వగల స్టేజ్ నాకింకా రాలేదు'' సిన్సియర్‌గా అన్నాడు తరుణ్.

"ఛఛ! ఈయన్ని చందాకోసమో విరాళాలు దండుకోవడం కోసమో నీ దగ్గరికి తీసుకు రాలేదు. ఆ మాత్రం డబ్బు పుట్టించే పరపతి ఇప్పటికీ వుంది. అది పెట్టి మళ్లీ కాంట్రాక్ట్ బిజినెస్‌లో దిగాలనుకుంటున్నాడు. మీ ఇండస్ట్రీస్‌కి సంబంధించిన ప్రొడక్ట్స్‌కి ఏదైనా డీలర్‌షిప్ ఇప్పించొచ్చుగా!" సూటిగా చెప్తూ అటూఇటూ చూసి, "నీక్కావలసిన వైపు వ్యవహారాలు ఇతడు చూసుకుంటాడులే! అతడికేదో బిజినెస్ చూపించు! మ్యూచువల్ అన్నమాట!" గొంతు తగ్గించి చెప్పాడు గేమ్స్‌బాండ్.

"గొడవేం వుండదుగద!" అని రహస్యం చెప్తున్నంత మెల్లగా "మరి మన టేస్ట్ ఏమిటో ఆయనకు తెల్సా?" అడిగాడు తరుణ్ కాస్త వంగి గేమ్స్‌బాండ్ చెవి దగ్గర తల ఆన్చి.

సరిగ్గా అప్పుడే ఆఫీస్‌లోకి అడుగుపెట్టిన దీపిక మనసు మీద ఆ దృశ్యం అలా ముద్రించుకుపోయింది.

తండ్రి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి... "ఆఫీస్ సీక్రెట్స్ కాపాడ్డంలో ఎంత సిన్సియరో, కొందరి చేత కొన్ని పన్లు రహస్యంగా చేయించి మంచి ఫలితాలు సాధించడంలో




నూ అంతే నిపుణుడు!"

పదేపదే.. అదేమాట ఆమెకా క్షణంలో గుర్తొచ్చి, తాను చూస్తున్న దృశ్యానికి అన్వయించుకోసాగింది దీపిక.

ఆ క్షణంలో ఆమెకి తరుణ్ ఓ గొప్ప సిన్సియర్ పనివాడిలా తోచాడు. చిన్నగా నవ్వుకుని అక్కడ్నించి వెళ్లిపోయిందామె. తమ రంధిలో వున్నందువల్ల తరుణ్‌గాని, గేమ్స్‌బాండ్‌గాని ఆమె రాకని గమనించలేదు. ప్రభుదాస్ అసలేదీ పట్టించుకోకుండా ఎటో చూస్తున్నాడు.

"ఓ యస్! ఆc! అన్నట్టు, సాయంత్రం వీళ్లమ్మాయి బర్త్‌డే పార్టీవుంది!" గుసగుసలకి ముగింపుగా అన్నాడు గేమ్స్‌బాండ్.

"అవున్సార్! మీరు తప్పకుండా రావాలి!" ప్రభుదాస్ ఇన్వయిట్ చేశాడు.

"వెరీగుడ్! తప్పకుండా వస్తా! అయితే సాయంత్రం..." తరుణ్ మాటల్ని అందుకుంటూ "వైట్ పార్టీలో మాట్లాడుకోవచ్చు!" పూర్తి చేశాడు ప్రభుదాస్.

"సరే! మేం వెళ్లొస్తాం!" అనేసి ఇద్దరూ వెళ్లిపోయాక తరుణ్, ఆ అమ్మాయిని ఊహించుకున్నాడు.

అతడి ఊహల్లో... ఆ స్వీట్ సిక్స్‌టీన్ చాలా చలాకీగా నవ్వుతూ తుళ్లుతూ కేక్ కట్ చేస్తూన్నట్టూ తాను ఆ పిల్లకు కేక్ తినిపిస్తూంటే అంతా 'హేపీబర్త్‌డే' చెప్పినట్టూ... చప్పట్లు... అలా తర్వాత అలవోకగా ఎక్కడో దూర తీరాల విహారాలకు ఒకటే ఊహల దొంతరలు.

  

సాయంత్రం...

దీపికా ఇండస్ట్రీస్ కాంపౌండ్‌లోంచి తరుణ్ బులెట్ మీద బైటికొచ్చి, రయ్యిన దూసుకుపోతూంటే వెనుక నుంచి దీపిక కారు అదే స్పీడ్‌లో అటే రాసాగింది.

తరుణ్ ఎంతకూ సైడ్ ఇవ్వకుండా, కొంతసేపు విసిగించిన అనంతరం ఎదురుగా వస్తున్న ఏదో వాహనం కోసం సైడ్ ఇవ్వక తప్పలేదు. ఆ కొద్దిపాటి గేప్‌లోనే ఆమె లాఘవంగా అతడ్ని ఓవర్‌టేక్ చేసేసింది.

అది సింగిల్ వెహికిల్ మాత్రమే వెళ్లగల రూట్... తరుణ్ బులెట్‌ని నేరోగా క్రాస్ చేస్తూంటే గాగుల్స్ తీసి చేత్తో పట్టుకుని అలవోగ్గా అతడివైపు చూసింది దీపిక.

సరిగ్గా అదే క్షణంలో తరుణ్ కూడా ఆమెని చూశాడు.

కొన్ని సెకెండ్స్ ఇద్దరి చూపులూ కల్సుకున్నాయి.

సభ్యత కాదని తానే చూపు మరల్చుకున్నాడు తరుణ్. అదే క్రమంగా ఆమె చేతిమీదుగా కిందకు ప్రసరించాయ్ అతడి చూపులు.

అదే చెయ్యి... అవే గాజులు... సడన్‌గా గుర్తొచ్చింది.

'ఈ గాజుల చేతిని ఎక్కడ చూశానా?' అని గుర్తుచేసుకోడానికి ప్రయత్నించాడు కాని ఎంతకూ గుర్తుకురాలేదు.

మరొక్కసారి ఆమె ముఖ దర్శనం కోసం తలెత్తి చూశాడు. కాని అప్పటికే కారు వెళ్లిపోయింది.

ఒక్కక్షణంలో అతడి చురుకు బుద్ధి మేల్కొంది.. మారుతీని ఫాలో కాసాగాడు తరుణ్.

మళ్లీ అదే ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర.. ఆమె కారాగింది.

పారలల్‌గా తానూ ఆపి, ఆమెని దగ్గరగా బాగా తేరిపార చూశాడు తరుణ్.

"యస్! ఇదే! ఈ ట్రాఫిక్ సిగ్నల్ దగ్గరే.. ఈ కిస్‌మిస్‌ని నేను మిస్సయ్యానోసారి!" అంటూ గుర్తు చేసుకున్నాడు.

ట్రాఫిక్ సిగ్నల్‌లో పచ్చలైటు పడింది.

ఆమెని వెంటాడసాగాడు తరుణ్.

ఓ పక్క ఊహల్లోకి వెళ్లినా, కాంట్రాక్టర్ ప్రభుదాస్ కూతురి బర్త్‌డే దృశ్యం... అలా ప్రత్యక్షమైంది.

వాచ్ చూసుకుంటూ "అరె! బర్త్‌డే పార్టీ టైం అవుతోంది!" స్వగతంగా అనుకున్నాడు తరుణ్.

ఇంతలో దీపిక కారు, ఓ డిపార్ట్‌మెంటల్ స్టోర్ ముందాగింది.

"ఓహ్! ఇంతవరకూ ఆ పిల్లకి పుట్టినరోజు ప్రజంటేషనేమీ కొనలేదే!" అనుకుంటూ తానూ అందులోకే ప్రవేశించాడు తరుణ్.

చాలా వస్తువులు చూశాడు...

గిఫ్ట్‌గా ఏం కొనిస్తే బావుంటుందో తోచక సేల్స్‌మన్‌ని అడిగాడు.

దీపిక మేకప్ సామానేదో అడుగుతోంది ఆ పక్కనే.

రెండుమూడు ప్రశ్నలతో సేల్స్‌మన్‌ని విసిగించేసరికి, "నాతో చర్చిస్తే లాభం ఏమిటిసార్? ఇలాంటివి ఆడవాళ్లు చూసుకోవాలి. వాళ్లకైతే బాగా తెలుస్తుంది!" అంటూ చిరాకుపడి, మరో కస్టమర్‌కేం కావాలో చూడసాగాడు సేల్స్‌మన్.

తరుణ్ దీపికనుద్దేశించి "ఎక్స్‌క్యూజ్మీ!" అంటూ స్మయిలింగ్ ఫేస్ పెట్టాడు స్టయిలిష్‌గా.

ఏమిటన్నట్టు కళ్లతోనే ప్రశ్నార్థకంగా అడిగింది దీపిక.

ఇద్దరి చూపులూ కొన్ని సెకెన్లు కల్సుకున్నాయి మళ్లీ.

"మీరేం అనుకోకపోతే ఒకటి అడుగుతాను''

చురచురా చూసింది తరుణ్ అదోలా అడిగేసరికి.

వెంటనే సర్దుకుంటూ "ఐ మీన్.. మీ సహాయం కావాలి, ఓ విషయంలో''

మామూలుగా కూల్ అయి తలాడించింది అడగమన్నట్టుగా.

"బర్త్‌డే ప్రజంటేషన్‌గా ఏం కొనిస్తే బావుంటుందంటారు? అది తేల్చుకోలేక ఇందాకట్నుంచి సతమతమవుతూంటే ఆ సేల్స్‌మాన్ ఓ సలహా ఇచ్చేడు మీలాంటి అందమైన, తెలివైన అమ్మాయిలైతే చిటికెలో చెప్పెయ్యగలరని''

దీపిక "ఆ సేల్స్‌మానా?" అతడ్ని చూపిస్తూ అడిగింది.

తలాడించేడు తరుణ్.

మళ్లీ దీపిక ముఖం ఎర్రబడింది. అటువైపు నడిచింది.

"కొంపదీసి అతడ్ని కొట్టరుగదా! అతడి తప్పేంలేదు మిస్!" వెనుకే అడుగులేస్తూ అన్నాడు తరుణ్.

ఆగి, భుజంమీదుగా ముఖం వెనక్కి తిప్పి "మరి!?" అడిగింది దీపిక.

"ఓ పక్క పార్టీకి టైమైపోతోంది. క్విక్‌గా ఓ చిన్న సజెషన్ ఇచ్చేద్దురూ! ప్లీజ్!" ప్రాధేయపడుతూ జాలిగా ముఖంపెట్టిన తరుణ్ వంక క్రమంగా ప్రసన్నంగా మారుతూ చూసి అతడివైపు తిరిగింది.

"ఇంతకీ బర్త్‌డే ఎవరిది?"

"మా స్నేహితురాలిది!"

"ఐసీ! గర్ల్‌ఫ్రెండా?"

"గర్ల్ అని తెలుసు!"

"అంటే!?... టీనేజ్ పిల్లా!" ఆశ్చర్యంగా ప్రశ్నించింది దీపిక.

"తెలియదు..." సిన్సియర్‌గా అన్నాడు తరుణ్.

"అయితే చెప్పడం కష్టం! చూడండి మిస్టర్! ఏదో వంకపెట్టి మాట కలపడానికి ప్రయత్నం చేస్తున్నారనుకుంటాను'' చురచురా చూసిందామె.

"సారీ మిస్! నిజంగానే తెలీదు'' సిన్సియారిటీ ధ్వనించింది తరుణ్ గొంతులో.

"చిత్రంగా వుందే! ఎప్పుడూ ఆ అమ్మాయిని చూడలేదా?"

"ఆమె తండ్రిని మాత్రమే చూశాను. ఇన్వైట్ చేసిందతడే'' ఏ భావమూ కనబడకుండా అన్నాడు.

"ఏజ్ తెలీకుండా చెప్పడం అంటే'' ఆలోచనలో పడింది దీపిక.

"తొందరగా ఏదో ఒకటి సజెస్ట్ చెయ్యండి!" వాచ్ చూసుకుంటూ అన్నాడు తరుణ్.

"భలేగా వుందే మీ గొడవ! మధ్య నేనేం చెప్తాను? అది మీకూ ఆమెకూ వున్న ఎటాచ్మెంట్ని బట్టి ఉంటుంది. మీ మధ్యవున్న ఎఫెక్షన్ మీద, మీరివ్వబోయే గిఫ్ట్ డిపెండ్ అయి వుంటుంది''

"ఇంతవరకూ జస్ట్.. ఇప్పటికీ ఆమెని నేనెరగను... నన్ను నమ్మండి!"

"అది సరేనండీ! రకరకాల ఏజ్గ్రూప్స్ని బట్టి సిట్యుయేషన్స్నిబట్టి గిఫ్ట్ మారుతూంటుంది. అంచేత మీకు నచ్చింది మీరే సెలక్ట్ చేసుకోండి!"

దీపిక, తరుణ్వంక జాలిగా చూసి "ఓకే! ఏ గొడవాలేని ప్రజంటేషన్ ఉండనే ఉందిగా!" అంటూ ఫ్లవర్ బొకే వైపు వేలు చూపించింది.

"థాంక్స్'' చెప్పి ప్రశంసా పూర్వకంగా ఆమెవైపు చూశాడు తరుణ్.



కాంట్రాక్టర్ ప్రభుదాస్ ఇల్లు మహా సందడిగావుంది.

పార్టీకి అతిథులంతా ఒక్కొక్కరే వచ్చి చేరుతున్నారు. కాంపౌండ్లో ఓ వైపు చాలా వాహనాలు పార్క్ చేసి వున్నాయి.

బంగళా అంతా విద్యుద్దీపాల కాంతిలో వెలిగిపోతోంది.

ఫ్లవర్ బొకేతో ఫంక్షన్ హాల్లోకి అడుగుపెట్టాడు తరుణ్.

ప్రభుదాస్ అతడి మిసెస్ రంజని తరుణ్ని సాదరంగా ఆహ్వానించారు. రంజనిని పరిచయం చేశాడు ప్రభుదాస్.

ఇద్దరిమధ్యా ఏజ్ డిఫరెన్స్ని అబ్జర్వ్ చెయ్యసాగాడు తరుణ్.

రంజని మత్తుకళ్లతో ఎత్తయిన ఎదతో, మేని ఒంపుసొంపులతో మహా కవ్వింపుగా వుంది. తొలి చూపులోనే తరుణ్ మీద వ్యామోహాన్ని ప్రకటించింది, రంజని. ముఖ్యంగా ఆమె కళ్లల్లో అద్భుతమైన ఇన్విటేషనల్ ఎక్స్ప్రెషనుంది.

ప్రభుదాస్ అదేం పట్టించుకోకుండా, ఏర్పాట్ల హడావుడిలో ఉన్నాడు.

'బర్త్డే పాపకి ఎంత వయసుంటుందో! తల్లే ఇంత అందంగా వుంటే, కూతురు ఇంకెంత వయ్యారంగా వుంటుందో!' అనుకుంటూ "ఏదీ బర్త్డే పాప?" అని అడిగాడు తరుణ్.

"పాప కాదు.. పాపాయి... చిట్టిపాపాయి'' రంజని అంటూండగానే ఖరీదైన మెరిసే గౌనులో ఆరోగ్యంగా బొద్దుగా ముద్దుగా వున్న ఓ ఆరేడేళ్ల చలాకీ పాపాయి అక్కడికొచ్చింది.

తరుణ్ని చూస్తూనే "హాయ్ అంకుల్!" అంటూ ఆహ్లాదకరమైన అమాయకపు చిర్నవ్వు చిందించింది.

ఒక్కక్షణం గాలిపోయిన ట్యూబ్లైట్లా అయిపోయినా, పూలబొకే ఆ పిల్ల చేతికిచ్చి

"హాపీ బర్త్‌డే టుయూ'' అన్నాడు తరుణ్.

"థాంక్యూ అంకుల్!" అందాపిల్ల.

"అచ్చం తండ్రిపోలికే!" ఏదో అనాలని అన్నాడు తరుణ్.

"అందరూ అదే అంటారు. వాళ్లమ్మకి పాపం! ఈ ముద్దూ-ముచ్చటా చూసే అదృష్టం లేకపోయింది'' రంజని అంది.

"అంటే మీరు!?"

"ఆవిడ పోయాక, ఈమధ్యే నన్నీయనకి కట్టబెట్టారు మా వాళ్లు'' రంజని మాటల్లో ఏదో అస్పష్టమైన నిగూఢమైన బాధని ఇట్టే పట్టేశాడు తరుణ్.

క్షణాల్లో అతడి మస్తిష్కంలో ఏవేవో చిలిపి ఊహలు వర్కవుట్ కాసాగాయి.

ఓహ్! అదన్నమాట సంగతి! ప్రభుదాస్‌కి ఈమె రెండో భార్యా? వాళ్ల వయసుల్లో తేడాకి కారణం తెలిసింది. సరే మరి రంజని నిషాకళ్ల చిలిపి ఆహ్వానాల ఆంతర్యం ఏమిటీ?

'బహుశా ప్రభుదాస్ కాంట్రాక్టుల వెంటపడ్డంలో ఈ సౌందర్యాన్నంతా అడవిగాచిన వెన్నెల చేయడంలేదుకదా!'

ఏమో ఆరా తీసి మరీ తెల్సుకోవాల్సిన పాయింటే అన్నట్టు ఈ కూపీ మాస్టర్ బాండ్‌గాడేడీ? అనుకుంటూండగానే తన డొక్కుబండి మీద లేడీ అసిస్టెంట్ రాణితో సహా దిగాడు గేమ్స్‌బాండ్.

బర్త్‌డే పాపాయి కేక్ కట్ చేసింది.

అందరూ చప్పట్లు కొట్టి పాపకి శుభాకాంక్షలందజేశారు.

పార్టీలో డిన్నర్ ఏర్పాట్లు చాలా స్పెషల్‌గా పసందుగా జరిగాయి.

విందూ మందూతోపాటు, తరుణ్ అభిరుచి మేరకు ప్రభుదాస్ అతడికి మాత్రం అమ్మాయి పొందూ ఏర్పాటు చేశాడు.

అంతవరకు తనకి పడకసుఖం అందించిన కాల్‌గర్ల్ మత్తుగా నిద్రపోతూంటే సిగరెట్ వెల్గించుకుంటూ ఆ పొగల తెరలమధ్య బెడ్‌మీద ఆమె స్థానంలో రంజనిని ఊహించుకున్నాడు తరుణ్.

ఎంత టెంపర్‌మెంట్? ఎంత చలాకీ? చురచురలోనూ అదో వింత అందం. బహుశా ఆమె తీరే అంతగాబోలు! అలాంటి అమ్మాయి తనకి బెడ్‌మేట్ అయితే జీవితాంతం తోడుగా ఉంటానంటే ఓహ్! ప్రతిరాత్రీ ఒకటే సరదాల జాతర కాదూ!

పెళ్లి చేసుకుంటే అలాంటి చలాకీ పిల్లనే పెళ్లి చేసుకోవాలని తీర్మానించుకున్నాడు.

మళ్లీ అంతలోనే "నోనో! పెళ్లి చేసుకుంటే ఇంత ఫ్రీడమ్ ఉంటుందా? ఫ్రేం ఓ చోట ఫిక్స్ అయిపోదూ? అసలు వ్యక్తిగత స్వాతంత్ర్యమనేది వుంటుందా? ఇలాటి సుఖాలెన్నో దూరం అయిపోవూ?" అనుకున్నాడు.

కాని మళ్లీ ఏమూలనుంచో 'ఇలా ఎన్నాళ్లు? జీవితానికో తాడూబొంగరం లేకుండా! పెళ్లితోనేగా ఒక పరిపూర్ణత చేకూరేది. దాన్ని దూరం చేసుకుంటావా?' అంతరాత్మ ప్రశ్నలకి మళ్లీ సందిగ్ధంలో పడ్డాడు తరుణ్.

సగం తొలగిన తెరల అవతల కిటికీలోంచి బయటకి కన్పిస్తున్న రంగు బల్బులు వెలుగుతూ ఆరుతూ...

సిగరెట్ పడేసి, బయటికొచ్చి స్కూటర్ స్టార్ట్ చేయబోతున్న తరుణ్‌ని, అవతల మరో గదిలో కిటికీ తెరల అంచునుంచి అలా చూస్తూ ఉండిపోయింది రంజని ఎంతో తమకంగా.

ఆమెకు అయిదున్నర అడుగుల దూరంలో డబుల్ బెడ్‌మీద అటు తిరిగి నిద్రపోతూ కలవరిస్తున్నాడు నైట్‌డ్రస్‌లో వున్న ప్రభుదాస్ "ఎంజాయ్! ఎంజాయ్ మై ఫ్రెండ్!" అంటూ.

★ ★ ★

హృషీకేశ్‌గారు దీర్ఘంగా నిశ్వసించి, సాలోచనగా తన ఎదుట కూర్చున్న తరుణ్ వంక చూస్తూ, "అయితే ప్రభుదాస్‌కి ఆ కాంట్రాక్ట్




ఇవ్వవచ్చునంటావ్!" అన్నారు.

"యస్సార్! ప్రభుదాస్ ఈ ఫీల్డ్‌లో ఎక్స్‌పర్ట్! సందేహంలేదు. కాంట్రాక్టర్‌గా అతనిది ప్రూవెన్ ట్రాక్. అందుకనే సాహసించి, నేనే ఈ నిర్ణయం తీసుకున్నాను, అదీ మీకు ముందుగా చెప్పకుండానే'' స్థిరంగా అన్నాడు తరుణ్.

"అఫ్‌కోర్స్! నువ్వు కమిట్ అయిపోయాక... కానీ నన్ను ఒప్పించలేకపోయి వుంటే, నువ్వు ఇరుకున పడేవాడివి కదూ?" కవ్వించాలని అన్నాడు హృషీకేశ్.

"అసలు అటువంటి సమస్యే వచ్చి వుండేదికాదు సార్! ఎందుకంటే తప్పనిసరిగా మిమ్మల్ని ఒప్పించగలనన్న ధీమా నాకుంది అదీ నొప్పించకుండా''

"ఏ బేస్‌మీద?"

"ద ఓన్లీ వన్ బేస్. కంపెనీ డెవలప్‌మెంట్ పర్పస్''

"శభాష్! బాధ్యతని గుర్తించిన సిన్సియర్ అధికారిగా, నీకున్న అంకితభావాన్ని అభినందించకుండా వుండలేకపోతున్నాను. మైడియర్ తరుణ్! తాను పనిచేసే ఇండస్ట్రీ అభివృద్ధిని అందులోని సీనియర్స్ ప్రతి ఒక్కరూ నీలాగే కోరుకోవాలి. ఆవిధంగా కృషి చెయ్యాలి. సో నౌ అయాం వెరీ వెరీ హాపీ. ఈ సంతోష సమయంలో నీకో స్పెషల్ అనౌన్స్‌మెంట్! నా ఇండస్ట్రీస్ వ్యవహారాలు ఇక నువ్వే చూసుకోవాలి. ఫుల్ ఫ్లెడ్జ్‌డ్‌గా నీ భుజస్కంధాల మీద మోయాలి. దీన్ని ఎంత టాప్‌మోస్ట్‌కి తీసుకెళ్లదలిస్తే అందుకు అవసరమయ్యే సర్వాధికారాలూ నీకు అప్పగిస్తున్నాను'' తరుణ్ పనితనం పట్ల బాగా ఇంప్రెస్ అయిపోయి, అప్పటికే ఓ నిర్ణయానికొచ్చేసిన హృషీకేశ్ అన్నారా మాట!

"థాంక్స్.. థాంక్స్ ఎలాట్ సార్!" ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు తరుణ్.

"అంతేకాదు యంగ్‌మాన్! నీ మీద నాకున్న అపార విశ్వాసాన్ని ఇంకా పెంచుకుంటూ పోగలవనుకుంటున్నాను. చొరవా, ఉత్సాహం, నిర్వహణా సమర్థతా వున్న నీలాంటి వాళ్లవల్ల త్వరలోనే మనం విదేశీ మార్కెట్‌ని పట్టుకోగలమని నా నమ్మకం! మన కంపెనీ పేరు ప్రతిష్టలు ఇక్కడికే పరిమితం కాకుండా, ఫారిన్‌కూడా స్ప్రెడ్ చేయగలవన్న నా విశ్వాసాన్ని వమ్ము చెయ్యవనే ఆశిస్తున్నాను'' తన మనసులో మాట బయటపెట్టారు హృషీకేశ్.

"ష్యూర్ సార్! మీరే చూస్తారుగా! మన ప్రాడక్ట్స్ ఫారిన్లో ప్రత్యక్షమయ్యేరోజు అతి దగ్గర్లోనే ఉంది! ఈ క్షణంనుంచే నేను దాన్నే లక్ష్యంగా తీసుకుంటున్నాను'' స్పష్టంగా తరుణ్ చెప్తూంటే పులకించిపోయాడు హృషీకేశ్.

★ ★ ★

"నువ్వంతలా అప్రిషియేట్ చేస్తున్న మీ కాండిడేట్... అదే ఆ తరుణ కుమారుణ్ణి చూశాను డాడీ!" చిర్నవ్వుతో కుర్చీ లాక్కుంటూ తండ్రి ఎదుట కూర్చుంది దీపిక.

"చూశావా...? మాట్లాడావా...? నీ అభిప్రాయం ఏంటి? నాకు నచ్చడం సరే! నీకు అతన్ని చూస్తే ఏమనిపించింది?" ఆతృతగా ప్రశ్నలవర్షం కురిపించారు హృషీకేశ్.

"కాస్త దగ్గరగానే చూశాను. నేనెవరో తెలీకుండా జాగ్రత్తపడుతూ మాట్లాడాను కూడా! చాలా అమాయకుల్లా కన్పించాడు డాడీ! మరి నువ్వెందుకంతగా పొగుడుతున్నావో నాకు అర్థంకావడంలేదు''

"అదేమిటమ్మా! అతడి పర్సనల్ ఫైల్ చూడు! ఎంత ఎఫిషియంట్ అని ఉందో రికార్డులో... ఇంతకీ ఏం మాట్లాడి, ఏం అభిప్రాయానికొచ్చావో మరి!?"

"కనీసం బర్త్‌డే ప్రజెంట్ ఏమివ్వాలో కూడా తెలీని పప్పుసుద్ద డాడీ!" ఆరోజు స్టోర్స్‌లో సంభాషణ గుర్తు తెచ్చుకుంటూ,

పెదాలమీద దరహాస రేఖ మెదుల్తూండగా అంది.

"ఓహ్...! ఇంకేమిటో అనుకున్నాను. చూడమ్మా! కొందరికి తమ ప్రొఫెషనూ, అందులో పైకొచ్చే యాంబిషనూ తప్ప వేరే ఇంకేమీ పట్టవు. అంతెందుకూ! ఆమధ్య మళ్లీ నేనోసారి పెళ్లిప్రస్తావన ఎత్తి, 'కనీసం మా అమ్మాయి ఫొటో అయినా చూడవోయ్' అంటే, 'నా టార్గెట్ నేను చేరుకున్నాకనే పెళ్లి గురించి ఆలోచించేది' అని స్పష్టంచేశాడ మ్మా! అదే మరొకరైతే అందం, ఐశ్వర్యం ఉన్న నిన్ను నిరాకరిస్తారా? ఎగిరి గంతేసి ముహూర్తం ఎప్పుడంటూ వాటేసుకోరూ?" కూతురే తరుణ్ ప్రస్తావన తెచ్చిందన్న ఆనందంలో మరింత ఉత్సాహపడిపోతూ అన్నాడు హృషీకేశ్.

"అయితే సరే డాడీ! మీరింతగా చెప్తున్న ఆ రుష్యశృంగుణ్ణి నేనే కొమ్ములు వంచి నావాణ్ణిగా చేసుకుంటాను... ఛాలెంజ్!"

"అయ్యయ్యో! నువ్వెవరో ముందే తెలిస్తే అతడు చేసుకోడమ్మా! మరింత దూరం జరిగిపోతాడేమో!" కంగారుపడుతూ అన్నారు హృషీకేశ్.

"సో... తెలీకుండానే జాగ్రత్తపడతానన్న మాట!" స్వగతంగా పైకే అని, "చూస్తూండండి డాడీ! ఓ నెల్లాళ్లలోగా అతడూ, నేనూ జంటగా మీక్కనిపిస్తాం!" దీపిక అంది.

"హమ్మయ్య! అయితే అబ్బాయ్ నీకూ నచ్చాడన్నమాట" పెద్ద బెదురు తీరినట్లు అన్నారాయన.

"ఊఁ!" చిర్నవ్వుతో లేచింది దీపిక.

★ ★ ★

బాల్డ్‌హెడ్ చిదంబరం హుషారుగా ఫైలు పుచ్చుకుని హృషీకేశ్‌గారి ఛాంబర్లోకి దూరాడు.

చేతిలో ఫైలు ఆయన చేతిలో పెడుతూంటే వారిస్తూ "నో! నో! నాకేం చూపించక్కర్లేదు. కంపెనీ బాధ్యతలన్నీ తరుణ్‌కి అప్పజెప్పేశాం! సర్క్యులర్ జారీ చేసి చాలారోజులయిందిగా! మళ్లీ ఈ ఫైల్‌తో నాదగ్గరకెందుకొచ్చినట్టు? మేం ఇప్పుడీ ఇండస్ట్రీకి ఆనరరీ ఓనర్లం. అంతే!..." అంటూ నవ్వుతూ విలాసంగా పైపు నోట్లో పెట్టుకున్నారు హృషీగారు.

"కాని సార్! ఇది మీరే స్వయంగా చూడాలి! అఫీషియల్ కాదు... పర్సనల్!"

"ఎవరి పర్సనల్?"

"మీరెంతో నమ్మకంతో, మొత్తం ఈ ఇండస్ట్రీస్‌కే పట్టంకట్టి పెద్దను చేసిన ఆ తరుణ్‌బాబు చిన్నబుద్ధుల తాలూకు పర్సనల్..."

"అంటే!?"

"చూడండి... మీకే తెలుస్తుంది''

ముఖం చిట్లించి ఫైల్ అందుకున్నాడు హృషీకేశ్.

అందులో తరుణ్ పక్కన రకరకాల ఫోజుల్లో అమ్మాయిలు, ఆ ఫొటోల్లో రిసెప్షనిస్ట్ కూడా ఉంది. తరుణ్ సంతకంతో ఉన్న లవ్‌లెటర్, అలాగే రకరకాల అమ్మాయిల సంతకాలున్న ప్రేమలేఖలు... అక్కడక్కడ పెదాల లిప్‌స్టిక్ ముద్రలూ...

బాగా ఆ ఫొటోలు పరిశీలించాక "గుడ్ కలెక్షన్! చాలా బావున్నాయండీ ఇవి! బురద జల్లే ప్రయత్నంలో ఓ ట్రిక్ ఫొటోగ్రాఫర్ని, కొంతమంది కాల్‌గర్ల్సనీ బాగానే వాడుకున్నారు. ఇంతకీ వీటన్నిటికీ బిల్లు ఎంతయిందో?" చాలా తాపీగా ఫైలు చిదంబరం చేతుల్లో పెడుతూ అన్నారు హృషీ.

తెల్లబోవడం చిదంబరం వంతైంది.

"అదేంటి సార్ అలా అంటారు? అతడో ప్లేబాయ్! ఆడపిల్లల్ని ఇట్టే ఆకర్షించి ఇలా బుట్టలో వేసుకుంటాడు. మన సోనీ లేదూ..." ఇంకా చెప్పబోతున్న చిదంబరాన్ని అడ్డుకుంటూ, "స్టాప్ నాన్సెన్స్! మీరెవరి




మీద కంప్లయింట్ చేస్తున్నారో కాస్త తెలుసుకుని మాట్లాడండి! మేం అతడెటువంటి వ్యక్తో తెలీకుండానే అంత ఉన్నతమైన పదవిలో కూర్చోబెట్టలేదు. వయస్సులో పెద్దవారు... ఓ సెక్షన్‌కి హెడ్... మీరే ఇలాంటివి చేస్తే...?" కోపంగా అన్నారు హృషీకేశ్.

"క్షమించండి సార్... నాకాయనమీద ఎలాంటి విరోధమూ లేదు. ఇది అతడి వీక్‌నెస్. నన్ను నమ్మండి, నమ్మకపోండి! నా మాట పూర్తిగా విన్పించుకోకుండానే మీరు నాపై కోప్పడుతున్నారు. కావాలంటే సోనీని అడగండి! మొత్తం మన ఇండస్ట్రీలో చాలామందిని అడగండి! ఎవరెంతవరకు అతన్ని సమర్థిస్తారో, ఎంతవరకు నా మాట నిజమని అంటారో మీకే బోధపడుతుంది. వస్తా సార్!" చిదంబరం ఛాంబర్లోంచి బయటకెళ్లిపోయాక ఆలోచనలో పడ్డారు హృషీ.

'ఫలించే వృక్షానికే రాతి దెబ్బలు' అని సామెత... కొందరు ఈర్ష్యతో ఈ దుష్ప్రచారానికి పూనుకొన్నారేమో! అయినా మరో కోణంలోంచి చూద్దాం! 'నిప్పు లేందే పొగ రాదుకదా!' ఇదీ మనసామెతే. ఏమిటో! మన సామెతలు సార్వకాలీన సత్యాలు అంటారుగాని ఇంత పరస్పర విరుద్ధంగా ఎందుకున్నాయో...! అసలెందుకిన్ని తర్జనభర్జనలు...? మనమే టెస్ట్ చేస్తే పోలా? సీట్‌లోంచి లేచి, అలా విభాగాలకేసి నడవసాగారు హృషీకేశ్.

కొందర్ని పలకరించి తరుణ్ గురించి ఆరా తీశారు. కోపం ఉన్న ఒకరిద్దరు మాత్రం, 'అతడో పచ్చి వ్యభిచారి' అనీ, 'కొత్త పిట్టని చూస్తే అతడికి మతిపోతుంది' అనీ... చెప్పేసరికి హృషీగారి మూడ్ అవుట్ అయిపోయింది. నిస్త్రాణగా తన ఛాంబర్లోకి వచ్చి సీట్‌లో కూలబడ్డారాయన. 'కూతురీ మాటలు వింటే ఎంత బాధపడుతుందో...!' అనుకున్నారు. కాని ఓ ఫ్లాంట్‌లో హృషీగారు ఓ వ్యక్తిని ప్రశ్నిస్తూంటే చాటుగా వినసే వింది దీపిక.

★ ★ ★

చాలా డల్‌గా, నిజానిజాలు తేల్చుకోలేక సతమతమైపోతున్న తండ్రి ముఖ కవళికలనే దీక్షగా చూస్తూ, ఆయన ఛాంబర్లోకి ప్రవేశించింది దీపిక.

తల పట్టుకుని, కణతలు నొక్కుకుంటున్న హృషీకేశ్ కూతురి రాకను గమనించలేదు.

కొన్ని క్షణాల తర్వాత...

టేబుల్‌మీదున్న గ్లాస్ మూత తీసి, మంచినీళ్లు తాగబోతూ తల ఎత్తి చూసిన హృషీ ఎదురుగా కూతురు ఉండడం చూసి అదిరిపడి "అరె! నువ్వెప్పుడొచ్చావమ్మా?" అన్నారు తడబాటుగా.

"మీ ఫేవరేట్ తరుణ్ గురించి, ఇందాక ప్రొడక్షన్ వింగ్‌లో ఆరా తీస్తూన్నప్పుడు డాడీ! అదేంటి? అలా అయిపోయారు! మనం విన్నవన్నీ నిజాలూ కావు డాడీ? నిజాలన్నీ మన చెవిదాకా చేరకనూ పోవచ్చు! అంచేత ఇందులో చింతపడాల్సిందేంలేదు. మనమే డైరెక్ట్‌గా అతన్ని పరీక్షిస్తే తేలిపోదూ?" ఆలోచన అందిస్తూన్నట్టుగా అంది దీపిక.

"గుడ్! గుడ్ సజెషన్!..." గటగటా మంచినీళ్లు ఒక్క గుక్కలో తాగేసి "యస్! అదే చెయ్యాలి! మనమే ఏ కాల్‌గర్ల్‌నైనా బుక్‌చేసి, అతడి బిహేవియర్‌ని పరీక్షించమంటే తెల్సిపోతుంది!" హృషీ అన్నారు.

తండ్రి మాటలకు అడ్డంగా తల ఊపుతూ, "నో డాడీ! అతడు నిజంగా అమ్మాయిల్ని ట్రాప్ చేసేవాడైతే ఆ అద్దెపిల్లతో కుమ్మక్కు అయిపోకూడదని గ్యారంటీ ఏమిటి?" దీపిక.

"మరెలా?" ఆలోచనలో పడ్డారు హృషీ.

"అంచేత మనమే ముఖాముఖీ తేల్చుకుంటాం అన్నమాట!" చెవిలో రహస్యంగా తన ప్లాన్ దీపిక చెప్తూవుంటే హృషీకేశ్ ముఖం విప్పారింది.

★ ★ ★




ఒక సాదాసీదా అమ్మాయి వేషంలో, అతి సాధారణమైన అలంకరణతో తరుణ్ సీటు దగ్గరకు "నమస్తే సార్!" అంటూ వచ్చింది దీపిక. ఆశ్చర్యంగా చూస్తోంది సోనీ.

"నమస్తే! కూర్చోండి!" అంటూనే ఆమెని పరీక్షగా చూస్తూ, 'ఈమెని ఎక్కడో చూసినట్టుందే' అని ఆలోచనలో పడ్డాడు పక్కకి తిరిగి. తానెవరో చెప్పవద్దన్నట్టుగా సైగచేసింది సోనీకి దీపిక.

"ఇటు చూడండి సార్! మాది చాలా పూర్ ఫామిలీ! మా కుటుంబానికి నా రెక్కలే ఆధారం! ఈ ఇండస్ట్రీస్ అంతటికీ మీరే ఇన్‌ఛార్జ్ అనీ, మీరు తల్చుకుంటే నాకు ఉద్యోగం ఇవ్వడం అంత కష్టం కాదనీ ఇక్కడ చాలామంది అన్నారు. అంచేత మిమ్మల్నే రిక్వెస్ట్ చేస్తున్నాను... దయచేసి నన్ను మీ కంపెనీలోకి తీసుకోండి సార్!" చేతులు జోడిస్తూ చాలా దీనత్వాన్ని అభినయిస్తూ అంది దీపిక.

"ఎవరా చెప్పినవాళ్లు? చెప్పుడు మాటలు వింటే చెడిపోతారని తెలీదూ? ఎవరేది చెప్తే అది నమ్మేయడమే?"

"అబ్బే! అదేం లేదండీ! నిజంగానే నాకో ఉద్యోగం చూపించరూ! ప్లీజ్!" సోనీ అటే చూస్తూండడంతో చిరాగ్గా మొహంపెట్టి అన్నాడు తరుణ్, "ఇక్కడేం ఉద్యోగాలు రాశులు పోసుక్కూర్చోలేదు. వెళ్లవమ్మా వెళ్లు!"

"అలాగంటే ఎలాగండీ? మీరు రికమెండ్ చేస్తే పెద్దసార్ కూడా కాదనరని విన్నాను''

"అదుగో! మళ్లీ అదేకూతా!? ఎవరో చెప్తారు... మీరు వింటారు. నా ప్రాణం, తీస్తారు..." సోనీ అక్కడ లేకపోతే హుషారు చూపించేవాడే...!

"ఛ! అవేం మాటలండీ!" కొంచెం గొంతు తగ్గించి "మీరు నాకు ఉద్యోగం చూపించారనుకోండి! ఏదో ఉడతాభక్తిగా నాకు వీలైన గిఫ్ట్ నేనూ ఇచ్చుకుంటాను. మీ శ్రమ ఊరకే ఉంచుకోనులెండి!" కన్నుగీటుతూ అంది.

ఆ దెబ్బకి టెంప్ట్ అయిపోయిన తరుణ్, అది టెస్ట్ అని తెలీని తరుణ్, ఆ బలహీన క్షణాలకి లొంగిపోయేవాడే! సంభాషణ అక్కడే పొడిగించేవాడే! కానీ అతడి ఫేట్ అతడికి ఫేవర్‌గా ఉంది. ప్రభుదాస్ అక్కడికి రావడంతో "సార్! మీకోసం ఎవరో వస్తున్నట్టున్నారు... సాయంత్రం గాంధీ పార్క్‌కి రండి! మీ నిర్ణయం అక్కడ చెప్పండి!" లేస్తూ అంది. అలా జరగడం తన మంచికే అని తెలీదు అతడికి.

ఓక్షణం ఆమె వెళ్లిపోతున్నందుకు చాలా ఫీలైపోతూ, ప్రభుదాస్‌ని కసితీరా మనసులో తిట్టుకున్నాడు తరుణ్.

ప్రభుదాస్ ఏదో మాట్లాడి వెళ్లిపోయాక సోనీద్వారా ఆమె మహా అసాధ్యురాలు అనీ, బహుశా అధినేత హృషీకేశ్‌గారి టెస్ట్‌లో ఇదో పార్ట్ కావచ్చనీ తెలుసుకున్న తరుణ్ 'ఔరా!' అని ఆశ్చర్యపోయి ముక్కున వేలేసుకున్నాడు. దీపిక వివరాలు చెప్పకుండా, జాగ్రత్తగా ఉండమనిమాత్రం హెచ్చరించింది సోనీ.

★ ★ ★

గాంధీపార్కులో...

అన్నమాట ప్రకారమే తరుణ్‌కోసం ఎదురుచూస్తూ ఉంది దీపిక.

అదే బీద గెటప్... ముఖం అంతకంటే దీనంగా. దూరంనుంచే ఆమె వాలకం కనిపెట్టేసిన తరుణ్ తానూ ఎలాంటి టెస్ట్‌కైనా రెడీ అయిపోతూ ఆచి, తూచి అడుగెయ్యడానికి నిర్ణయించుకున్నాడు. సోనీ మాటలే అతడి మీద పన్చేస్తున్నాయి.

తరుణ్‌ని చూస్తూనే, "నమస్తే సార్! మీరు రారేమోననుకున్నాను. ఈ పేదరాలిని ఆదుకోడానికి ఆపద్బాంధవుల్లా కదిలివచ్చారన్నమాట!" ఉపోద్ఘాతం సంధిస్తూ అంది దీపిక.

"నేనెవరికీ బంధువునీ కాను, స్నేహితుణ్ణీ

కాను. అసలేమిటి కథ?" సేఫ్‌సైడ్‌గా ఉంటుందని, తానూ బ్యాలెన్స్‌డ్‌గా డైలాగ్ వేశాడు.

"అబ్బో చాలా ఉందండీ! పూర్తిగా చెప్తే పూర్వపు సినిమాలా పదహారు రీళ్లు సాగుతుంది''

"వద్దు! టూకీగా ఇంగ్లీష్ పిక్చర్లాగా ఏడెనిమిది రీళ్లలో ముగిస్తే బెటరు''

"మరండీ... నా లైఫంతా యమా ట్రాజెడీ అండి! ఒకటేంటండీ... అన్నీ కష్టాలేనండి! అసలు కష్టాలే ముందుపుట్టి తర్వాత నేను పుట్టానేమో అన్పిస్తుంటుందండి!"

"ఆగు! ఆ కష్టాల లిస్టు నేను విప్పనా! తండ్రి పక్షవాతం రోగి. తల్లికి రేచీకటి... కాకపోతే ఈ రోగాలు వైస్‌వెర్సా... అదీ కాకపోతే ఇలాంటివే ఏవో మంచాన్నంటిపెట్టుకోవలసి వచ్చే దిక్కుమాలిన రోగాలు. అక్కడికయిందా! మాంచి బ్రిలియంటు తమ్ముడు... వేలకొద్దీ రూపాయలు తగలెట్టే ఫీజులున్న కాలేజీలో చదూతుంటాడు. ఇంకా చెల్లెళ్లూ, తమ్ముళ్లూ ఓ అరడజనుమంది... అందరికీ తమరే ఆధారం... అవునా!?"

"అబ్బ! ఫ్రేమ్ టు ఫ్రేమ్ చూసినట్టు ఎంత కరెక్ట్‌గా చెప్పేరండీ! వీళ్లని ఉద్ధరించడానికి నేనేం కంకణం కట్టుకోలేదు. కాని బతికించుకోడానికి నాకు అర్జెంటుగా ఉద్యోగం అవసరమండీ! మీరేం చెయ్యమన్నా సిద్ధమేనండీ!"

"ఈ పార్కులో ఎక్కడన్నా పాడుబడ్డ నుయ్యి ఉందా?"

"లేదండీ... దేనికండీ?"

"వెంటనే అందులోకి దూకడానికి''

"నేనాండీ...? మీరాండీ?"

"తమరేనండీ! పుట్టెడు కష్టాలు పెట్టుకొని ఇంకా బతకడం ఎందుకండీ?"

"ఛ! అవేం మాటలండీ! మనిషన్నాక చూస్తూ చూస్తూ ఎలా ఛస్తారండీ? ఏదో ఈ జానెడు పొట్టకోసం తిప్పలు తప్పవు కదండీ!" ఛాన్స్ దొరికింది కదా అని మెల్లగా పైట తప్పించింది.

"ఇదుగో చూడమ్మా! నేను స్త్రీ జనోద్ధరణ సంఘంలాంటిది ఎప్పుడైనా ఫ్యూచర్లో రన్ చేయడం అంటూ జరిగితే ఫస్ట్ ప్రిఫరెన్స్ నీకే ఇస్తాను. అంతవరకూ నన్ను ఉద్యోగం, సద్యోగం అంటూ వేధించకు!" ఓరకంట ఆమె లోతైన బొడ్డునే చూస్తూ అన్నాడు.

"ప్లీజ్! అలాగంటే ఎలాగండీ? ఏదో నేనిచ్చుకోగలిగింది తృణమో... పణమో ఇస్తానని చెప్పాగదా! మ్యూచువల్ అన్నమాట! అసలీ 'ఇచ్చిపుచ్చుకోడాలు' అనాదిగా వస్తూనేవున్నాయ్ గదండీ!" ఇచ్చిపుచ్చుకోడాలు అనే మాటని ప్రెస్ చేస్తూ అంది.

"ఓపక్క పైసా సంపాదన లేదంటూ, ఇంకేం ఇవ్వగలవు? చాల్చాల్లే! వెళ్లవమ్మా వెళ్లు!"

"ఇవ్వాలంటే డబ్బేనా? ఇంకేం లేవా? అందం స్త్రీ ధనం కాదా?"

ఖచ్చితంగా ఇది టెస్టే అని బోధపడిపోయిందీ డైలాగ్‌తో తరుణ్‌కి.

"అంత అందగత్తెవా?"

"ఏం... ఈ అందం చాలదా?"

ఎన్ని కష్టాలైనా పడుతుంది కాని, కాలుజారేంత బరితెగించదని తరుణ్‌కి తెలుసు.

"అడ్జెస్టయిపోవడానికి ఇక్కడెవరూ ఆవురావురనడంలేదు..."

"కానీ కాలం ఆవిరయి కరిగిపోతోంది!"

"ఈ తరుణ్ ఎటువంటివాడో తెలిస్తే నువ్విలా బరితెగించి మాట్లాడవ్!" టెంప్టేషన్ అణచుకుంటూనే అన్నాడు.

"మరి!? పురి విప్పి ఆడే మయూరిలా డాన్స్ చేయనా?"

"అమ్మా! నీకోదండం! నువ్వు డాన్సులూ, గంతులూ వెయ్యక్కర్లేదు. ఉద్యోగంకోసం నానా అడ్డదార్లూ తొక్కనక్కర్లేదు''




"ఈ మాట అక్కడే, అప్పుడే చెప్పొచ్చుగా!"

"ఏదీ... నువ్వేగా ఇక్కడికి రమ్మన్నదీ?"

"ఇది చెప్పడానికేనా వచ్చిందీ?"

"ఇంతేకాదు...! ఉద్యోగంకోసం ఇలా అందాన్ని ఎరగా వేయాలన్న తప్పుడు ఊహలు పెట్టుకోవద్దని చెప్పడానికి కూడా వచ్చాను. ఈ దగాకోరు లోకంలో, ఆఫర్ చేయక్కర్లేకుండానే శరీరాన్ని వాంఛించి, వంచించే దుర్మార్గులున్నారు. ఇక ఇలా చెలరేగిపోతే... సంగతి చెప్పాలా!"

"కోరి వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకుంటున్నారు. మరోసారి ఆలోచించి చూడండి!"

"అంత వెంపర్లాడిపోవడంలేదీ తరుణ్! కాలుజారినా, నోరుజారినా వెనక్కు తీసుకోవడం కష్టం. తర్వాత విచారించి లాభంలేదు. ఇంతకంటె నేను చెప్పడానికేంలేదు'' వెనుదిరిగి వెళ్లిపోయాడు తరుణ్.

ఆమె ప్రతి మాటనీ జాగ్రత్తగా అబ్జర్వ్ చేసిన తరుణ్‌కి అది అడుగడుగునా టెస్టేనని, జాగ్రత్త అనీ అతడి బుద్ధి హెచ్చరిస్తూనే ఉంది. అయినా ఆమె అసామాన్య అందాన్ని వెనుదిరుగుతూ కూడా చూస్తూనేవున్నాడు.

★ ★ ★

"ఎవరోగాని, అతడిమీద కక్ష ఉన్నవాళ్లే మీతో అబద్ధాలు చెప్పారు డాడీ! అందుకు సాక్ష్యాలు కూడా గట్టివే సిద్ధం చేసుకు రావడంతో మీరు అనుమానించేలా చెయ్యగలిగారు. బట్... హి ఈజ్ వెరీ ఫెయిర్ పర్సన్ అండ్ బోల్డ్ జంటిల్మన్' మేడమీద బాల్కనీలో ఈజీఛైర్లో రిలాక్సవుతున్న తండ్రితో అంది దీపిక.

"హమ్మయ్య! నువ్వు సర్టిఫై చేశావంటే ఇక తిరుగులేదన్నమాటే!" నిశ్చింతగా అని, "ఎలా డీల్ చేశావేమిటి టెస్ట్‌ని?" ఉత్సాహంగా అడిగారు హృషీకేశ్‌గారు.

జరిగిందంతా వివరంగా చెప్పింది దీపిక.

"చూశావా! నే చెప్పలేదూ! అసలు ఏ వ్యక్తి అయినా కొంతకాలం కొందరి దగ్గరే నటించగల్గుతారు. ఎల్లకాలం అందరిదగ్గరా నటించడం కష్టం! ఎప్పుడో అప్పుడు, ఎక్కడో ఓచోట, ఎవరిదగ్గరో ఒహరిదగ్గర దొరికిపోతాడు. తరుణ్ అలాంటివాడు కాడు. సహజంగా అతడెంత మంచివాడో నాకు తెలీదుటమ్మా? ఎనీవే... నువ్వూ నిగ్గుతేల్చి తెల్సుకున్నాక ఇంక సిగ్గెందుకూ?... ఇహ పెళ్లి భజంత్రీలు ఎప్పుడు మోగేనూ మనింట? వూఁ? చెప్పమ్మా!"

తండ్రి హుషారుగా అడుగుతూంటే అందంగా సిగ్గుపడింది దీపిక.

★ ★ ★

అదే డిపార్ట్‌మెంటల్ స్టోర్సు... స్కూటర్ ఆపాడు తరుణ్.

తాను తొలిసారిగా తన మనసు దోచుకున్న అమ్మాయితో మాట్లాడింది అక్కడే! స్కూటర్ దిగాడు.

అంతకుముందెన్నోసార్లు, ఎంతోమంది అమ్మాయిల్తో కవ్వింతలూ, తుళ్లింతలూ తనకి కొత్త కాకపోయినా, ఎందుకో వాళ్లెవ్వరివల్లా కలగని థ్రిల్ ఆమెతో మాట్లాడుతున్నప్పుడు పొందాడు తాను.

తరుణ్ ఆలోచిస్తున్నాడు, అటే చూస్తున్నాడు.

ఇంతకీ ఆ అమ్మాయి ఎవరో...!?

బాగా కలవారి కుటుంబంనుంచే వచ్చినట్టుంది...!

మాటల్లో, చేతల్లో ఆ డీసెన్సీ... ఆరోగ్యం, నాజూకుల మేళవింపుతో మిసమిసలాడుతున్న ఆ యవ్వనం.

ఎక్కడుంటుందో తెలీకపోయినా, కనీసం పేరు తెల్సినా బావుండేది.

ఆరోజు తాను తొందరలో లేకపోయినట్లయితే ఆమెని ఫాలో అయ్యేవాడే!

పోనీ! ఒకపని చేస్తే!?

ఈ స్టోర్‌కి ఆమె తరచూ వస్తూ ఉంటుందేమో! ఈ దుకాణం ఓనర్‌కి తెలిసుండొచ్చునేమో! అడిగేస్తే సరి! డౌటు తీరిపోతుంది.

అడిగేశాడు తరుణ్. కాని, సరైన సమాధానం లభించలేదు.

నిరాశగా మళ్లీ తన వెహికిల్ దగ్గర కొచ్చాడు.

ఎలా...? ఎలా...?? ఎలా...???

ఆమె పేరైనా కనీసం తెల్సుకోవడమెలా...? చప్పున తన మిత్రుడు గేమ్స్‌బాండ్ స్ఫురించాడు తరుణ్‌కి.

మరుక్షణం అతడు తన డిటెక్టివ్ ఫ్రెండ్ ఆఫీసులో ఉన్నాడు.

"ఏరోయ్! చాలా కాలానికి దయచేసేవ్ మా ఆఫీసుకి! దారితప్పి వచ్చావా!" వేళాకోళం ఆడాడు గేమ్స్‌బాండ్.

"దారి తప్పి కాదురా! దారి చూపిస్తావనే వచ్చా!" కుర్చీలో కూలబడుతూ అన్నాడు తరుణ్.

"వ్వాట్! హీరోగారికి నేను రూటు చూపించడమా? ఏ విషయంలో? ఏదీ నాకు దారి?" వెతుక్కుంటూన్నట్టు అభినయించాడు.

"చాల్లేరా! నీ ప్రొఫెషన్లో ఇలాంటివి నీకు మామూలే! తలా తోకా లేని కేసులెన్నో డీల్ చేసి ఓ కొలిక్కి తెచ్చిన వాడివి''

"ఆపవోయ్! విషయం చెప్పు!"

"నేనో అమ్మాయిని చూశాను''

"చాలామందిని చూశావని నాకు తెల్సు గానీ సోది ఆపు''

"కాదురా బాబూ! నిజంగానే ఇన్నాళ్లూ నేనెందరి మనసుల్ని దోచుకున్నానో నాకు తెలీదుగాని నా హృదయాన్ని మాత్రం ఓ అమ్మాయి దోచుకుంది''

"అయితే ఇంకేం?! నీ దార్లోకి తెచ్చేసుకో!"

"సర్లే! ఆ దారే తెలీక నీ దగ్గర కొచ్చానని చెప్పాగదా!"

"డీటెయిల్సేంటి? ఎప్పుడు ఎక్కడ చూశావ్?"

"మొదటిసారీ రెండోసారీ కూడా ఓ ట్రాఫిక్ సిగ్నల్ దగ్గరే చూశా!" అని "రెండుసార్లకీ మధ్య ఆర్నెల్ల గేప్ ఉందనుకో!" చల్లగా చెప్పాడు.

"ఈ టౌన్లో కనీసం రెండు డజన్ల ట్రాఫిక్ సిగ్నలింగ్ పాయింట్లున్నాయ్!"

"నువ్వు నీ దిగ్రేట్ మౌంట్‌బాటెన్ పీరియడ్ నాటి కోటు బొత్తాం పారేసుకున్నావ్ చూడూ! అదే పాయింట్''

"ఐసీ! ఊc! తర్వాత!"

"తర్వాత ఓ డిపార్ట్‌మెంటల్ స్టోర్‌లో చిరు సంభాషణ.. అదే ప్రభుదాస్ ఫస్ట్‌టైం మనకి పార్టీ ఇచ్చిన రోజు. బట్ మై బ్యాడ్‌లక్ మళ్లీ దర్శనం కాలేదు''

"ఇంతకీ పేరేంటి?"

"తెలీదు''

"ఫొటో ఏమైనా వుందా?"

గేమ్స్‌బాండ్ నెత్తిన మొట్టి, "జోకు వెయ్యకు! పేరే తెలీదురా తండ్రీ అంటే ఫొటో ఎక్కడ్నించి తేను?"

"పేరైనా తెలీకుండా ఏం మాట్లాడేసేవ్రా?"

"ఏమీలేదు! ఉత్త గేస్ మాట్లాడేను''

"నా తండ్రే! ఇంత గాలి పోగేసుకొచ్చి పేరు తెలీదూ, ఫొటోలేదూ వివరాల్లేవు అంటే నేనేం కూపీ లాగుతాన్రా?"

"ఫొటో వుంటే నువ్వేమిటి? పిచ్చాడైనా కనుక్కుంటాడు''

"ఇది మరీ బావుందిరోయ్! నీ ప్రాబ్లెం సాల్వ్ చెయ్యడానికి నేనిప్పుడు మోళీ మాయో నేపాళీ మాంత్రికుణ్ణో ఆశ్రయించా




# ఏరిన ముత్యాలు

☆ పుస్తకాలు లేని యిల్లు కిటికీలు లేని గదిలాంటిది

-రూజ్వెల్టు

☆ గొప్ప త్యాగాలు చేసినపుడే గొప్ప పనులు సాధించబడతాయి

-వివేకానంద

☆ కృత్రిమ కళాసౌందర్యం వేశ్యవంటిది

-టాల్‌స్టాయ్

☆ ధైర్యం నశించినప్పుడు సర్వమూ నశిస్తుంది

-గెథే

☆ తాము అజ్ఞానులమని ప్రజలు తెలుసుకోవడం కష్టం. ఎందువల్లనంటే ఆ విషయం తెలుసుకోవడానికి జ్ఞానం వుండాలి

-జెరెమి టేలర్

☆ ఏదైనా తిరిగి రావచ్చు కాని వృధా చేసినకాలం తిరిగిరాదు

-గాంధీజీ

☆ మారణాయుధాలు మనల్ని నాశనం చేయకముందే మనం వాటిని నాశనం చేయడం మంచిది

-జాన్ ఎఫ్.కెన్నెడి

☆ తరువాత చేయబోయే కార్యమేమిటో తెలుసుకోవడమే వివేకం. దానిని ఎలా చేయాలో తెలుసుకోవడమే నైపుణ్యం. దానిని పూర్తిచేయడమే సద్గుణం

-డి.యస్.గోర్డన్

☆ మనం అభ్యుదయాన్ని సాధించాలంటే చరిత్రను పునరావృతం చేయడంకాదు, నూతన చరిత్రను సృష్టించాలి

-గాంధీజీ

☆ ప్రపంచమెంత దుర్మార్గంతో ప్రవర్తిస్తున్నా తెలిసో తెలియకో సన్మార్గానికి దాసోహమంటుంది

-గాంధీజీ

☆ మాతృదేశంకోసం మరణించినవాడు ఎల్లకాలం జీవించేవుంటాడు

-ఫైడల్ కాస్ట్రో

☆ వైద్య, విజ్ఞానశాస్త్ర విషయాలు బోధించడానికి భారతీయ భాషలన్నింటిలో తెలుగుభాషే అనువైనది

-హల్డేన్

సేకరణ: ఆముదాల అజయ్‌బాబు




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఏప్రిల్ చతుర నవల సూపర్‌హిట్ ..................

**సమీక్షకుని పేరు :** ..................

**చిరునామా :** ..................

..................

..................

..................

ల్సిందే!" అని అటూ ఇటూ చూసి "ఆc! ఐడియా! పోనీ! నిన్ను అంతగా ఆకట్టుకుని నీ హృదయం మీద ముద్రవేసుకున్న ఆ అమ్మాయి బొమ్మని నీకు గుర్తున్నన్ని డీటెయిల్స్‌తో ఈ పేపర్‌మీద గియ్యి!" అంటూ పెన్సిలూ పేపర్ ప్యాడ్ అందించాడు గేమ్స్ బాండ్.

అరగంట తంటాలుపడ్డాకా, నేలమీద ఓ చిన్నసైజు పేపర్ వుండల గుట్ట పడ్డాకా కాగితం మీదకెక్కిన ఆకారాన్ని చూసి మూర్ఛపోతూ "హా! హతవిధీ! ఇలాంటి తాటకిల్నీ శూర్పణఖల్నీ ఎందర్నయినా తేవచ్చు! సరిగ్గా గియ్యరా తండ్రీ!" అసహనంగా అన్నాడు బాండ్.

పెన్సిల్ పడేస్తూ "నో! నేను ఆర్టిస్టుని కానురా! ఆ సంగతి తెల్సి నన్ను బొమ్మ గియ్యమంటే ఎట్టా చచ్చేది? కోలకళ్లూ కోటేరు ముక్కూ చిన్న పెదాలూ శంఖంలాంటి కంఠం వయసుకి తగ్గ అవయవ పొంకం, చేతికి యస్! చేతులకి అద్భుతంగా రవ్వలు పొదిగిన ఖరీదైన గాజులూ... మిగతా శరీరం వర్ణించడానికి... నాకు తెలీదు! నేను చూసినంతమటుకు వివరాలు ఇవీ! వారం రోజుల్లోగా ఆమె ఎక్కడుంటుందీ! ఏం చేస్తుందీ కనిపెట్టి నాకు చెప్పాలి! లేదా ఒరే గేమ్స్‌బాండూ! నీ ప్రాక్టీసుకి ఫుల్ సౌండులో బేండ్ కొట్టేస్తారోయ్!" బెదిరింపు ఎక్స్‌ప్రెషనొకటి ఇచ్చి సీట్లోంచి లేచాడు తరుణ్.

ఆలోచిస్తూ "నీ వర్ణన చాలామంది అమ్మాయిలకి సరిపోతుంది. ఎందర్ని వేటాడను?" తలపట్టుకున్నాడు గేమ్స్‌బాండ్.

★ ★ ★

డాబా పిట్టగోడమీద,

దిగులుగా, మొత్తం తల అంతట్నీ మోచేతుల్తో మోస్తూ కూర్చున్న పల్లవి, తన స్నేహితురాలు సునీతతో అంది "ఆ ప్రవరాఖ్యుణ్ణి ఎలా దరికి తెచ్చుకోవాలో తెలీడంలేదే!"

"నువ్విలా ఎన్నాళ్లు ట్రయ్ చేసినా అంతేనే! డైరెక్ట్‌గా వెళ్లి పెళ్లి ప్రపోజల్ పెట్టేసెయ్"

"అదీ అయింది" నిర్వికారంగా అంది పల్లవి.

"సారు వారేమంటారు?"

"అరమైలు దూరం పరుగెత్తుతున్నారు"

"నీకేం తల్లీ! జ్యూయలరీ షాపు ఓనరు ఏకైక కూతురివి! ఎంతదూరం పరిగెత్తినా బంగారపు పగ్గంవేసి లాక్కురాగలవ్!"

"అదే కుదరడం లేదే! ఆయనకి శ్రీమంతులంటే ఎలర్జీ! సిరి అంటే చేదు ఎలా మరి?"

"ఐడియా! ఈ విషయంలో మనకి రాంపండుగారే ఏమన్నా హెల్ప్ చేస్తే చెయ్యాలి!"

"ఆయనేం చెయ్యగల్రు? మహా అయితే, ఫుల్ డీటైల్స్ ఇవ్వగలరు"

"అవేకదే మనకి పనికొచ్చేదీ!"

"అవెప్పుడో గేదర్ చేసేశా! వెనకా ముందూ ఎవరూ లేని ఏకాకి. మెస్ భోజనం సింగిల్‌రూం నివాసం.. ఆడవాళ్లంటే విపరీతమైన భయం... చాలా ఈ డీటెయిల్స్? ఇవన్నీ తెల్సి మాత్రం ఏం లాభం?"

"పోనీ! ఓ పనిచెయ్!"

"ఏంటది?"

"కిడ్నాపింగ్!"

"ఏంటి? మనమా?"

"మగాళ్లు మాత్రమే కిడ్నాపులు చెయ్యాలని రూలేమన్నా వుందా? ఆ మాత్రం ఆడవాళ్లకి చాతగాదా?"

"ఛ! ఛ! బావుండదేమోనే!"

"నీ మొహం! బావుండేదేమిటే! అలా నానుస్తూ కూర్చుంటే నువ్వు బాగుపడవు లవ్ విషయంలో"

"అంతేనంటావా! అయితే మా డ్రైవర్ గవరయ్యకి అప్పజెప్తా నా పని" అంటూ

చకచకా మెట్లు దిగి, పక్క డాబావైపుచూ పిస్తూ కొన్ని సూచనలిచ్చింది పల్లవి.

తల అడ్డంగా ఊపుతున్న గవరయ్య చేతిలో కొన్ని నోట్లుంచి ప్రాధేయపూర్వకంగా చేతులు జోడించింది. తాను ఆలయం దగ్గర వుంటానన్నట్టు అక్కడికి చరణ్ని తీసుకు రమ్మన్నట్టు సంజ్ఞ చేసి చెప్పింది.

కారుతో వెళ్ళిపోయిన గవరయ్య సరాసరి జ్యూయలరీ షాపుకెళ్లి సేఠ్ విక్రమ్‌చంద్‌కి రిపోర్ట్ చేసి, పల్లవి తనకిచ్చిన నోట్లు చూపించాడు.

కోపంతో ఊగిపోతూ ఆ కార్లోనే బయల్దేరాడు విక్రమ్ చంద్.

ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తున్న పల్లవికి కార్లో తండ్రి రావడం కన్పించి హతాశురాలై కోపంతో బుసలుకొట్టి మండిపడసాగింది.

కారాపి, వినయంగా నిల్చున్నాడు గవరయ్య.

విక్రంచంద్ కూతురి దగ్గరికొచ్చి "పద! కారెక్కు'' అని మాత్రం అన్నాడు ఎంతో కూల్‌గా.

"ఎక్కడికి?"

"అదేం ప్రశ్నమ్మా! మన యింటికి!"

"ఆ ఇల్లు నాదెన్నటికీ కాదు డాడీ!"

"అది తెలుసమ్మా! నిన్ను అత్తవారింటికి సగౌరవంగా ఘనంగా పంపలేడా ఈ డాడీ?"

"నాకు అత్తవారిల్లు, నేను ప్రేమించిన వాడితో పెళ్లి జరుగకుండా ఎలా వుంటుంది డాడీ?"

కోపం హద్దులు దాటుతున్నా సాధ్యమైనంతవరకూ దాన్ని కప్పే ప్రయత్నం చేస్తూ అన్నాడు విక్రంచంద్. "కానీ నువ్వు ప్రేమించిన వాడి స్టేటస్ ఏమిటో తెల్సా? అతడు మన అంతస్తుకి తూగడని గ్రహిస్తే నువ్వీమాట అనవమ్మా''

"హుం! ప్రేమకి స్టేటస్‌తో సంబంధం వుండదు డాడీ! హృదయంతో మాత్రమే కనెక్షన్''

"చిన్న కరెక్షన్ తల్లీ! అన్నివిధాలా మన స్థాయికి సరిపోయే వాళ్ల హృదయంతో మాత్రమే అను''

"ఆస్తులూ అంతస్తులూ శాశ్వతాలా? నేటి అమీరు, రేపు ఫకీరు కాకూడదనీ ఈ పూట పూర్‌ఫెలో రేపటి రిచ్‌పర్సన్ కాకూడదనీ ఎక్కడుంది? ఏ విలువలూ శాసించలేనిదే ఏ ఎల్లలూ బంధించలేనిదే ప్రేమంటే!"

"అనాదిగా ప్రేమికులందరూ చెప్పే చిలక పలుకులే ఇవి తల్లీ!"

"చిలకపలుకులు? ఎంత తేలిగ్గా అనేశావ్ డాడీ! అగ్నిలా దహించే ప్రేమ సంగతి మీ తరానికేం తెల్సు?"

"నీతో వాదించడం కష్టం! ఇంతవరకూ నువ్వడిగిందేనాడూ కాదనలేదు. కాని ఇది నీ జీవితానికి సంబంధించిన విషయంకదా! నన్ను ఆలోచించుకోనిస్తే బావుంటుందేమో! పదమ్మా! ప్లీజ్! మారాం చెయ్యకు'' ఓ స్థిర నిశ్చయానికి వచ్చిన వాడిలా, ఓ పక్క లాలనగా అంటూనే మరో పక్క పళ్లు పటపటలాడిస్తూ తలాడించాడు విక్రంచంద్.

అతడి మెదడులో రూపుదిద్దుకుంటున్న ఆలోచనలు చదివే శక్తి ఆ క్షణాన ఆమెకి గనుక వుంటే సమాధానపడి తండ్రి వెంట వెళ్లి వుండేది కాదు పల్లవి.

★ ★ ★

"చాలా సేపై సీన్లు నడుస్తున్నాయే తప్ప, పాటకి ఛాన్స్ లేదా? మరీ ఇంత గ్యాప్ అయితే జనం బోరైపోరూ?" అడిగాడు జనమేజయం.

"కరెక్టేనండోయ్! చకచకా సన్నివేశాలు న్నాయ్! సాంగ్‌నివేశాలకు చోటెక్కడ ఇంక? అయినా తరుణ్ పాత్రకి కనీసం ఓ పాటైనా ఉండొద్దూ?" సమర్థించాడు ఏమన్.

"తొందరపడితే ఎలా? అసలు మీరిలా మధ్యలో బ్రేకులేస్తూంటే ఫాస్ట్‌గా మూవ్ కావల్సిన సీన్లు సైతం కుదేలైపోతాయ్!"




నమీచి అంది.

"అదేవిటమ్మా! చాలా సేపై మేం ఏమీ మాట్లాడలేదే!' కార్తవరాయ్ అన్నాడు.

"కథ ఇప్పుడే మంచి పాకాన పడుతూన్న తరుణం! ఇక్కడనుంచి అడ్డు తగిల్తే సీన్స్ కంటిన్యూటీ మిస్ అవుతారు. ఆనక మీ యిష్టం!"

"సర్సరే! చివరిదాకా మాట్లాడం! కానీయ్'' ఏకగ్రీవంగా అందరూ ఒప్పుకోవడంతో మళ్లీ కథలోకెళ్లిపోయింది నమీచి.



హృషీకేశ్‌గారి ఛాంబర్లో...

గలగలా సెలయేటి ప్రవాహంలా దీపిక తండ్రితో ఏదో నవ్వుతూ చర్చిస్తోంది. ఆమె నవ్వుతో గొంతు కలిపి ఆ తండ్రి కూడా ఆనందంగా నిండుగా నవ్వుకుంటున్న తరుణంలో...

లోపలికి అడుగుపెట్టాడు తరుణ్ ఫైల్‌తో.

అక్కడ అతనికి ముందుగా దృష్టిని ఆకర్షించింది ఆమె చెయ్యి, దానికున్న నగిషీ రవ్వల గాజులు... ఠక్కున ఆమె ముఖంవంక చూసి అలాగే అప్రతిభుడై నిల్చుండిపోయేడు వచ్చిన పని మర్చిపోయి...

ఒక్కక్షణంలో అతని హుషారు ఎక్కడికో ఊహాలోకాల్లోకి తీసుకుపోయింది.

అప్పటికి నాల్రోజులైంది... ఆమె దర్శనం కోసం తహతహ లాడిపోతున్న తరుణ్‌గేమ్స్ బాండ్‌కి ఆర్డర్‌వేసి.

అటువంటిది ఆ హృదయాధి దేవత సరాసరి తన ఆఫీస్‌లోనే తనకే దర్శనం ఇస్తే ఇహ చెప్పాలా?

తరుణ్ అమితానందంతో డ్యూయెట్ అందుకున్నాడు, ఓ భారీ రాగం తీసి ఊహల్లోనే.

తరుణ్ రాగం తీస్తుండగా, మధ్యలోనే పానకంలో పుడకలా గేమ్స్‌బాండ్ ప్రత్యక్షమై "ఒరేయ్! మాసిన గడ్డంతో డ్యూయెట్లేంట్రా! కాస్తనీట్‌గా ట్రిమ్‌గా తయారై ఏడువ్!" అని హెచ్చరించాడు. ఉరిమి చూసి వాణ్ణి తరిమేసి, రాగం కంటిన్యూ చేస్తూ అరకు వేలీనుంచి పురానాపూల్‌దాకా తెగ తిరిగేసి డాన్స్ చేసేసి హైరానా పడిపోయిన తరుణ్, హృషీకేశ్‌గారి పిలుపుతో ఈ ప్రపంచంలోకి ఊడిపడ్డాడు.

అలా సాంగ్‌నివేశంలోంచి తేరుకోబోతున్న తరుణ్‌కి, హృషీగారు దీపికని పరిచయం చెయ్యబోతూ నోరు తెరిచి, "ఈమె'' అని చిన్న పాజ్ ఇవ్వగానే "ఆగండాగండి! మీరేం చెప్పబోతున్నారో నాకు తెల్సు!" అంటూ తరుణ్ ఉత్సాహపడ్డాడు.

అసలు తానెవరో ఇటు తండ్రి తరుణ్‌కి చెప్పెయ్య కూడదన్న ఆతృతతోపాటు, డిపార్ట్‌మెంటల్ స్టోర్స్‌లో తరుణ్‌కీ తనకూ జరిగిన సంభాషణా అటు అతడా క్షణంలో తన తండ్రితో వివరించడం కూడా ఇష్టంలేని దీపిక ఇద్దర్నీ మాట్లాడనివ్వకుండా తానే అందుకుంది.

"నమస్తే సార్! నా పేరు దీప... అయ్యగారికి నేను చిన్నప్పట్నించీ బాగా తెలుసు! కూతుర్లాంటి దాన్ని! ఆ దయతోనే నన్నీ కంపెనీలోకి తీసుకున్నారు''

"బట్... ఈ హోల్ ఇండస్ట్రీస్‌కి నేను ఇన్‌ఛార్జ్‌ని! నాకు తెలీకుండా సార్, అలా

ఎవరికీ అపాయింట్‌మెంట్స్ ఇవ్వరే!" అని ఆలోచన అభినయిస్తూ "ఏం సార్?" అని ప్రశ్నార్థకంగా హృషీకేశ్ ముఖంలోకి చూశాడు తరుణ్.

కూతురి ప్లాన్ అర్థం చేసుకున్న తండ్రి వెంటనే సర్దుకొస్తూ "ఆఁ! అహ! అవునోయ్! అది చెప్దామనే కదూ నిన్ను పిలిపించిందీ! జస్ట్! ఇందాకే ఆ నిర్ణయం తీసుకున్నానన్న మాట! వెల్ ఎడ్యుకేటెడ్ ఫారిన్ ఎం.బి.ఏ.. నీకు జోడుగా ఐ మీన్ తోడుగా వుంటుందని నేనే అపాయింట్ చేశా!"

"అంటే నాకు పోటీగానా?" కాస్త ఉక్రోషపడిపోయాడు తరుణ్.

"నోనో! డోంట్ ఫీల్ లైక్‌దట్ మైడియర్ యంగ్‌మాన్! నీ స్టేటస్ నీదే! ఆమె ప్రిస్టేజీ ఆమెదే! స్థాయి అదే లెవెల్ విషయానికొస్తే కాస్త అటూ ఇటూగా ఇద్దరిదీ ఒకటే కావచ్చు! ఏదేమైనా మీరిద్దరూ పరిశ్రమకి కావల్సిన వాళ్లని నా ఉద్దేశం. రెండు చక్రాల్లా దీన్ని ఈ సంస్థని పరిగెత్తించాలి మరి!" సర్దేస్తూ అన్నారు హృషీ.

సాక్షాత్తూ కంపెనీ అధినేత ఇచ్చిన అపాయింట్‌మెంట్ ఆర్డర్ అవడంవల్ల ఏం అనలేకపోయిన తరుణ్ "ఓకే సార్! కంపెనీ బాగోగుల విషయంలో, సీనియర్‌గా ఓనర్‌గా మీకంటే నేనెక్కువ కాదుగదా!" అని "ఓహ్! నైస్ మీట్ ఆఫ్‌యూ మిస్ దీపా! వెల్‌కమ్ టు దిస్ ఇండస్ట్రీస్!" దీపతో అంటూనే "రండి వర్క్ షేర్ చేసుకున్నట్టూ నాకు కాస్త సహకరించినట్టూ ఉంటుంది'' ఆమె అందాన్ని కళ్లతోనే ఆస్వాదిస్తూనే ఆహ్వానించాడు తరుణ్.

తాను వెతుకుతున్న అందం, తన ఆఫీస్‌లోనే కనిపించేసరికి థ్రిల్ ఫీలవుతూ, తనకి సాటి పోటీగా మరొకరొచ్చి చేరారన్న జెలసీని మర్చిపోడానికి ప్రయత్నించసాగాడు తరుణ్.

★ ★ ★





తరుణ్‌తో కలిసి ఫ్యాక్టరీ అంతా చుట్టి వస్తూన్న ఓనర్‌గారి కూతుర్ని చూసిన సోనీ షాక్ అయింది. ఇంతకాలం తనతో నవ్వుతూ తుళ్లుతూ గడిపిన తరుణ్, ఇహ తన మొహమన్నా కనీసం చూస్తాడా? ఏదో చెప్పలేని బాధ ఆమె గొంతులో కొట్టుమిట్టాడసాగింది ఆ దృశ్యం చూశాక.

అయినా తానెంత? తన స్టేటస్సెంత? ఇంత పెద్ద ఇండస్ట్రీలో ఆఫ్ట్రాల్ తానో స్టెనో. అంతే!

మరి తరుణ్?

అయ్యగారు డిక్లేర్ చేసినట్టు ఈ హోల్ ఇండస్ట్రీకే ఆయన తర్వాత ఆయనంతటివాడు.అతనితోతనకుఎంతకాలం ఫ్రీడం?ఆయన లెవెల్‌కి దీపికలాంటివాళ్లు సైతం బలాదూరే! అలాంటిది తానో చిన్న రేణువు అంతే!

ఒక్కక్షణం తరుణ్ క్యారెక్టర్‌ని బహిర్గతం చెయ్యాలనిపించిందామెకు. కానీ కాంక్రీటెడ్‌గా సెటిలైపోయాడు తరుణ్, క్యారెక్టర్‌ని బాగా బిల్డప్ చేసుకుని. ఇప్పుడిక అది కూలగొట్టడం అసాధ్యం!

తరుణ్ వచ్చి తన సీట్లో కూర్చున్నాడు.

సోనీని హెచ్చరించింది కనుసైగతో దీపిక, తానెవరో చెప్పొద్దన్నట్టుగా.

అంటే ఆమె ఎవరో ఇంకా తరుణ్‌కి తెలీదన్న మాట! బహుశా ఇది అతనికి పరీక్షా సమయమేమో! లేకుంటే ఇదేమిటి? ఇంత దాగుడు మూతలా?

సాక్షాత్తూ ఓనర్‌గారమ్మాయితో కలిసి తిరుగుతూనే ఆమె ఎవరో తెలీని పరిస్థితిలో తరుణ్ వున్నాడంటే అది అతడి అమాయకత్వం అనుకోవాలో యాజమాన్యపు ఎగ్జామినేషను బలం అనుకోవాలో అర్థం కావడంలేదు సోనీకి.

"ఓకే బై' చెప్పి వెళ్లిపోయింది దీపిక.

సోనీకి అంతా అగమ్యగోచరంగా ఉంది.

మెల్లగా ఆరా తీస్తూన్నట్టుగా అడిగింది సోనీ "ఇంతకీ ఎవరా పిల్ల?"

"పేరు దీప. హృషీగారికి బాగా కావల్సిన పిల్ల అట! ఆయనే చెప్పారు. ఎంత కావాల్సి వుండే పిల్ల కాకుంటే నాకు సైతం తెలీకుండా అపాయింట్ చేసి వుంటారంటావ్! ఏదైతేనేం లే! భలే చలాకీ అండ్ ఇంటలిజెంట్ గాళ్!" చాలా మామూలుగా యాధాలాపంగా చెప్తూన్న తరుణ్ మొహంలోని తెలియనితనమే ఎక్కువగా ద్యోతకమవుతూంటే అతడి అమాయకత్వానికి చిన్నగా నవ్వుకుంది సోనీ.

"అన్నట్టు ఆమె ఫారిన్‌లో చదివిందట! గత ఐదేళ్లుగా ఆమె ఇండియాలోనే లేదట! అలాగని ఎక్కడా వెస్టర్న్ కల్చర్ వంటబట్ట లేదనుకో! ప్యూర్ ట్రెడిషనల్ ఎమోషన్సూ ఫీలింగ్సూ వున్న పిల్ల'' మళ్లీ తరుణే అనడంతో అతడికి ఖచ్చితంగా ఆమె గురించిన వాస్తవాన్ని దాచిపెట్టి ఆడుకుంటున్నారని అర్థమైందామెకు.

నిజానికి తనకూ అటెండర్‌కీ కారు డ్రయివర్‌కీ ఒకరిద్దరు పాత స్టాఫ్‌కీ మాత్రమే ఆమె దీపిక అనీ, హృషీకేశ్‌గారి అమ్మాయి అనీ తెలుసు! మరి పెద్ద పదవి ఇచ్చి తరుణ్‌కి ఆమె వివరాలు చెప్పలేదంటే ఏదో కిటుకుందన్న మాటే! ఆ అభిప్రాయం బలపడ్డాక తరుణ్‌తో తాను మళ్లీ ఎప్పటిలా మామూలుగా వుండడానికే ప్రయత్నించసాగింది సోనీ.

సరిగ్గా ! సోనీని హెచ్చరించినట్టుగానే అటెండర్‌నీ కారు డ్రయివర్‌నీ ఆమె ఎవరో తెలిసిన ఆ ఒకరిద్దరు స్టాఫ్‌నీ కూడా హెచ్చరించింది దీపిక. ఎట్టి పరిస్థితుల్లోనూ తానెవరో చెప్పకూడదనీ చెప్పడం జరిగితే ఉద్యోగాలు ఊడతాయనీ.

తెలియడం అంటూ జరిగితే వీరి ద్వారానే జరుగుతుంది కనుక ఎవరిద్వారా తెల్సిందీ గుర్తించడం ఈజీయేనని ఆమె ఉద్దేశం.

★ ★ ★

ట్యుటోరియల్ కాలేజీ...

రెండు సెక్షన్లలోంచీ విద్యార్థులు వెళ్లిపోయారు.

సాయంత్రం ఆరున్నర అవుతోంది.

మరో రెండు బ్యాచ్‌ల స్టూడెంట్లు వచ్చారు.

గోడ గడియారం చకచకా కదుల్తోంది.

దాదాపు రాత్రి తొమ్మిదవుతుండగా ఆఖరి బ్యాచ్ కూడా వెళ్లిపోయింది.

షట్టర్ కిందకి లాగేసి, లైఫ్ సెక్షన్లో డబ్బులు లెక్కపెట్టుకుంటూ వున్న రాంపండు దగ్గరికొచ్చాడు చరణ్.

తలెత్తకుండానే "ఏమిటోయ్! మనీఏమైనా కావాలా?" అడిగాడు రాంపండు.

"థాంక్స్! అవసరంలేదు'' అంటూండగానే సర్రున ఆ సెక్షన్ మెట్లని రాసుకుంటున్నంత దగ్గరగా, రాష్‌గా ఓ కారు వచ్చి ఆగింది.

లోపల్నుంచి గవరయ్య దిగి, అయ్యగారి కోసం బ్యాక్‌డోర్ తెరిచి పట్టుకు నుంచున్నాడు.

బ్యాక్‌సీట్‌లోంచి సేఠ్ విక్రమ్‌చంద్, ఖరీదైన సెంటువాసనలూ అంతకుమించి ఖరీదైన బట్టల తళతళలూ కమ్ముకుంటూండగా దిగి, చుట్టూ చూశాడు.

జన సంచారం పల్చబడింది.

వెళ్తూన్న ఒకటి రెండు వాహనాలు, వాటి తొందరలో అవి వున్నాయి.

లోపలికొస్తున్న సేఠ్‌ని చూసి, డబ్బులు సొరుగులో పడేస్తూ, "రండి సార్! రండి'' అంటూ కుర్చీ ఆఫర్ చేశాడు రాంపండు.

మళ్లీ తనే "అమ్మాయిగారు బాగానే చదువుతున్నారండి! నో ప్రాబ్లెం! ఈసారి గ్రాండ్ సక్సెస్!" అంటూ తెగ హైరానా పడిపోతూ, చరణ్ వైపు తిరిగి "ఏం వోయ్ చరణ్! అంతేకదా!" సమర్థించమన్నట్టుగా చూశాడు రాంపండు.

సేఠ్ "సక్సెస్.. ష్యూర్ దేంట్లో? లవ్

లెసన్స్ ప్రాక్టీస్ చేయించడంలోనా?" ఉరిమి నట్టు అనేసరికి...

"అమ్మమ్మమ్మ! ఎంతమాట! మా చరణ్ అలాంటిలాంటి మనిషి కాదండీ! నిప్పు!" తానే అతన్ని సమర్థిస్తూ అన్నాడు రాంపండు.

"నిప్పు... నిప్పుట! చెప్పవయ్యా చెప్పు! పల్లవి నీ వెంటపడడంలో నీ పాత్రయేమీ లేదా?" గద్దించినట్టు అడిగాడు విక్రమ్‌చంద్.

"సారీ సర్! నాకు నా లెసన్స్, నా పోర్షన్స్ తప్ప వేరే ఏ పాత్రలూ గుర్తుండవు'' చరణ్ నెమ్మదిగా అన్నాడు.

"అవును సేఠ్‌జీ! ఆయన సిన్సియర్! మీరే స్టూడెంట్‌నడిగినా ఇదేమాట చెప్తారు. తన పనేమిటో తన లోకమేమిటో... అంతే తప్ప లవ్వూ, నవ్వూ కూడా ఎరగని మనిషి'' స్పష్టంగా చెప్పాడు రాంపండు.

"అయితే కావచ్చు. పల్లవి, ఈ కుర్రట్యూటర్‌ని లైక్ చెయ్యడంలో అదే మెయిన్. అంచేత..."

"అంచేత ఇప్పుడీయన్ని తన పనేమిటో తానేమిటో అన్నట్టుండక, డ్యూయెట్లూ, ఎగిరి గంతెయ్యడాలూ బిగిన్ చెయ్యమంటారా?" వ్యంగ్యంగా అడిగాడు రాంపండు.

"నో... అదే వద్దంటున్నాను. వెంటపడుతూన్నదీ, వేధిస్తూన్నదీ మా అమ్మాయే కనుక"

ఈసారి విక్రమ్‌చంద్ మాటల్ని తాను అందుకుంటూ అన్నాడు చరణ్ "మీ అమ్మాయే కనుక ఎన్నోసార్లు నేను లాలనగా చెప్పిచూశాను. నీకిలాంటి హుషారు తగదమ్మా అని. అదుగో మీ డ్రయివర్ గవరయ్యని అడగండి కావాలంటే''

చరణ్ ముఖంలోని నైర్మల్య భావానికి నిజంగానే చలించిపోయిన విక్రమ్‌చంద్ "రైట్! తప్పు మా పల్లవిదే! అందుకే ఈ ప్రాంతాన్ని వదిలేసి, దూరంగా ఎక్కడికైనా వెళ్లిపో! నీకు కావల్సినంత డబ్బిస్తాను'' అంటూ డ్రయివర్‌ని కేకేశాడు. విక్రమ్‌చంద్ ముందు క్షణాల్లో బరువైన సూట్‌కేస్‌తో నిలబడ్డాడు గవరయ్య.

స్టయిలిష్‌గా దాన్ని తెరుస్తూ, అందులోంచి నోట్లకట్టల్ని బయటికి సర్రున లాగి చరణ్‌కి ఆఫర్ చేస్తూ, "చూడు మిష్టర్ ట్యూటర్! నీక్కావలసినంత డబ్బు! నువ్వు పదేళ్లపాటు ట్యూషన్స్ చెప్పినా, సంపాదించలేనంత సొమ్ము. చెప్పు! ఎంత కావాలంటే అంతా తీసుకో! బట్ వన్‌థింగ్ మళ్ళీ మా పల్లవి కంటపడ్డానికి వీల్లేదు. దటీజ్ ద ఓన్లీ కండిషన్' ఆవేశంగా, అక్కడే ఉన్న టేబుల్ మీద నోట్లకట్టల్ని ఒకటొకటిగా పడేస్తూ అన్నాడు విక్రమ్‌చంద్.

"ఎక్స్‌క్యూజ్మీ సర్! నేనలాంటి మనిషి కానని, మీకు ఇప్పుడే చెప్పాను. మీ అమ్మాయి మీదగానీ, మీ డబ్బుమీదగానీ, నాకేం మోజులేదు. నేను నా చిన్నతనంలోనే మరణశయ్య మీదున్న నా మదర్‌కి ప్రామిస్ చేశాను. మీ డబ్బున్నవాళ్ల సంపర్కానికేనా డూ వెంపర్లాడనని'' స్థిరంగా చెప్పాడు చరణ్.

"అయినా, మీరు మీ అమ్మాయిని కంట్రోల్ చేసుకొనే పద్ధతులు ఆలోచించాలిగానీ సార్... ఇలా విద్య నేర్పే గురువులనే బెదిరింపులూ, దేబెరింపూలూ చెయ్యబోవడం ఎవరూ హర్షించరు'' రాంపండు వత్తాసు పలుకుతూ అన్నాడు.

దేనికీ లొంగని చరణ్‌ని, తమ పల్లవి మనసులోంచి తప్పించే మార్గం తోచక, ఆ కసితో "నాకేం నీతులు చెప్పక్కర్లేదు. కంట్రోల్ చేయదగినంత చిన్నవయసు కాదు గనకనే ఈ సైడ్‌నుంచి ప్రొసీడ్ అవుదామని వచ్చా! ఇక్కడ మీరే నాకు సలహాలు చెప్పడం షిట్! చూస్తా'' విసవిసా ఆ నోట్లకట్టల్ని మళ్లీ సూట్‌కేస్‌లో పడేసి, ధడాల్న




మూసేసి వెనుదిరిగాడు సేఠ్ విక్రంచంద్.

★ ★ ★

వారంరోజుల తర్వాత...

తరుణ్ ఫ్యాక్టరీలో రౌండ్స్ కెళ్తూంటే, దిగాలుగా, నీరసంగా ముఖం పెట్టుకువచ్చాడు డిటెక్టివ్ గేమ్స్‌బాండ్.

"నువ్వు చెప్పిన టైపు అమ్మాయిని ఎక్కడా కనుక్కోలేకపోయాను సారీరా!"

"ఆ ఫేసే చెప్తోందా సంగతి! మళ్లీ సారీ లెందుకూ! అసలు నీలాంటివాడు ఈ ప్రొఫెషన్‌కి పనికి రాడురా..."

"సర్లే! ఆ మాటకొస్తే ఏ ప్రొఫెషనూ నాకు పనికిరాదు. అంటే చాతకాదన్నమాట"

"అలా ఒప్పుకో బడుద్దాయ్! బట్ నేనే తెలుసుకున్నాను'' ఆనందంగా చెప్పాడు తరుణ్.

"హీరోవనిపించుకున్నావ్' మెరిసే కళ్లతో చూశాడు గేమ్స్‌బాండ్.

"అనిపించుకోడమేంట్రా! నేనే హీరోని''

"సర్లేవోయ్! ఎప్పుడూ? ఎక్కడా? ఏ సందర్భంలో పట్టేశావ్?"

"ఆమె దొరికింది మా ఆఫీసులోనే!"

"ఆఁ!" నోరు తెరుచుకుని ఉండిపోయేడు.

"అవున్రా ఓనర్‌గారి తాజా అపాయింట్‌మెంట్! బట్ మోస్ట్ ఇర్రెగ్యులర్'

"ఇంత పెద్ద పదవిలో వున్నావు. ఆమాత్రం చర్య తీసుకోలేవా?"

"తీసుకోలేను''

"అవున్లే! పాపం లవర్‌కదా''

"అదేంకాదు! ఆవిడదీ నాతో సరిసమానమైన కేటగిరీయే''

"అదెలా? ఒక వొరలో రెండు కత్తులా ఇంపాసిబుల్'

"ఇక్కడ పాసిబిలిటీ కాదు చూడవలసింది''

"మరి!?"

"ఆమె ఎప్పుడొచ్చేదీ- ఎప్పుడు పోయేదీ తెలీడంలేదు. అది నువ్వు తెల్సుకోవాలి''

"ఇప్పుడే కదరా నేను ఈ ప్రొఫెషన్‌కి పనికిరానని తేల్చి చెప్పేవు!"

"అయినా, నా కోసం తెల్సుకోవాల్సిందే''

"ఏదీ ఓసారి చూపించు ఆవిడ్ని! ఎప్పుడెక్కడ ఎలా మూవ్ అవుతున్నదీ ఇట్టే పట్టేస్కుంటాను''

"డబ్బాలు చాల్లేగానీ, అదుగో! ఆ డిపార్ట్‌మెంట్‌లో చూడు. ఫైళ్లు తనిఖీ చేస్తున్న ఆవిడే దీప" చూపించాడు తరుణ్.

నిదానించి చూస్తూ, "ఓహో! ఈవిడ్నిచూస్తూనే కదూ...ఆరోజు ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర నన్ను నిర్దాక్షిణ్యంగా నడిరోడ్డుమీద వదిలేసి నువ్వు వెళ్ళిపోయిందీ'' గేమ్స్‌బాండ్ అన్నాడు.

"ఆ చూపులేంట్రా ఒరేయ్! కోపంకొద్దీ తినేసేలా వున్నావ్. ఇటు తిరుగు. చూశావ్‌గా. ఇప్పుడు నువ్వు డిటెక్షన్ టేకప్ చెయ్యాలన్నమాట.

"ఆగాగు! ఆమె పేరేమిటన్నావ్?" అడిగాడు గేమ్స్‌బాండ్.

"దీప"

"నో!" అని కాస్త పాజ్ ఇచ్చి.

"దీపిక" అన్నాడు గేమ్స్‌బాండ్.

"కాదురా తండ్రీ దీప"

"నో! ఎవరు చెప్పారు నీకు?"

"సాక్షాత్తూ మా బాస్ హృషీకేశ్‌గారే!"

"కావచ్చు! కానీ, ఆవిడ దీపికేనని నా నమ్మకం?"

"ఏమిటి ఆధారం?"

"ఆవిడని ఫాలో అయ్యావ్! ఆమాత్రం కారు బ్యాక్ స్క్రీన్‌మీద లెటర్స్ చూడలేదా?"

"చూడలేదు''

"నేను మాత్రం స్పష్టంగా చూశాను. దీపిక అని వుందా కారుమీద"

"ష్యూర్?" అడిగాడు కిరణ్ అనుమానంగా.

"ముమ్మాటికీ ష్యూర్. అంతేకాదు. ఈవిడకీ, ఈ ఇండస్ట్రీస్‌కీ ఏదో లింక్ ఖచ్చితంగా వుందని, నా డిటెక్టివ్ బ్రెయిన్ హెచ్చరిస్తోంది. డెఫినిట్‌గా బాస్‌కీ, ఈమెకీ ఏదో అనుబంధం వుండివుంటుందని నా నమ్మకం"

"ఎలా చెప్పగలవ్?"

"దీపికా ఇండస్ట్రీస్, సంస్థ పేరూ, నేను కారు స్క్రీన్‌మీద చూసిన దీపికా అనే అక్షరాలూ, దీప అని నువ్వు చెప్తున్న ఆమె పేరూ బేరీజ్‌వేసి చూస్తే నాకే కాదూ నీక్కూడా డౌట్ రావాలీ పాటికి''

"వెల్! నిన్ను ఇప్పుడు నిజంగా అభినందిస్తున్నా. బట్... రుజువుల్తోసహా రెడ్ హాండెడ్‌గా కనిపెట్టి ప్రూవ్ చేశావనుకో! నీది సూపర్‌బ్రెయిన్ అని ఒప్పుకుని తీరుతా!"

"ఇక చూస్కో! ఈ బాండ్ తడాఖా'' రయ్యిన వెళ్లిపోయాడతడు.



సేఠ్ విక్రంచంద్ కళ్లు నిప్పుకణికల్లా ఎర్రగా మెరుస్తున్నాయ్. చేతిలో వున్న విస్కీ గ్లాసు, ముఖానికి క్లోజప్‌లోకి రాగానే, అతడి ముఖం మరీ భీకరంగా కన్పించసాగింది- పక్కనే వినయంగా చేతులు కట్టుకు నిల్చున్న గవరయ్యకి.

"అయితే- మళ్ళీ ఆ కుర్రట్యూటర్‌గాడూ- అమ్మాయీ కలుసుకుంటూనే వున్నారంటావ్!"

తలూపాడు డ్రయివర్ గవరయ్య.

"నువ్వు నిఘా వేసిన సంగతి..."

"అస్సలు తెలీదండి. కారు అమ్మాయిగారే డ్రయివ్ చేసుకుంటూ వెళ్లేరండి''

"నువ్వేం చేస్తున్నావ్ అప్పుడు?"

"కారు వాష్ చేస్తున్నానండి! ఇంతలోనే అమ్మాయిగారు సడన్‌గా కార్లో కూర్చుని, రివ్వున లాక్కెళ్లిపోయేరండి!"

"ఊc... తర్వాత..."

"నేను ఆటో తీసుకుని వెంబడించేనండి. కారు గుడి దగ్గర ఆగిందండి. నేను ఆ టర్నింగ్‌లో ఆగేనండి''

"గుడి దగ్గర కల్సుకోమని అతడికి, అమ్మాయి ఎప్పుడైనా చెప్పిందా?"

"లేదండి! అతడు ప్రతి శనివారం తప్పకుండా ఆ టయింలో గుడిలో దొరుకుతాడండి''

"ఐ.సీ. తర్వాత" మరో పెగ్ సిప్‌చేస్తూ అడిగాడు విక్రమ్‌చంద్.

"మంటపం దగ్గర, కొబ్బరి ప్రసాదం తింటూకూర్చున్న ఆ అబ్బాయ్‌ని గబుక్కున వెనకనుంచి అమ్మాయిగారు వాటేసుకున్నారండి''

పెగ్ విసిరికొట్టాడు విక్రమ్‌చంద్.

"పాపం! అతగాడిదేం తప్పు లేదండి! అమ్మాయిగారే..."

"ఊc!" గర్జించాడు విక్రంచంద్.

"అతగాడ్ని మీరు డబ్బుతో వెళ్లిపొమ్మని బెదిరించిన సంగతి చెప్పేడండి. దాంతో మరింత రెచ్చిపోయి అమ్మాయిగారు "నేనంటే నీ కిష్టమేనా?" అంటూ గుచ్చి గుచ్చి ఆ బాబుగార్ని అడిగేరండి. "మీ స్థాయికి నేను తూగననీ, తల్లికి మాటిచ్చాననీ ఎంతో సేపు చెప్పాడండి ఆ బాబు. ఇద్దరి మధ్యా ఏం వాదాలే నడిచాయోగాని, చివరికి గుళ్లోనే పెళ్లి చేసుకోడానికి ఆయన్ని అమ్మాయిగారు ఒప్పించినట్టు అవుపడిందండి!"

"అంతేనా!"

"అంతేనా అని అడుగుతారేటండీ! అమ్మాయిగారు ఎంటనే ఆ ఏర్పాట్లకోసం రెడీ అయిపోతూంటే, నేనిటు పరుగెత్తుకొచ్చేనండి!"

"ఇప్పుడు రెడీ అవాల్సింది వాళ్లు కాదు! మనం ఆ ట్యూటర్‌గాడి చాప్టర్ క్లోజ్ చెయ్యడానికి..."

ఎరుపు నిండిన కళ్లతో లేస్తూ అన్నాడు విక్రమ్‌చంద్.

★ ★ ★

ఫ్యాక్టరీలోని ప్రతి ప్లాంట్‌ని చెక్ చేస్తూ, తగిన సూచనలిస్తున్న దీపికని తరుణ్, అనుక్షణం వెన్నంటి వాచ్ చేస్తున్నాడు. ఆమె ఏ క్షణంలో బైటకు జారుకుంటుందో, ఏ కారెక్కి తుర్రుమంటుందోనని.

తరుణ్ తనను గమనిస్తున్నాడన్న సంగతి దీపిక గుర్తించేసింది. అందుకే, అందీ అందకుండా వేరే ప్లాంట్‌లోంచి ఇట్టే చిటికెలో బైటికొచ్చి, ఎప్పుడూ తానెక్కే కారు కాకుండా, బ్లూకలర్ ఫియట్‌లోకి మారింది.

కొద్ది సెకెన్ల తేడాతో ఆమెని ఫాలో అవుతూన్న తరుణ్ కూడా రివ్వున బైటికొచ్చి తన బులెట్ స్టార్ట్ చేశాడు.

కాని, అప్పటికే దీపిక ఎక్కిన ఫియట్ గేట్లోంచి బైటికి దూసుకుపోయింది.

బ్యాక్ స్క్రీన్‌మీద దీపిక అనే అక్షరాల




కోసం వెతుక్కుంటూ ఫాలో అవుతూన్నాడు తరుణ్. స్క్రీన్ బ్లాంక్‌గా వుంది.

ఫియట్ చాలా ఫాస్ట్‌గా పోతోంది.

తరుణ్ అనుసరిస్తూనే వున్నాడు.

ఇంతలో అడ్డంగా ఓ స్పోర్ట్స్ సైకిల్‌మీద పంజాబీవాలా ఒకడు రావడంతో సడన్‌గా బ్రేక్ కొట్టడమూ అప్పటికే తన బులెట్ ఇచ్చిన డాష్‌కి సైకిల్ వంకరపోవడమూ పంజాబీవాలా శిఖముడి వూడిపోవడమూ ఒక్కసారే జరిగాయి.

సైకిల్‌కి డాష్ కొట్టగానే ఒక్క ఎగురు ఎగిరి, అవతలకు దూకిన పంజాబీవాలాని తిట్టడానికి దగ్గరగా వచ్చిచూశాడు తరుణ్. తీరా చూస్తే అతడావేషంలో వున్న గేమ్స్ బాండ్.

"ఈ వేషమేమిట్రా బాబూ?"

"నీ కోసమేరా తండ్రీ ఆ అమ్మాయి ఈ రూట్లోనే ఖచ్చితంగా వస్తుంది కదా''

"వచ్చిందికదా!" అదే యాస రిపీట్‌చేస్తూ తరుణ్.

"ఏదీ? అక్కడ గ్రీన్ కలర్ మారుతీ, దీపికది కదా!"

"ట్రిక్కులు చెయ్యడం మనకే కాదు. ఆవిడక్కూడా చేతనవును''

"అంతే..."

"మైడియర్ నిద్దరబ్రాండూ... ఇప్పుడు దూసుకుపోయిన ఫియట్‌లో వున్నది ఆమే!"

"అదీ సంగతి అందుకేనా తమరీ వేళగాని వేళ ఆఫీసులోంచి బైటకొచ్చిందీ'' మేకప్ వూడలాక్కుంటూ అన్నాడు బాండ్.

"నిక్షేపంలాంటి ఛాన్స్ మిస్ చేసేవు. ఇవాళ అమీ తుమీ తేల్చేసుకోవాలనుకున్నాను. ఏం లాభం? ఈపాటికి ఆమె ఆరు కిలోమీటర్లు పారిపోయుంటుంది'' దిగులుగా అన్నాడు తరుణ్.

"పొద్దుట్నించీ నీపనిమీద వున్నానా! మిత్రద్రోహీ! కృతఘ్నుడా! నీకోసం ఇంత కష్టపడుతున్న నాకే అక్షింతలా?" అని కాస్త ఆగి "చూడ్రా సైకిల్ ఎలా వంకరపోయిందో?" అంటూ దిగులుగా చూశాడు గేమ్స్‌బాండ్.

"సంతోషించాంలే తెలివి తేటలకి. ఇంకా నయం ఎడ్లబండీమీద ఫాలో అయ్యావు కాదు. త్వరగా తెల్సుకోనేవాడివి'' అంటూ ఓ మొట్టికాయ వేశాడు తరుణ్.

"ఏం నాయనా సైకిల్‌మీదయితే, నన్నొక్కడ్నే చంపేవాడివి. ఎడ్లబండి అయితే మరో రెండు జీవాల్ని నిర్దాక్షిణ్యంగా డాష్ కొట్టేద్దువు. ఓరి దేవుడో బతికుంటే బలుసాకు తినొచ్చన్నారు. అవునూ పొద్దుట్నుంచి పొట్టలో ఏం పడినట్టు లేదు. తిండి అంటే గుర్తొచ్చింది. అర్జెంటుగా పుడ్డు స్పాన్సర్ చెయ్యి గురువా?" తానే బులెట్ వెనక ముందే సెటిలయిపోతూ అన్నాడు గేమ్స్ బాండ్.

"పద నాదీ ఉదయంనుంచీ నిరాహార దీక్ష" స్టార్ట్ చేస్తూ అన్నాడు తరుణ్.

"ఆకలుండదు, దాహముండదు. ఆవిడ్ని చూస్తుంటే'' పాటని సన్నగా హమ్ చేయసాగాడు బాండ్.

★ ★ ★

సిటీలో ఉన్న అతికొద్ది ది బెస్ట్ హొటల్స్‌లో అదొకటి. సాధారణంగా హై సొసైటీ పీపుల్, వున్న ఆ కొద్ది హొటల్స్‌లోనూ దీనికే ఎక్కువ ప్రిఫరెన్స్ ఇస్తారు. పేరులోనే కాదు. మెయింటెనెన్స్‌లోనూ ది బెస్ట్ హొటల్‌గా పేరు ఉంది.

రెస్టారెంట్ సెక్షన్లో తరుణ్, గేమ్స్‌బాండ్‌తో రకరకాల ఐటమ్స్‌మీద పడి ఫుడ్ ఎంజాయ్ చేస్తూండగా, అతడే చరణ్ అనుకుని పొరబడి సేఠ్ విక్రంచంద్ తన నలుగురు గూండా అనుచరగణంతోనూ చరచరా ఆ సెక్షన్‌లోకి అడుగుపెట్టాడు.

తన వెంట వున్న గూండా గ్యాంగ్‌కి

తరుణ్‌ని చూపించి కనుసైగలతోనే అతనిని జాగ్రత్తగా చూడమని ఆర్డర్ వేశాడు. నలుగురూ పరీక్షగా చూశారు.

తరుణ్ గేమ్స్‌బాండ్‌లు తమ ధోరణిలో తాామున్నారు.

ఒక్కొక్కరూ జాగ్రత్తగా, ఆ ముఖకవళికల్ని గుర్తు పెట్టుకున్నాక, ఆ సెక్షన్‌కి ఆనుకుని వున్న అటాచ్డ్ బార్‌లోకి వెళ్తూ అతడి పక్క నుంచే ఆ నలుగురూ సేఠ్ విక్రమ్‌చంద్ వెంట నడిచారు.

బార్‌లో కూర్చున్నాక, కావాల్సిన సరంజామా ఆర్డరిచ్చి "చూశారుగా వాడే ఆ ట్యూటర్‌గాడ్నే నా కూతురు వలచింది. వాడ్ని చూడందే ఆ పిల్లకు నిద్రపట్టదు. వాడ్ని చూస్తుంటే నాకు నిద్రపట్టదు. అంచేత... తెల్సుగా. వాడ్ని అడ్డంగా'' అరచేత్తో చంపెయ్యమన్నట్టుగా అభినయించి, "పని ఫినిష్ చేసి మీ అమవుంట్ పట్టుకుపోండి ఓ వారం తర్వాత వాడు నాకెక్కడా కనబడ్డానికి వీల్లేదు. ఓ.కే' తలూపారు నలుగురూ.

★ ★ ★

పాతకాలంనాటి బెల్టు బిగించిన పంచెకట్టు, లూజు కల్లీలాల్చీ, నుదుట విబూధి, కొంచెం పెద్ద సైజు బొట్టూ, చంకన ఓ భారీ బైండు పుస్తకంతో, పాన్ నములుతూ వస్తోన్న ఓ యాభయ్యేళ్ల ముసలాయన పక్కన నవ్వుతూ నడిచొస్తోంది దీపిక. ఆమె కూడా అదే హెూటల్లోకి అడుగుపెట్టింది.

అప్రయత్నంగా మోచేత్తో పొడిచాడు గేమ్స్‌బాండ్.

తింటున్నది ఆపేసి, నోర్లు వెళ్లబెట్టి గుడ్లప్పగించి, దీపికనే చూస్తుండిపోయాడు తరుణ్.

అతడ్ని ఏమాత్రం గమనించకుండా, తన ధోరణిలో తానున్నట్టు మరో మూల టేబిల్ వైపు నడిచింది దీపిక.





"అదీగాక... అమ్మా ఈ డాక్టర్ దత్తాత్రేయా... ఆల్‌టైమ్ బెస్ట్ ఇన్ ఆయుర్వేదా... చెప్పేదేంటంటే- ఏ చిన్న రోగాన్ని ఉపేక్షించకూడదూ అని...అన్నమాట. అసలూ ఈ ఆయుర్వేదం ఉంది చూశావూ''

తన ధోరణిలో తాను చెప్పుకుపోతూన్న దత్తాత్రేయ మాటల్ని పట్టించుకోకుండా, సన్నగా "ఇక్కడ కూర్చుందాం" అంది దీపిక.

ఇద్దరూ కూర్చున్నారు.

మళ్లీ తన నస ప్రారంభించాడు దత్తాత్రేయ. "మీ అమెరికా చదువుల్లో బొత్తిగా సారం లేదమ్మాయ్. ఏమాత్రం కొత్త లక్షణాలు కనిపించినా కాన్సరో, ఎయిడ్సో, నా బొందో, బూడిదో ఏదో కొత్త పేరు పెడతారు. దానికి మళ్లీ మందు కనుక్కోడం కూడా చాతకాదు. అసలీ ఎయిడ్సూ గట్రా మన రోగవిద్య ప్రకరణంలో ఎప్పుడో చెప్పారు. వాత, పిత్త, శ్లేష్మ, కఫ, ఇంద్రియ, పైత్య ప్రకోపాలవల్ల ఏవో ఇలాంటి రోగాలొస్తాయనీ, వీటికి చికిత్స లేకపోలేదనీ, మన ఆయుర్వేద గ్రంథాల్లో కల్వంపెట్టి మరీ నూరి రాశారమ్మా. సపోజ్... ప్రేమలో పడడం అనేది ఉంది చూశావ్. అదీ రోగలక్షణమే''

ఉలిక్కిపడ్డాడు తరుణ్.

"ఏం తీసుకుందాం అంకుల్?" ఆ పెద్దాయన ధోరణికి అడ్డుకట్ట వేయడానికి అడిగింది దీపిక.

"ఒరేయ్ నువ్వు నిజంగా బడుద్ధాయ్ బ్రాండ్‌వే. లేకపోతే ఏం డిటెక్షన్ రానీది? ఆ పిల్లని దీపిక అన్నావు. మా బాస్‌కి చుట్టమో, పక్కమో అవుతుందన్నావు. కానేకాదు. దీపక అనే పేరు కాకతాళీయంగా కలిసింది అంతే. సలక్షణంగా ఓ ఆయుర్వేదం డాక్టర్ కూతురు ఈమె... ఒరేయ్ ఇంకోసారి ఇలాంటి రాంగ్ ప్రిడిక్షన్లు నా నెత్తిన రుద్దావంటే, ఛంపేస్తాన్రోయ్'' ఫోర్క్‌ని గుచ్చేలా అభినయిస్తూ అన్నాడు తరుణ్.

సరిగ్గా అప్పుడే...

బేరర్ ఆర్డర్ తీసుకుని వెళ్లిపోయాక, సన్నగా చేసైగతో "అంకుల్ నా కోసం మా డాడీ సెలెక్ట్ చేసిన వరుడు ఆయనే. అఫ్‌కోర్స్... నా సెలక్షన్ కూడా'' అంది దీపిక మెల్లగా, మందంగా సిగ్గుపడుతూ.

పరిశీలనగా చూసి "వెరీగుడ్ బావున్నాడమ్మా. మనిషి పుష్టిగానే, ఆరోగ్యంగానే కనిపిస్తున్నాడు. బట్టతల వచ్చే సూచన్లు కనిపిస్తున్నాయ్. ఇప్పట్నుంచే జాగ్రత్త పడడం మంచిదని నా సలహా. భృంగా మలక తైలం రోజూ రెండు పూటలా మర్దనా చేసి, లోపలికి 'అశ్వగంధారిష్ట' పుచ్చుకుంటే భేషుగ్గా వుంటుంది'' ఈ ఉచిత ప్రిస్క్రిప్షన్‌కి తల పట్టుకుంది దీపిక.

"సర్లే అంకుల్. మీ డాక్టర్లందరికీ కామన్‌గా ఉన్న జబ్బే ఇది. పరిపూర్ణ ఆరోగ్యంతో వుండే వ్యక్తుల్ని మీ ఎదుట నిలబెట్టినా, ఏదో లోటుందంటారు..."

"అమ్మమ్మమ్మ! అలా అనకమ్మాయ్! వేదకాలంలోనే లేరు పరిపూర్ణారోగ్యవంతులు. అందుకేగా దేవవైద్యుడు ధన్వంతరి మనకీ ఆయుర్వేదాన్ని ప్రసాదించిందీ!" పుస్తకం టేబుల్‌మీద పెడుతూ అన్నాడు దత్తాత్రేయ.

"నే చెప్పలా? అతడు ఖచ్చితంగా ఆమె ఫాదరే!" తరుణ్ తినడం ఆపేసి మరీ గేమ్స్‌బాండ్ ముఖంలోకి చూడ్డంతో "అబ్బ! తినరా తండ్రీ! ఎట్‌లీస్ట్ నా డిటెక్షన్ రైటేనని ప్రూవ్ చేసుకోడానికైనాసరే! నేనావిడ వెంట పడతాను... ఐమీన్... ఫాలో అవుతానన్న మాట!" తానుమాత్రం ఆదరాబాదరాగా తింటూ అన్నాడు గేమ్స్‌బాండ్.

"నువ్వన్నదే రైటైతే... ఎంత బావుణ్ణు! కలా? కల్లా? ఏది సత్యం? ఏదసత్యం?" అంటూ ఏదేదో గొణుక్కుంటూన్న తరుణ్‌ని "ఇంతచక్కని ప్రేయసి సమక్షంలో ఇంకా ఆ సణుగుళ్లేంట్రా?" అంటూ చిరాకుపడ్డాడు బాండ్.

"అయితే ఓ డ్రీమ్‌సాంగ్‌కి పొసీడైపోమంటావా?"

"నీదే లేటు''

ఊహా విహారాల్లోంచి ఇహలోకంలోకి ఊడిపడేసరికి ఆ టేబుల్ దగ్గర ఎవరూ లేరు. పక్కన ఉండాల్సిన గేమ్స్‌బాండూ లేడు.



ఎత్తయిన ప్రదేశంలో, కొండరాళ్ల సహజత్వాన్ని ఏమాత్రం చెడగొట్టకుండా, వాటిని కూడా ఇంటి ప్లాన్‌లో ఇంక్లూడ్ చేసి మలచిన అందమైన బంగళా టెర్రెస్‌పైన...

నగర దీపాల తోరణాల శోభని ఎంజాయ్ చేస్తూన్నప్పుడు మిత్రుడు దత్తాత్రేయని అడిగాడు హృషీకేశ్, "ఏరా! ఎలా ఉన్నాడు కాబోయే అల్లుడు?"

"బెస్ట్ సెలెక్షన్! మీరిద్దరూ ఏకగ్రీవంగా ఎన్నికచేశాక ఇక దానికి వంకపెట్టడం కూడానా?"

"ఏడిశావు లేవోయ్! నీ బోడి ఒపీనియన్‌తో సమర్ధించి ఏడవకపోతే ఖండించొచ్చుగా!"

"ఖండన... ఛేదన... ఐమీన్ ఆపరేషన్?! ఎంతో తప్పనిసరైతే తప్ప తెగ్గోయడం ఆయుర్వేదం ఇంటా, ఒంటా లేదు తెల్సా?"

"బాగానే ముడిపెట్టావ్''

"ఈ ముడిసరే! ఆ మూడుముళ్లూ ఎప్పుడు?"

"అమ్మాయి ఓ.కే. అన్నప్పుడు''

అప్పుడే అక్కడికి వచ్చిన దీపికని "ఎప్పుడంటావమ్మా?" అని అడిగాడు డాక్టర్ దత్తాత్రేయ.

"అప్పుడేనా? ఇంకా బోల్డు టైముంది. నచ్చాడనుకో! అయినా ఇంకాస్త స్టడీ చెయ్యొద్దూ?" కొంటెగా అంది దీపిక.

"అంతదాకా నేనుండొద్దూ?"

"మరీ అంత ఎక్కువ టైం తీసుకోంలే అంకుల్! సో... పిడిరాయిలా నిక్షేపంలా ఉంటావ్!"

"అవున్రా! అసలే ఆయుర్వేదం డాక్టరువాయె! కాయకల్ప చికిత్సా గట్రా చేసుకుని సలక్షణంగా ఉంటావు! సరా!?"

"పన్లోపని! నీక్కూడా ఏ 'వసంతకుసుమాకరమో' పుటం పెట్టించమంటావా?"

"నాకెందుకురా? నా 'మందు' నాకుండనే ఉందిగా!" నైట్‌కోట్ జేబులోంచి విస్కీ సీసా తీయడంతో దీపిక "గుడ్‌నైట్' అంటూ అక్కణ్నుంచి కిందికి దిగిపోయింది మెట్లమీదుగా.

★ ★ ★

తరుణ్‌ని ఫాలో అవుతోంది గూండా గ్యాంగ్ కారు. అప్పటికి రెండ్రోజులుగా తరుణ్ బుల్లెట్‌ని చాలా నేరోగా మిస్ అయి, అటాక్ చెయ్యలేకపోయామన్న కసితో ఆరోజు ఎలాగైనా అతన్ని ట్రాప్ చేసి ఫినిష్ చేసేయాలన్న దీక్షతో వెంటాడుతున్నారు వాళ్లు.

★ ★ ★

"ఇది ఇంటర్వెల్ పాయింట్ సార్! ప్రేక్షకులు 'తర్వాతేం జరుగుతుంద'న్న టెన్షన్‌తో హాల్లోంచి కాసేపు బైటికొచ్చి చర్చించుకోడానికి ఛాన్సిచ్చే సీన్' తానే అంది నమీచి.

"ఇందులో పెద్ద చర్చించుకోడానికేం ఉంది? అన్ని సినిమాల్లోలాగానే ఒకరికి బదులుగా మరొకర్ని సఫా చేసే ప్రయత్నం చెయ్యడం మామూలుగా ఉండేదే!" డీవన్కే అన్నాడు.

"కావచ్చు! కాని నా స్టోరీలోనూ అలాగే జరిగినా, వెంటవెంటనే మలుపులుంటాయి. అంచేత సీన్లు మాంచి గ్రిప్‌తోనూ, క్రిస్ప్‌గానూ వస్తాయ్!" డిఫెన్స్ నమీచిది.

"ఈ ఇంటర్వెల్ టైమ్‌కైనా లైట్లు వెలిగితే బాగుండును'' అని దస్తగిరి స్వగతంగా అనుకోవడం, కరెంట్ రావడం ఒక్కసారే జరిగాయి.

ఆ విద్యుద్దీపాల వెలుగులో తమకు ఇంతసేపూ కథ చెప్తున్న నమీచి తటిల్లతలా తళుక్కుమన్నదోసారి.

ఆ క్షణంలో వాళ్లందరికీ ఆమె ఒక బార్‌సైడ్ డాన్సరనే తేలికభావం స్థానే ఓ క్లోజ్ అసోసియేట్ తమతోపాటు స్టోరీ సిట్టింగ్‌లో కూర్చుని కథ చెప్తున్నట్టే తోచింది.

గౌరవసూచకంగా అందరూ మందు మరచి, తిండిమీదపడ్డారు.

చిప్స్ ప్యాకెట్స్ ఖాళీ అయ్యాయి క్షణాల్లో.

"అమ్మగారూ! చాలా సేపై స్టోరీ చెప్తున్నారు. గొంతు ఎండిపోయి ఉంటుంది. మా కోసం... పోనీ నాకోసం... ఈ కూల్‌డ్రింక్ కాస్త తీసుకోరూ!" ఆప్యాయంగా దస్తగిరి థమ్సప్ తెచ్చిచ్చి, అక్కడే సెటిలైపోయాడు మళ్లీ.

★ ★ ★

ఓ వారంరోజులపాటు ఏరియాలమీద విజిట్‌కెళ్లి, ఆరోజే వచ్చిన తరుణ్‌కి బాస్ అనారోగ్యంతో ఉన్నారనీ, ఆఫీస్‌కి రావడంలేదనీ చెప్పింది సోనీ. కొన్ని అత్యవసరమైన ఫైళ్లూ, పత్లూ పట్టుకుని హృషీకేశ్‌గారింటికి వచ్చాడు తరుణ్ ఆఫీసు కారులోనే.

గూండా గ్యాంగ్ ఫాలో అవుతోంది...

ఎటాక్ చెయ్యబోయేంతలో హృషీగారి





ఇల్లు సమీపించడమూ, ఆతృతతో తరుణ్ రివ్వున బంగళాలోకి వెళ్లిపోవడమూ ఒక్కసారే జరగడంతో 'తిరుగు ప్రయాణంలో అతడి సంగతి చూద్దాం!' అని చేసైగలతో ఆ నలుగురూ ఆ చుట్టుపక్కల్నే ఒక్కొక్కడో చోట తిష్టవేశారు.

హృషీగార్ని పరామర్శించి, "ఇదిసార్! డిస్ట్రిక్ట్స్ రిపోర్ట్. ఇది నార్త్‌సైడ్ కమిట్‌మెంట్స్ తాలూకు ఫైలు. ఇది ఇంటర్నేషనల్ ప్రపోజల్స్‌కి సంబంధించింది. ముఖ్యంగా ఈమధ్య వారంరోజులైనా టూర్‌లో ఏరియాలమీద తిరిగి నేను తెల్సుకున్నదేంటంటే, మన ప్రొడక్ట్స్ మార్కెట్‌లో ఇంటర్నేషనల్ స్టాండర్డ్‌తో పోటీపడుతున్నాయట! సో... మనం దిగ్విజయంగా విదేశీ గడ్డమీద పాదం మోపవచ్చన్నమాట! ఇది మన ప్లానింగ్ సెక్షన్‌కి పంపేస్తున్నా... దీనిమీద మీ సైన్ కావాలి!" ఒక్కొక్కటీ వివరిస్తూ వినయంగా నిల్చున్న తరుణ్, అడుగుల అలికిడికి తల పక్కకు తిప్పి చూశాడు.

మధుర దరహాసంతో దీపిక చాలా కాజువల్ వేర్‌లో.

"దీపా...! నువ్వు... ఇప్పుడు... ఇక్కడ..."

"సర్‌ప్రయిజింగ్‌గా ఉందికదూ! మరో చిరు సర్‌ప్రయిజ్!" అంటూనే హృషీకేశ్‌వైపు తిరిగి, "డాడీ! రియల్లీ మిస్టర్ తరుణ్ ఈజె నైస్ జంటిల్మన్ అండ్ సిన్సియర్ వర్క్ ఓరియంటెడ్ పర్సన్" అంది ప్రశంసాపూర్వకంగా.

"అం! అయితే... నువ్వు.. ఛ! ఛ!... మీరు... అంటే... దీప... నో! నో!... దీపిక..." రకరకాలుగా తడబడిపోతూవున్న కిరణ్ భుజంతట్టి "ఇక ఆయన కన్‌ఫ్యూజన్‌కి బ్రేక్‌వేసెయ్యనా అమ్మా! మైడియర్ తరుణ్! ఇదేనయ్యా నా ఏకైక తనయ దీపిక. నా కంటిదీపం. ఈ ఇంటి వెలుగు... అరిచేతుల్లో పెట్టుకు పెంచి, అమెరికాలో విద్యాబుద్ధులు చెప్పించాను. బాధ్యతగల తండ్రిగా ఎప్పటికైనా ఓ అయ్య చేతిలో పెట్టవలసిందేకదా!" గొంతు గాద్గదికం కావడంతో హృషీగారు చెమ్మగిల్లిన కళ్లతో కూతురువైపు చూశారు.

"ఇప్పుడిదంతా ఎందుకు డాడీ? అసలే మీ హెల్త్ ఇంకా సర్దుకోలేదు" అంది దీపిక మందలింపుగా.

"ఇది సర్దుకోవాలంటే నువ్వు సర్దాగా, జంటగా నా కళ్లముందు తిరుగుతున్నప్పుడే తల్లీ!" అంటూనే తరుణ్‌వైపు తిరిగి, "మై డియర్ యంగ్‌మాన్! నీకు గుర్తుందా! కొన్నాళ్లక్రితం మా అమ్మాయి గురించి నీకు చెప్పబోతే, కనీసం ఫోటో చూడ్డానికిసైతం ఒప్పుకోని నువ్వూ, నీ సిన్సియారిటీ వాచ్‌చేసి, నేను కన్‌ఫర్మ్ చేసుకుని అమ్మాయితో ప్రస్తావించాను. దీపిక కూడా నీ చలాకీతనాన్ని అప్రిషియేట్ చేసింది. అమ్మాయికి నువ్వంటే ఇష్టమే! నీ ఇష్టమే తెలియాల్సి వుంది! సూక్ష్మగ్రాహివి కనుక ఇంక వివరించను. ఈ వృద్ధుడికిక కాస్త విశ్రాంతి కల్పించి, అన్ని బాధ్యతలూ మీరిద్దరూ మీ భుజస్కంధాలమీద మొయ్యడానికి, ఏకమయ్యే కల్యాణ శుభఘడియ మీకోసం ఎదురుచూస్తోంది! ఆ వెడ్డింగ్‌బెల్స్ మోగించి ఈ ముసలాడి హృదయాన్ని ఆనంద తరంగాల్లో ముంచెత్తగలవా బాబూ!"

ఎక్కువగానూ, ఆర్ద్రతతోనూ హృషీగారు అలా మాట్లాడేసరికి తరుణ్ ముఖ కవళికలు కూడా రకరకాలుగా మారి, చివరికి "నిజం చెప్పాలంటే దీపికకంటే నేను దీపనే ఎక్కువ ప్రేమించాను సార్! ఎందుకంటే నాకు సాటి పోటీగా తెచ్చిపెట్టారుకదా! ఓ ఫోర్స్‌ఫుల్ లేడీముందు నేను డౌనైపోతానా? రెచ్చిపోయి నా వర్క్‌ని ప్రేమించడం నేర్చుకున్నాను. దాంతోపాటే ఆ వర్క్‌కి ఇన్‌స్పిరేషన్ ఇచ్చిన దీపని కూడా!" అని తరుణ్ అంటూంటే సిగ్గులమొగ్గ అయింది దీపిక.

★ ★ ★

పిట్టగోడకి జారబడ్డ జుట్టుపోలిగాడు,

గ్యాంగ్ సభ్యుల మొహాల్లోకి అసహనంగా చూస్తూ, మరోపక్క చేతివాచీవంక చూసి అంతకు రెట్టింపు విసుగు ప్రదర్శిస్తూ, "ఇంకా ఎంతసేపురా మనకీ వెయిటింగ్ బాధ?" అన్నాడు.

"కార్లోనే కూర్చుందాం గురూ!" అనుకుంటూ నలుగురూ మళ్లీ కారెక్కి కూర్చున్నారు.

ఓ ఐదు నిముషాల్లో తరుణ్ బైటికి రావడం చూసి ఆదరాబాదరాగా కారు స్టార్ట్ చేయబోయాడు గ్యాంగ్‌లీడరు.

అది ఎంతకూ స్టార్ట్ కాలేదు.

ఈలోగా తరుణ్ కారు రివ్వున వెళ్లిపోయింది వాళ్ల కళ్ల ఎదుటే.

"ఛ... మళ్లీ పోయింది బాస్ ఛాన్స్..." ఒకడన్నాడు.

"ముందు అర్జెంటుగా దీన్ని మెకానిక్ షెడ్లో తోసెయ్యండ్రా!" అంటూ ఆర్డర్ జారీ చేసి, అక్కడికి దగ్గర్లోనే ఉన్న ఓ కారు గారేజ్ ఓనర్‌తో చేసైగతో సంభాషించి, మరో కార్లో బయల్దేరాడు ముఠానాయకుడు.

పెళ్లికొడుకు గెటప్‌లో పెళ్లికోసం కుట్టించిన తెల్ల సూట్‌లో వెలిగిపోతూ, కళ్లజోడు సర్దుకుంటూ హుందాగా నడుస్తూన్న చరణ్ ఓ రోడ్‌మలుపులో తారసపడ్డాడు అతనికి.

కారు స్లోగా పోనిస్తూ చరణ్ పక్కగా రాగానే ఒక్క ఉదుట్న అతన్ని కార్లోకి లాగేసి "హమ్మ! మాయదారి టక్కుటమారీ! ఇంతలోనే గెటప్ ఛేంజ్ చేసేశావంటే... హమ్మో! అసాధ్యుడివే! అయినా, నా దగ్గరా నీ డ్రామాలు? ఎన్ని డ్రస్సులు మార్చినా నీ అడ్రస్... ఇట్టే... చిటికెలో పట్టేస్తా!" అంటూంటే బిత్తరపోయాడు చరణ్.

"నో! నేను అప్పటికీ వద్దంటూ పల్లవితో మొత్తుకుంటూనే ఉన్నా! తనే విన్లేదు..." అంటూ ఆందోళనపడసాగాడు చరణ్ తన ధోరణిలో.

ఊరవతల కొండలదగ్గర ఆగింది కారు.

"రా! బయటికి రా! నిన్నిక్కడ చంపి పాతరేస్తా! ఎవడు అడ్డం వస్తాడో చూస్తా!"

"నేను మిమ్మల్నెప్పుడూ చూళ్లేదు. మీతో నాకేం విరోధంలేదు. అయినా నన్ను చంపుతానంటున్నారంటే... నా ఖర్మ! కానివ్వండి! తాడిని తన్నేవాడుంటే, వాణ్ని తన్నేవాడూ ఉంటాట్ట! రేపెప్పుడైనా తమరు చేసిన ఈ పాపానికి, ఇలాంటి దిక్కుమాలిన చావో- ఇంతకుమించిన దౌర్భాగ్యపుచావో రావొచ్చు! అప్పుడొక్కసారి నన్ను తల్చుకోండి! చాలు! అదొక్కటే నా ఆఖరు కోరిక! ఇక మీ ఇష్టం!" అంటూ చేతులు కట్టుకు వంగి నిలబడ్డాడు చరణ్ కొండల దిగువన పారుతూన్న నదినే చూస్తూ.

అతని అమాయకత్వపు ధోరణికి క్షణంసేపు తటపటాయించాడు గ్యాంగ్‌లీడరు.

నది వరద నీటితో మహోధృతంగా ప్రవహిస్తోంది.

జాలిగా చరణ్‌వైపు చూశాడు గూండా అధినేత.

చంపబుద్ధి కాలేదు.

మళ్లీ అంతలోనే కరెన్సీ నోట్లకట్టలు కళ్ల ముందు మెదిలాయి అతడికి.

చరణ్ మెడకిరుపక్కలా ఫట్‌ఫట్ మంటూ మోచేత్తో కొట్టేసరికి అతడు స్పృహ కోల్పోయాడు.

ఏటవాలుగా ఉన్న కొండ చరియమీంచి చరణ్‌ని నదిలోకి తోసేశాడా గూండా.

దొర్లుకుంటూ, వడివడిగా నదీప్రవాహంలోకి జారిపోతూన్న చరణ్‌నే చూస్తూ, "మొసళ్లు పీక్కుతింటాయి. ఎట్‌లీస్ట్ టూ ఫుల్‌మీల్స్ ఫర్ ఎ క్రొకోడైల్' అని చేతులు దులుపుకుంటూ కారువైపు కదిలాడా గూండా లీడర్.

★ ★ ★




పెళ్ళిళ్లు స్వర్గంలో జరుగుతాయని అంటారు.

బహుశా పెళ్లి ఏర్పాట్లు... అంటే 'చూసుకోవడం' వగైరా అక్కడే జరిగిపోయి, ఈ భూమ్మీద కేవలం వివాహపు తంతు మాత్రమే జరుగుతుందనే అభిప్రాయంవల్ల కాబోయి' అలా అనివుంటారు.

ఎక్కడో కూర్చున్న విధాత స్త్రీపురుషుల మధ్య వైవాహిక బంధాన్ని నుదుటిరాతగా రాసి ఉంచుతాడనే సంగతి, ప్రేమవివాహాలు చేసుకొనేవాళ్లెవరూ మొదట్లో అంతగా పట్టించుకోకపోయినా తర్వాత్తర్వాత తమమధ్య అనురాగబంధం పటిష్టమైనపుడో లేదా అభిప్రాయభేదం పొడసూపినపుడో తప్పకుండా ఇది విధిలిఖితం అనే నమ్ముతారు.

తరుణ్, దీపికల వివాహం చూసినవాళ్లు మాత్రం తప్పకుండా ఈ పెళ్లి స్వర్గంలో అరేంజ్ అయిందేననే ఏకాభిప్రాయానికి వచ్చేశారు.

'హోటల్ హెవెన్'లో హెవీగా ఏర్పాటైన వేదికా, ఆ అలంకరణా, అద్భుతమైన విందు భోజనం, అనన్యమైన అతిథిమర్యాదా, దేన్లో చూసినా వారి కల్యాణానికి సాటిరాదగ్గ వివాహమేదీ ఇటీవలి కాలంలో తాము చూడలేదన్నవాళ్లే ఎక్కువమంది.

రంగరంగ వైభోగంగా జరిగిన ఆ పెళ్లిని తిలకించే అదృష్టానికి మాత్రం డాక్టరంకుల్ దత్తాత్రేయ నోచుకోలేకపోయాడు.

కారణం - అతడుంటున్నదో మారుమూల చిన్న లంకగ్రామం. నదికి గట్టిగా నీరొస్తే సగభాగం లంక జలమయమే! పోస్టు కాదు గదా! పావురం కాలికి కబురు కట్టి పంపించినా అందడం కష్టం!

నదికి పోటొచ్చినపుడు పోస్ట్‌మాన్ ఆ చుట్టుపక్కల ఆర్నెల్లదాకా కనబడడు. "ఏంవయ్యా మహానుభావా!" అంటే, "అమ్మో! వరదభయం సార్!" అంటాడు.

అప్పటికే డాక్టర్ దత్తాత్రేయ, ఎన్నోసార్లు చెప్పాడు "అమ్మాయ్ దీపికా! నీ పెళ్లికార్డు నాకు అందాలంటే, కనీసం ఓ నెల్లాళ్లయినా ముందు పోస్ట్ చెయ్యాలి తల్లీ! నేనా మారుమూల లంక గ్రామంలో ప్రాక్టీసు చేసుకుంటున్నది ఎందుకనుకుంటున్నావ్? ఏదో ఈ ఒక్క ప్రాణి జీవితం ఎక్కడున్నా గడిచిపోయేదే! దానికోసం కాదు! కొండాకోనల్లో ఏ వైద్యసదుపాయం అందని మరీ కుగ్రామాల్లో, లంకల్లో ఏ కొంతమందిని నా ఆయుర్వేద వైద్యంతో ఆదుకున్నా నాకదో తృప్తి! అంచేత... అంత చిన్న లంకలో ఉన్నా మనశ్శాంతితో జీవిస్తున్నాను! నీ పెళ్లి శుభలేఖని, ఏ తుఫాన్‌దెబ్బో మా ఊరికి రానివ్వకుండా అడ్డుకుందనుకో! ఏ జడివానలకో వరదొచ్చి, పోస్ట్‌మాన్ పరారీ అయిపోయేడనుకో! నా ఆబ్‌సెన్స్‌కి నువ్వు విసుక్కుంటావు. నా తప్పులేకుండా నేను చెప్పేస్తున్నానమ్మాయ్! ఆనక నీ ఇష్టం!" అని...

అయితే తరుణ్ ఏరియాలమీద టూర్‌కెళ్లి వచ్చేలోగా హృషీకేశ్‌గారి ఆరోగ్యం దెబ్బతినడమూ, కూతురి పెళ్లి త్వరగా అయిపోతే ఆ ముచ్చటకాస్తా కళ్లారా చూసి ఆనందించాలనుకోవడమూ, ఆ వెంటనే త్వరత్వరగా పెళ్లి ఏర్పాట్లు జరిగిపోవడమూ... దాంతో ఎక్కువ వ్యవధి లేకపోయింది, కొందర్ని తీరిగ్గా పిలవడానికి తగిన సమయమూ లేకపోయింది.

అదీగాక అంతకు వారంరోజులక్రితమే డాక్టర్ దత్తాత్రేయ నగరానికి వచ్చి తమతో గడిపి వెళ్లినప్పుడు దీపిక పెళ్లి త్వరలోనే చేయబోతున్నట్టు మాటలమధ్యలో చూచాయగా చెప్పి ఉన్నారు హృషీకేశ్‌గారు. నలుగురితో పాటుగా దీపిక పెళ్లి శుభలేఖను దత్తాత్రేయకీ పోస్ట్ చేయించారు.

కాని వాళ్లకేం తెల్సు...? నది మాంచి వరవడిమీద ఉందనీ, శుభలేఖ అందే ఛాన్స్ లేదనీ...

పైగా సరిగ్గా అదే సమయంలో గూండా గ్యాంగ్ లీడర్ జాలిపడి, సింపుల్‌గా, మెత్తగా





మెడ చితగ్గొట్టి నదిలో తోసేసిన చరణ్ శరీరం ప్రవాహ వేగానికి వాలుకు కొట్టుకొచ్చి, డాక్టర్ దత్తాత్రేయ ఉంటున్న లంక గ్రామం దగ్గర కొయ్యదుంగలకు తట్టుకుని ఆగిపోతే, పల్లెకారులు కొందరు అతన్ని మోసుకొచ్చి దత్తాత్రేయగారి దగ్గరకు చేర్చారు.

చరణ్‌ని చూసిన దత్తాత్రేయ అదిరిపడి, సరిగ్గా అవే పోలికలున్న తరుణ్‌ని అంతకు ముందే కొద్దిరోజులక్రితం చూసి ఉండటంతో ఆదరాబాదరాగా అతన్ని లోపలికి తీసుకువెళ్ళి, మెత్తని శయ్య ఏర్పాటుచేసి వాళ్లచేతనే లోపలకు సాయంపట్టించి వైద్యం ఆరంభించాడు.

"అయ్యావారూ! ఈయన మీకు తెల్సా?" అడిగాడో జాలరి.

"తెలుసా అని అడుగుతావేమిటయ్యా? మాకు బాగా కావలసినవాడు. మా దీపికకి కాబోయే భర్త!"

"ఆవిడగోరెవ్వురండి?"

"సాక్షాత్తూ నా స్నేహితుడి కూతురు. నాక్కూడా కూతుర్లాంటిదే అనుకో! పాపం... ఇతడే దుర్మార్గుల బారినపడ్డాడో! అదృష్టవశాత్తు నాదగ్గరికే చేరుకున్నాడు కనుక సరిపోయింది'' అంటూనే తాను తరుణ్‌గా భ్రమపడుతున్న చరణ్‌కి సపర్యలు చేయసాగాడు డాక్టర్ దత్తాత్రేయ.

కాని... కోమాలోకి జారిపోయిన చరణ్‌కి అంత తొందరగా స్పృహ వచ్చే సూచనలు కానరావడంలేదు!

అయినప్పటికీ ఆయుర్వేదంలో తనకు తెలిసిన ప్రక్రియలన్నీ వాడి, అతనికి స్పృహ తెప్పించే ప్రయత్నాలు చేయసాగాడా డాక్టర్.

"అంతేకాదు! అతడు పరిపూర్ణ ఆరోగ్యవంతుడయ్యేదాకా అతడక్కడికి చేరిన వైనంగాని తాను అతన్ని ట్రీట్ చేస్తూన్న వైనంగాని వెల్లడి చేయకూడదని నిర్ణయించుకున్నాడాయన. ఈ సంగతి తెలిస్తే దీపిక తట్టుకోలేదనీ, తల్లడిల్లిపోతుందని ఆయన ఊహ.

★ ★ ★

హాపీగా ఓ నాలుగు నెలలు గడిచాయి.

దీపికతో స్వర్గసుఖాలు అనుభవిస్తున్నా, తరుణ్‌కి అతి సహజంగా అలవాటుగా మారిపోయిన 'వెరైటీకోరే వీక్‌నెస్' నానాటికీ ప్రబలం కాసాగింది.

అప్పటికీ బెడ్‌మీద తరుణ్ చొరవని రకరకాలుగా చదివేసిన దీపిక శృంగారంలో కొత్త పుంతలు తొక్కుతూ తరుణ్‌ని ఎప్పటికప్పుడు ఆనందతరంగాల్లో ముంచెత్తుతూనే వుంది.

క్లోజ్‌గా ఇంటిమేట్‌గా భర్తకు అనుకూలంగా మెసులుతూనే, తరుణ్‌కున్న 'స్త్రీ బలహీనత'ని ఆమె ఇట్టే పట్టేసుకోగలిగిందీ నాల్గునెల్లలోనే!

ఎంతైనా ఆమె ఫారిన్‌లో గడిపిన అచ్చమైన భారతీయ స్త్రీకదా!

కాని తీరా పెళ్లయిపోయాక ఇప్పుడు అతని వీక్‌నెస్ అతడి నిజస్వరూపం తెల్సిమాత్రం ఏం ప్రయోజనం?

నిజంగా తరుణ్ గొప్ప నటుడు అని అర్థంచేసుకోడానికి ఆమెకి పెళ్లి తర్వాతనే అసలైన అవకాశం చిక్కింది. అంతకు ముందు క్లోజ్‌గా కొన్నాళ్లు అబ్జర్వ్ చేసినా, కేవలం పైపైనమాత్రమే తరుణ్‌ని గమనించడం జరిగింది తప్ప... అతడి అంతరాంతరాలను అవలోకించే ఆస్కారం లేదుగదా! అంతేగాక, అతడితో గడిపే సమయం కేవలం ఆఫీస్ అవర్స్‌కే పరిమితం!

అయితే ఒక్క విషయం! తరుణ్ ఎఫిషియన్సీని శంకించడానికి వీల్లేదు. అతడు పని విషయంలో గొప్ప రాక్షసుడు! అందర్నీ కలుపుకుపోతూ, ఆకట్టుకుంటూ పని చేయించగల సమర్థుడు. సాధారణంగా

పెద్దపెద్ద ఫర్మ్స్ రన్ చేయించడానికి, కలెక్టివ్ వర్క్ సాధించడానికి ఎంతో నేర్పు, ఓర్పు కావాలి. అందులో తరుణ్‌ని ఎంచడానికి ఛాన్స్‌లేదు!

కొత్త మోజులకోసం తహతహలాడిపోతూన్న తరుణ్ తన మనఃస్థితిని కవర్ చేసుకోడానికి ఎంత ప్రయత్నిస్తున్నా అది ఏదో రూపంలో బహిర్గతమవుతూనేవుంది. మాటల్లో, చేతల్లో తరుణ్‌లోని ప్రవర్తన దీపిక పట్టేసుకుందనీ, తన 'ఇన్నర్ పర్సన్' ఆమెకు అవగతమైపోయాడనీ తరుణ్‌మాత్రం గ్రహించలేకపోయాడు.

తరుణ్ ధోరణి ఎంత ప్రమాదకరమైనదో, స్త్రీలోలత్వం అతన్ని పతనదిశవైపు ఎలా నడిపిస్తోందో దీపికకి బాగా అర్థమయ్యేసరికి ఆమె మరింత భయకంపితురాలైంది.

పోనీ తండ్రితో చెప్దామనుకుంటే ఒకానొకప్పుడు ఇదే విషయంమీద ఎదురైన డౌట్‌కి తానే ఓ పరీక్ష పెట్టి మరీ క్లీన్ సర్టిఫికెట్ ఇచ్చేసింది. ఇప్పుడేముఖం పెట్టుకుని తండ్రితో ఈ విషయం ప్రస్తావించడం? తీరా చెప్పినా తండ్రిమాత్రం ఇక చెయ్యగలిగిందేముంది? ఇది అక్షరాలా తన వ్యక్తిగత సమస్య. దీన్ని తానే మెల్లగా పరిష్కరించుకోవాలి!

ఈమధ్య తరుణ్ ఎక్కువభాగం బయటే గడిపివస్తున్నాడు. తానుమాత్రం పెళ్లయ్యాక కనీసం కంపెనీ వ్యవహారాలుసైతం చూడడం మానేసింది. అదీగాక ఈమధ్య తండ్రి హృషీకేశ్ ఆరోగ్యం మాటిమాటికీ డౌనైపోతూండడంతో దీపిక ఇంటిపట్టునే ఉండి ఎక్కువ సమయం ఆయనదగ్గరే గడపవలసి రావడం తప్పనిసరైంది.

తరుణ్‌కి ఎప్పటికప్పుడు తాజాగా కొత్త కొత్త అమ్మాయిల్తో ఫ్రెష్ ఎక్స్‌పీరియన్స్ కావాలి! గేమ్స్‌బాండ్ సలహామేరకు అతడీ మధ్య పండూ ట్యుటోరియల్ కాలేజీ దగ్గర బీటు వెయ్యడం ప్రారంభించాడు. అక్కడ చదివేవాళ్లలో ఆడపిల్లలే ఎక్కువగా ఉండడమే అందుక్కారణం!

మొదట్లో కాలేజీకి కొంత దూరంలో బీట్ వేసేవాడల్లా క్రమంగా కాలేజీకి దగ్గర్లో ఆడపిల్లల్ని ఆకర్షించే ప్రయత్నాలు చెయ్యసాగాడు.

రెండు వారాల తర్వాత...

రాంపండు తరుణ్‌నీ, అతని కారూ, వ్యవహారం, స్టయిలూ అదీ చూసి ఆశ్చర్యపోయి తన కళ్లని తానే నమ్మలేక దగ్గరగా వచ్చి, నఖశిఖ పర్యంతం చూసి అక్షరాలా ముమ్మూర్తులా చరణ్‌నే పోలివున్న తరుణ్‌ని చరణ్ అని భ్రమపడి "అరే చరణ్! నువ్వు... నువ్వేమిటి? ఇలా...? సడెన్‌గా లాటరీ లాంటిదిగాని ఏమైనా తగిలిందేమిటోయ్? లేకపోతే ఆ సేఠ్‌గారి కూతుర్నిగాని పెళ్లాడేశావా? అంత సీక్రెట్‌గా ఎప్పుడు పెళ్లి చేసుకున్నావోయ్... ఎట్‌లీస్ట్ ఈ పండూని పార్టీకైనా పిలవకుండా...?" గలగలా ప్రశ్నల వర్షం కురిపించేస్తున్న ఆ ఆసామీ రాంపండువంక రెట్టింపు ఆశ్చర్యంతో కళ్లప్పగించి చూడసాగాడు తరుణ్.

"అలా మిడికి మిడికి చూస్తావేమిటోయ్ మేధావీ? మీ ఇంటికి అదే మీ డాబా రూమ్‌కి తాళం పెట్టివుంటే, ఇన్నాళ్లూ చెప్పా పెట్టకుండా ఎటుపోయి ఉంటావా అని తెగ మధనపడిపోయేను, ఇదా తమ నిర్వాకం? సర్లే! నీవల్ల నాకు బోల్డు నష్టం! ఈ మధ్య క్లాసెస్ తిన్నగా రన్ కాలేదు! అదుగో స్టూడెంట్లొచ్చేస్తున్నారు! నడూ! నడూ!" అంటూ చొరవగా భుజంమీద చెయ్యివేసి లాక్కుపోబోయాడు రాంపండు.

చెయ్యి విదిలించుకుంటూ, విచిత్రంగా చూస్తూ "భలేవాడివయ్యోయ్! ఇంతకీ నువ్వెవరు? క్లాసులంటావేమిటి? నీకేమన్నా పిచ్చా? స్క్రూ లూజా?" అంటూ తరుణ్ అతన్ని పరీక్షగా చూసి "ఏమిటా పిచ్చి చూపులు? నోడౌట్? ఖచ్చితంగా నీకు పిచ్చే!

నిక్షేపంగా ఈ తరుణ్‌ని పట్టుకుని చరణ్ అంటున్నావ్!" అని ధీమాగా అనేసరికి నిజంగానే వెర్రిచూపులు చూడసాగాడు రాంపండు.

"ఓర్నాయనోయ్! ఓరి దేవుడోయ్! నీకు నడమంత్రపు సిరి పట్టేసిందిరో చరణూ! నా కాలేజీ కొల్లేట్లో కలిసిపోయింది బాబోయ్! ఇక నాకు ఆ దేవుడే శరణు!" అంటూ సన్నగా దీర్ఘాలు తీస్తుంటే...

"మాస్టారూ! ఇన్నాళ్లూ ఏమైపోయారు మాస్టారూ?" అని ఒకరూ,

"అరె! మన సార్‌రా! అహ! ఏం స్టయిలు, ఏం మార్పు?" అని ఒకరూ,

"అచ్చం సిన్మాస్టార్‌లా ఉన్నారుసార్!" అని మరొకరు.

ఇలా స్టూడెంట్స్ ఒకరితో ఒకరు చెప్పుకుంటూ చేస్తున్న కామెంట్స్‌కి మతిపోతోంది తరుణ్‌కి.

"చూశావా చరణ్! నీకోసం మన స్టూడెంట్స్ ఎంతగా పరితపించి పోతున్నారో?! పద పద!" అంటూ తొందరచేయసాగాడు రాంపండు.

"ఆపవయ్యా నీ గోల! ఈ స్టూడెంట్లేమిటో, నీ క్లాసులేమిటో అర్థంకాక అయోమయంలో పడి నే కొట్టుకు చస్తుంటేనూ... అసలు నువ్వెవర్ని చూసి ఎవరనుకుంటున్నావో నేను తరుణ్‌ని''

"కొయ్... కొయ్! సర్లే! ఏదో ఒకటి... నువ్వే పేరు మార్చుకుంటే నాకేంగాని, సడెన్‌గా నాల్నెల్లపాటు మాయమైపోయి ముప్పు తిప్పలు పెట్టడం నీకేమన్నా న్యాయంగా ఉందా?"

"అదుగో! మళ్లీ అదేకూతా? నేను దీపికా ఇండస్ట్రీస్ అధినేత హృషీకేశ్‌గారి అల్లుడ్ని! అక్షరాలా తరుణ్ నా పేరు. ఫ్యూచర్‌లో ఆ కంపెనీకి ఓనర్ని! చాలా! ఇంకా వివరాలూ, ప్రూఫులూ కావాలా?"

"ఇదేం తికమకరా తండ్రీ! స్టూడెంట్లు చూడు! ఎలా నీ ధోరణికి బిత్తరపోయి చూస్తున్నారో! నీ చరణారవిందాలకో నమస్కారం! దయచెయ్యరా మహానుభావా!" అని రెండు చేతులూ జోడించి శిరస్సు వంచాడు రాంపండు

అలాగే అతడి భుజాన్ని మెడమీదుగా అందిపుచ్చుకొని, "పద! కారెక్కు! నీ డొటు తీర్చేస్తా!" అని లాక్కుపోయాడు తరుణ్.

★ ★ ★

దాదాపు కుర్చీలో కూలవేసినంత ఫోర్స్‌తో తనముందొక ఆసామీని తెచ్చి కూర్చోబెట్టి "చెప్పరా ఒరే బాండూ! నేనెవర్నో ఈ పెద్ద మనిషికి బాగా అర్థమయ్యేలా చెప్పు! ఈ మహా నస స్మార్ట్ దాదాపు అరగంటసేపు, నువ్వు నన్ను నిలబెట్టిన ట్యుటోరియల్ కాలేజీ దగ్గర నా బ్రెయిన్‌ని ఖోంచేసేశాడు!" అన్నాడు తరుణ్.

రాంపండుని చూస్తూనే, "అరె! ఈయన ఎవరనుకుంటున్నావ్... తరుణ్!" అంటూనే ఉండండి ప్రిన్సిపాల్‌గారూ! సారీ! మావాడు మీపట్ల ప్రవర్తించిన దురుసుతనానికి నన్ను క్షమించండి!" అంటూ మళ్లీ తరుణ్‌కేసి తిరిగి "ఒరే! ఈయన పండూ ట్యుటోరియల్స్ ఓనర్‌రా తండ్రీ! నా ఖర్మ!" అని "సార్! ఇంతకీ జరిగిందేమిటి?" అని అడిగాడు డిటెక్టివ్ గేమ్స్‌బాండ్.

"అయ్యా! డిటెక్టివ్ మహాశయా! ఈ చరణ్ అనబడే వ్యక్తి మా కాలేజీలో దాదాపు ఏడేళ్లుగా ఉత్తమ ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్నాడు. ఇటీవల ఓ సేఠ్‌జీ కూతురి ప్రేమ పైత్యంలో పాఠాలు గట్రా పక్కన పెట్టి పార్కులవెంట పడ్డాడో ఏమో! నాల్నెల్లుగా క్లాసెస్‌కి డుమ్మా కొట్టేసేడు. ఇతడి పుణ్యమా అని నాకు నాలుగు డబ్బులు రావాల్సినవి పోయేయి! మీరే చెప్పండి! ఇది న్యాయమా? అన్యాయమా?"

"న్యాయాన్యాయాలు కోర్టువారు విచారి

స్తారుగానీ ప్రిన్సిపాల్‌గారూ! మనకెందుకు చెప్పండి అనవసరపు అపార్థాలు? ఇకపోతే మీరనుకుంటున్నట్టుగా ఇతడు చరణ్ ఎంత మాత్రమూ కాడు! తరుణ్ అని నా బాల్యమిత్రుడు! దీపికా ఇండస్ట్రీస్ ఓనర్!"

"ఆc...!"

"అవును! ముమ్మాటికీ నా ప్రొఫెషన్ సాక్షిగా ఇతడు తరుణ్!"

"మరి... మా చరణ్ కూడా అచ్చం ఇలాగే ఉంటాడే...! కొంపదీసి ఈయనకి ట్విన్ బ్రదర్ కాదుగదా! సిన్మాల్లో చూపించినట్టు చిన్నప్పుడెప్పుడో తప్పిపోయి, ఆనక పెద్దయ్యాక..."

"స్టాప్! స్టాప్! కల్పనలొద్దు ప్రిన్సిపాల్‌గారూ! ఆయనకి ఎవరూ లేరు. ఏకాకి... సారీ! ఇటీవలే మేరేజ్ అయింది కనుక సతీసమేతుడని అందాం!"

"అంటే... మనిషిని పోలిన మనుషులుండొచ్చనంటారే! అలాగన్నమాట! సో... ఇదే పోలికలతో ఉన్న ఇంకో మనిషి మా చరణ్! సందేహంలేదు! అయితే మరో పెద్ద వర్రీ పట్టుకుంది నాకిప్పుడు!"

"ఏమిటది?" గేమ్సుబాండ్ తమాషాగా భుజాలెగరేస్తూ అడిగాడు.

"మా చరణ్ ఏమైపోయాడు?" ఆర్తిగా రాంపండు ప్రశ్న.

"మీరే అంటున్నారుగా సార్ ప్రేమ పైత్యం ముదిరిపోయి ఉండొచ్చేమో! ఇంచక్కా ప్రేమించిన ప్రియురాల్తో ఏ దిక్కుకో లేచిపోయాడేమో!"

"స్టాప్! స్టాప్! ఆ ఛాన్స్ లేదు! ఎందుకంటే అతడి లవ్‌బర్డ్... అంటే జంటలో ఆడపక్షి ఇక్కడేఉంది"

"ఎవరా పిట్ట?" అడిగాడు తరుణ్ క్యూరియస్‌గా.

"సేఠ్ విక్రమ్‌చంద్ కూతురు పల్లవి"

"ఐసీ... ఆ జ్యూయలరీ షాప్ ఓనర్‌గారమ్మాయా?" బాండ్ అన్నాడు.

"ఆc! పాపం! చరణ్ తప్పేమీ లేదిందులో!"

"ఐడియా! తప్పంతా ఆ అమ్మాయి తండ్రిదే అయివుంటుంది! యామై కరెక్ట్?" కనిపెట్టేసినవాడిలా అడిగాడు గేమ్సుబాండ్.

"అది నేను చెప్పలేనుగాని సేఠ్ విక్రమ్‌చంద్ ఓసారి సరాసరి మా కాలేజీకే వచ్చి చరణ్‌ని బెదిరించాడని మాత్రం చెప్పగలను. నా ఉద్దేశం అతడే చరణ్‌ని మాయం చేసి ఉండొచ్చు! ఏది ఏమైనా... 'ఆడబోయిన తీర్థం ఎదురైందన్నట్టు' పనిలోపనిగా మీరే డిటెక్ట్ చేసి పెట్టరాదూ మా చరణ్‌ని" ప్రాధేయపడ్డాడు రాంపండు.

"మరి నా ఫీజు?"

"అపార్థం చేసుకున్నా, అవమానించిన నేరానికి నేను తమ ఫీజు ఇచ్చుకుంటాను గాని ఒరేయ్ గేమ్సుబాండూ! ముందా అమాయక లెక్చరర్‌గారి ఆచూకీ చూడరో!"

"థాంక్స్! మీ ఉదార స్వభావానికి జోహార్! ఇంకొక్క చిన్న హెల్ప్ కావాలి మీవల్ల"

"నావల్లనా? ఏంటది?"

"ఇందాక మీరు నోటీస్ చేసే వుంటారు, మా గర్ల్ స్టూడెంట్స్ మీగురించి చేసిన కామెంట్స్. మీరు సెంట్‌పర్సెంట్ చరణ్‌లాగే కనిపిస్తున్నారు కనుక అలాగే వచ్చి మా కాలేజీని రోజూ పావనం చేసి వెళ్తూండండి! జస్ట్... మీరలా వస్తున్నారంటేచాలు! మళ్లీ మా కాలేజీ కళకళలాడిపోతుంది!"

"అంటే... చరణ్‌సార్‌కి అంత ఫాలోయింగ్ ఉందన్నమాట!"

"అన్నమాట కాదు, ఉన్నమాటే! ది బ్రిలియంట్ అండ్ ఎక్స్‌పర్ట్ ట్యూటర్!"

"అంతేనా...!"

"అంతేనా అంటే... అంతేకాదు! ముఖ్యంగా ఆడపిల్లలు పిచ్చిగా ఆరాధించే గొప్ప




మేధావి!"

"ఓ.కే! పాఠాలు చెప్పడం నావల్ల కాని పని! అయినా తప్పదు... రమ్మంటే వస్తాను'' క్రీగంట రాంపండుని చూస్తూ ఈ వంకతోనైనా హాయిగా అమ్మాయిలతో జోవియల్‌గా గడిపే ఛాన్స్ దొరుకుతున్నందుకు ఉత్సాహపడుతూ అన్నాడు తరుణ్.

"అదంతా నేను చూసుకుంటాను. మీరిక్కడ తరుణ్ కాదు... చరణ్! అదొక్కటి గుర్తుపెట్టుకోండి చాలు! మీవల్ల జరగని పని నేనెలా చేయిస్తాను? మీవల్ల జరిగే హెల్ప్ నాకు అదొక్కటే! మీరు రోజూ వచ్చి వెళ్తుండడమే!"

"ష్యూర్!" అని మాటిచ్చి 'నాక్కావలసిందీ అక్కడికొచ్చి వెళ్తుండడమే!' అని స్వగతంగా అనుకున్నాడు తరుణ్.

★ ★ ★

సేఠ్ విక్రంచంద్ తన షాపులో కస్టమర్లతో బిజీగా బేరసారాల్లో మునిగివున్నాడు.

షాపుముందు కారాగింది.

గవరయ్య గబగబా షాపులోకొచ్చి సేఠ్ విక్రంచంద్ చెవిలో ఏదో గుసగుసగా చెప్పాడు.

ఓ కస్టమర్‌కి చూపిస్తున్న రత్నాలహారం అలాగే వదిలేసి, "ఆc!" అంటూ ఆదరాబాదరాగా గవరయ్యవెంట కార్లో ఇంటికి బయల్దేరాడు విక్రంచంద్.

విక్రంచంద్ ఇంటికెళ్లేసరికి కూతురు పల్లవి ఆత్మహత్యా ప్రయత్నంలో ఉంది.

గది తలుపులు దబదబ బాదసాగాడు విక్రంచంద్.

"అమ్మా! పల్లవీ! తలుపు తియ్యి తల్లీ!"

ఉరి బిగించుకుంటున్న పల్లవి "నో డాడీ! నేను చరణ్ లేందే క్షణం ఉండలేనని తెల్సి నన్నిలా ఎంతకాలం నిర్బంధించగలవ్? జీవచ్ఛవంలా ఈ హెరాం జైల్లో మగ్గేకంటే ఏకంగా మరణించడమే మేలుకదూ! ఛీ! ఓ సరదా లేదు... సంతోషం లేదు..." ఏడుస్తూ అంది.

"నీ చరణ్ అక్కడ లేడమ్మా! ఎటో వెళ్లిపోయాడని తెల్సింది!"

"నో! నేన్నమ్మను! నువ్వే ఏదో చేసివుంటావు!"

"అది కాదమ్మా! కావాలంటే నువ్వే కాలేజీకి వెళ్లి తెల్సుకో! అతడక్కడ్నించి వెళ్లిపోయాడన్నది నిజం! అంతకంటే బెటర్ జాబ్ ఏదో వచ్చి ఉంటుంది!"

తలుపు తీసుకుంటూ బైటికి వచ్చి "సరే! నువ్వన్నదే నిజమైతే నన్నీ గృహనిర్బంధంలో ఉంచడం దేనికి? మళ్లీ ఎప్పటిలాగే నేను ట్యుటోరియల్ కాలేజీకి వెళ్లొచ్చుగా!"

ఆలోచనలో పడ్డాడు సేఠ్ విక్రమ్‌చంద్.

'అవును! ఎలాగూ అడ్డు తీరిపోయిందికదా! పల్లవిని ఇంకా ఇంట్లో కట్టిపడెయ్యడం దేనికి?' అనుకుని "ఆల్‌రైట్! ఒకే ఒక్క షరతు! నిన్నటిదాకా చరణ్‌కోసం పరితపించిపోయేవ్! అతడు తనకీ లవ్వూ, గివ్వూ నచ్చక, గుళ్లో పెళ్లిదాకా నువ్వు తీసుకెళ్లినా పుంజాలు తెంపుకు పారిపోయాడు! ఇక ఇప్పుడు ఇంకో ఎర్రగా, బుర్రగా వుండేవాడి వెంటపడి పిచ్చివేషాలు గట్రా వెయ్యనంటేనే నీకు కాలేజీ ప్రాప్తి!" సడెన్‌గా తాను గ్రిప్ వదిలెయ్యడం ఇష్టంలేనట్టుగా ఓ కండిషన్ పెట్టినట్టు అన్నాడు విక్రంచంద్.

తండ్రి ప్రవర్తనను మొదట్నుంచీ శంకిస్తూనే ఉన్న పల్లవికి చరణ్‌ను తన తండ్రే ఏదో చేసి ఉంటాడన్న అనుమానం ఈ దెబ్బతో బలపడింది. ఏదేమైనా తానీ నాలుగ్గోడలమధ్య బందీ అయిపోతే, ఏ విషయమైనా తెల్సుకోవడమెలా? అందుకే తండ్రిని బెదిరించడానికే ఈ ఆత్మహత్యాప్రయత్నమనే నాటకం ఆడింది. దీంతో ఖచ్చితంగా తండ్రి మళ్లీ తనని బాహ్యాప్రపంచంలోకి వదుల్తా

డని ఆమె భావించినట్టుగానే జరిగింది.

అందుకే తండ్రి అన్న కండిషన్ వినగానే, "డాడీ! ప్రేమ అనేది మన షాపులోని నగో, నక్లెస్సో కాదు మనకు అందుబాటులో లేదనో, మనకి గిట్టుబాటు కాలేదనో అది మానేసి లేదా మార్చేసి మరోటి తెచ్చుకోడానికి! నీకాభయం అక్కర్లేదు. చరణ్ లేని జీవితం నాకు జీవితమే కాదు! ఈ భూప్రపంచంమీద ఎక్కడున్నా వెతికి పట్టుకోగలనన్న నమ్మకం, ధైర్యం నాకున్నాయ్! నేను కోరేదల్లా స్వేచ్ఛ!" అంది అంతకంటే ఫోర్స్‌గా పల్లవి.

చిన్నగా నవ్వుకొని 'నువ్వు వెతికి పట్టుకోడానికి అతడీ భూప్రపంచంమీద ఉంటేగదా!' అనుకున్నాడు మనస్సులో విక్రంచంద్.

రాంపండుద్వారా, చరణ్ ఆచూకీ కనిపెట్టాలని నిర్ణయించుకుంది పల్లవి. కాని ఆమెకి తెలీదు... చరణ్, రాంపండు కళ్లబడి కూడా నాలుగు మాసాలవుతోందనీ, అతని అదృశ్యం రాంపండుక్కూడా ఇంకా మిస్టరీగానే ఉందనీనూ!

కాలేజీ దగ్గర-

చరణ్ పోలికలతో ఉన్న తరుణ్‌ని చూసి, చరణేనని భ్రమపడి, 'అరె! మన ట్యూబులైటు సారు ఎటూ పోలేదే! డాడీ అలా ఎందుకు అన్నాడు చెప్మా? బహుశా, 'ఓ నాల్నెల్లు ఇద్దర్నీ విడదీసి ఉంచి, దూరం జరిపితే ప్రేమా, దోమా అదే ఎగిరిపోతుంది' అనుకున్నాడా? ఏదైతేనేం? తన బంగారం చేజారిపోలేదు' అని మహదానందపడిపోయింది పల్లవి.

'ఇదంతా తండ్రికుట్రే! సందేహంలేదు! ఆయన్ని బెదిరించి కొంతకాలం ఎక్కడికో పంపేసి ఉంటాడు. అసలే మహా భయస్తుడు కనుక చరణ్ వెళ్లిపోయి ఉంటాడు. కొంత కాలం గడిచింది గదా తన తండ్రివల్ల ఏ ప్రాబ్లెం ఎదురయ్యే సూచనలూ లేవని రాంపండుసార్ ధైర్యం చెప్పి ఉండొచ్చు! అందుకే మళ్లీ వచ్చి ఉండొచ్చు!' రకరకాలుగా యోచించుకుంటోంది పల్లవి.

పూర్వపు చనువుతోనే పల్లవి "నన్నింతదగా చేస్తారా సార్! పెళ్లి ఏర్పాట్లు ఓపక్కగుళ్లో నా ఫ్రెండ్స్ చేస్తూనే ఉన్నారు! మీరూ సరిగ్గా ఓ గంట ముందుగా ముహూర్తానికి డైరెక్ట్‌గా పెళ్లికొడుకు గెటప్‌లోనే వచ్చేస్తానని మాట ఇచ్చారు! మీ మాట నమ్ముకుని నేను అక్కడ పెళ్ళికూతురి ముస్తాబులో రెడీ అవుతూంటే నాకు టోకరా ఇచ్చేసి మా నాన్నకి నేను రెడ్‌హాండెడ్‌గా దొరికిపోయేలా చేస్తారా? అసలు నామీద ఎందుకంత కక్ష మీకు? మీ నిర్వాకంవల్ల నేనెంత శిక్ష అనుభవించానో తెలుసా మాస్టారూ! నిజంగా మీకు నామీద అణుమాత్రమైనా ప్రేమ లేదుకదూ! ఏదో పిచ్చిది... ఊరకే... వెంటపడుతోందని మీకూ అలుసైపోయానన్నమాట!" చాలా కాలం తర్వాత తన వ్యక్తి కంటపడగానే కలిగిన భావావేశంవల్ల చనువూ, కోపం, ఆత్మీయత, అలక అన్నీ కలగలిపి ఒక్కుమ్మడిగా కమ్ముకురాగా అతన్ని పట్టుకు ఊపేస్తూ అడిగింది పల్లవి.

'ఓహో! అయితే పల్లవి అంటే ఈ పిల్లేనన్నమాట! ది గ్రేట్ సేఠ్ విక్రంచంద్ ఏకైక గారాలకూతురు ఈమేనా? బొద్దుగా ముద్దుగా ముచ్చటగా ఫిగరు బావుందే! ఇంచక్కని షేపూ చొరవా ఉన్న ఈ పిల్లని వద్దనుకుని దూరంగా పారిపోయిన ఆ బుద్ధూ చరణ్ ఎవరబ్బా? అతడెవరో తనలాగే ఉంటాడట! ఈ మహానగరంలో ఏనాడూ తనకు తారసడపలేదే! ఓసారి... ఆ అమాయకుణ్ని చూసి తీరాలి!' అనిపించింది తరుణ్‌కి.

చాలాకాలం తర్వాత కళ్లబడిన ప్రియుణ్ని చూసిన ఉత్సాహంతో పల్లవి హృదయం అనంతానంద తరంగితమై ఉల్లాసభరిత ఊహాగీతం అందుకుంది. ఆమె చిలిపి చేష్టలకి, మధ్యమధ్య ఆ కవ్వింతలకీ మహా




ఇబ్బందిగా ఫీలయిపోసాగాడు తరుణ్.

కారణం అతడికి తెలీకుండానే చరణ్ అనే తనలాంటి పోలికలే కలిగివున్న వ్యక్తిమీద బ్రదర్లీ అఫెక్షన్ ఏర్పడిపోవడం, సోదరభావంవల్ల అతడి లవర్‌పట్ల తాను అనుచితంగా ప్రవర్తించడం అన్యాయమని భావించడం...

★ ★ ★

డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ తన అసిస్టెంట్ రాణికిచ్చిన అసైన్‌మెంట్ గురించి వివరాలడుగుతున్నాడు.

"నువ్వా బటర్‌ఫ్లై కేసు డీల్ చేస్తున్నప్పుడు అతడు ఎవరెవర్ని కలుస్తున్నదీ నోట్ చేస్తున్నావా?"

బటర్‌ఫ్లై అనేది కేసులో ముఖ్య వ్యక్తికి వాడిన కోడ్‌వర్డ్.

"యస్ బాస్! కేవలం అపాయింట్‌మెంట్స్ మాత్రమే కాదు ఆ మీటింగ్స్ వివరాలు కూడా రాబడుతున్నాను!"

"గుడ్! చొరవ అంటే అలా ఉండాలి!"

"నాకు చాలా చొరవ ఉంది సార్!"

కంగారుగా "ఓ... యస్! యస్! దట్స్ ఓ.కే! ఐనో! తర్వాత చెప్పు!" రాణి తనమీద వలపుబాణం రువ్వినప్పుడల్లా ఆమె మత్తు కళ్లు తననెంత అల్లరిపెడతాయో అతడికి బాగా అనుభవమే కనుక ఆమెని విషయం చెప్పమని తొందర చెయ్యసాగాడు గేమ్స్‌బాండ్.

"మన బటర్‌ఫ్లై కూడా చాలా చొరవ ఉన్నవాడే!" ఆగిందామె.

"ఐ నో! ఐనో! నాకు తెల్సు! సో... అతగాడు ఆ లేడీ డాక్టర్ని చూసి ఫాలో అయ్యాడు. సరే! ఆ తర్వాత..." ఇంకా తొందరించసాగాడు బాండ్.

"ఆమె క్లినిక్‌కి వెళ్లి తన ప్రాబ్లెం చెప్పాడు సర్!"

"వాట్సది ప్రాబ్లెం?" హుందాగా హ్యాండ్ స్టిక్ ఎగరేస్తూ అడిగాడు విషయం తెల్సి కూడా.

జవాబు చెప్పకుండానే తలుపు దగ్గరికెళ్లి బోల్టు బిగించేసింది రాణి.

"అరె! తలుపెందుకు వేశావ్?"

"ప్రాబ్లెం ఏమిటని అడిగారుగా! అది నింఫోమేనియా..." అదోలా చూస్తూ కవ్వింపుగా "మీ సైడ్‌నుంచి కాదు నా సైడ్ నుంచి'' అంటూనే రెండంగల్లో గేమ్స్‌బాండ్ మీద వాలింది రాణి.



**లే**డీ డాక్టర్ మిస్ కామినీదేవి క్లినిక్ అది...

నగరంలో పెద్ద పేరున్న సైకియాట్రిస్ట్ ఆమె. నలభైదాకా ఉంటుందామె వయసు. కాని ఏజ్‌ని దాచే ప్రయత్నం ఏమీ చెయ్యనక్కర్లేకుండానే ఆమె పాతికేళ్లదానిలా కన్పించడం దేవుడామెకిచ్చిన వరం.

వర్రీస్‌గాని, బరువు బాధ్యతలుగాని ఏమీ లేని జాలీలైఫ్ ఆమెది. బహుశా ఆమె వన్నె తరగని సౌందర్యానికదే కారణం కావచ్చు!

పెళ్లి చేసుకోలేదన్నమాటేగాని, స్త్రీ పురుష లైంగిక సంబంధాల విషయంలో ఇన్హిబిషన్స్ ఉండకూడదంటుందామె. చెప్పడమేకాదు! తాను ఆచరించి చూపించిన సందర్భాలూ అనేకం! ప్రొఫెషనల్ సర్కిల్లో కూడా కామినీదేవి సంగతి అందరికీ తెల్సిందే!

సరిగ్గా అనుకున్న టైమ్‌కి, ఆమె తనకి అపాయింట్‌మెంట్ ఫిక్స్‌చేసిన సమయానికి ఆమె కన్సల్టింగ్ రూంలో అడుగుపెట్టాడు తరుణ్.

ఆవేళ కామినీదేవి ఏ భువనమోహినిలా గానో ఉంది.

అతి కష్టంమీద చూపుల్ని మరల్చే ప్రయత్నం చేస్తున్నాడు తరుణ్.

అతడిలోని ప్లేబాయ్ నిద్రలేస్తున్నాడు కానీ సభ్యత కాదనీ, తన సమస్య అదే తరహా మనోవికారానికి సంబంధించినదనీ, దాన్నెలా కంట్రోల్ చేసుకోవాలా అన్నదే కన్సల్ట్ చెయ్యడానికి తానిక్కడికి వచ్చాడనీ అతడి లోపలి వ్యక్తి హెచ్చరిస్తూంటే, చాలా జాగ్రత్తగా సంభాషించటానికి ప్రిపేరవుతున్నాడు తరుణ్.

తరుణ్ హ్యాండ్‌సమ్ పర్సనాలిటీని, ఆ స్టయిలిష్ లుక్స్‌నీ అలాగే ఆదమరచి చూస్తుండిపోయిన కామినీ దేవికి 'ఎ నైస్‌గై' అనిపించిందా క్షణంలో. అతన్ని వదలకూడదనుకుంది.

"సరిగ్గా టైమ్ మెయింటెయిన్ చేసేవాళ్లంటే నాకెంతో ఇష్టం! సరే! మీ సమస్య?" అడిగింది కామిని.

"నేనో సైకోనేమోనని అనుమానంగా ఉందిమేడం!"

"ఎందుకలా అనుకుంటున్నారు?"

"ఎందుకంటే ఎలా చెప్పను?"

"మీరు మీలాగానే చెప్పండి!"

"జోక్ కాదు డాక్టర్! నిజంగా నేనో సైకోని!"

"ఆమాటకొస్తే అందరూ సైకోలే! ఏదో ఓ విషయంలో ఓవర్‌గా ఆలోచించడం మానేసి సంగతేమిటో చెప్పండి!"

"ఆఁ! అదే!... అదే నా సమస్య! కాస్త ఓవర్‌గా ఆలోచించడం... అదీ ముఖ్యంగా సెక్స్ విషయంలో! ఎక్స్‌క్యూజ్‌మీ! అపార్థం చేసుకోరుగద! ఫర్గెట్టాంపుల్... మీరు డాక్టర్.., పవిత్రమైన వైద్యవృత్తిలో ఉన్నవారు. ఈక్వల్‌టు గాడెస్... అవునా! మీమీద సైతం నాకు వాంఛ కలగడం ఏమిటి చెప్పండి? విపరీతం... విడ్డూరం కాకపోతే!"

"నో! నేనలా అనుకోను! ఇందులో వింతేమీలేదు! ప్రోవొకేటివ్‌గా ఉంటే, ఆ రీతిగా స్పందనలు కలగడం అనేది వెరీ నాచురల్! అఫ్‌కోర్స్! నా వస్త్రధారణ కూడా కొంత కారణం కావచ్చు! అసలూ... మోజుపడనివాడు, అందునా అమ్మాయి అందాలు ఎదలో సందడిగా చిందులేస్తుంటే కోరిక జ్వలించనివాడు... మగవాడే కాడు!"

ఈవిడ ఇలా మాట్లాడుతోందేమిటాని క్షణంపాటు విస్తుపోయాడు తరుణ్.

"అదిసరేనండీ! ఎవరో అమ్మాయి మీద మనకి తెలీకుండానే మనసు పారేసుకోవడం వేరు! అలాక్కాక తెలిసీ ఆ పిల్ల మరొకరిసొత్తు అని ఎరిగీ, ఆ అమ్మాయి వేరొకరికి మనసిచ్చిందన్న విషయమూ అర్థం అయీ, నన్ను నేను కంట్రోల్ చేసుకోలేకపోతున్నానంటే అది మహాపాపం కదూ?"

"కొంతవరకూ? కాని ఈ మనస్సనేది ఉందే! దాన్ని అదుపుచెయ్యడం మహా మునులకే సాధ్యం కాలేదు. కందమూలాలు తింటూ ముక్కుమూసుకు తపస్సు చేసుకున్న జడధారుల్ని కూడా జడత్వం వదిలేలా ఆడీపాడీ తమ వశం చేసుకోగలిగిన అచ్చరకన్నెలున్నారన్న సంగతి మీకు తెలీదా! ఇక వాపీ వరసా అంటారా! అవి పురాణాల్లోనే దొరకవు. వాట్ని వాటి దారిన గాలికొదిలేసి, పుత్ర సమానుడైన చంద్రుడితో తార కులకలేదా?"

"పాపం! తన ప్రియుడని భ్రమపడి నాతో చనువు పెంచుకుంటున్న పిల్ల కండిషనే వేరు డాక్టర్! నిజానికి వాళ్లది పవిత్ర ప్రేమ. నా వల్ల అది వంచింపబడడం నాకిష్టంలేదు''




"ట్రాష్! పవిత్రప్రేమ.. అంతకంటే నాన్సె న్స్ టాకింగ్ ఈ ప్రపంచంలో ఇంకోటుండదని నా సిద్ధాంతం! జీవితాన్ని ఎంజాయ్ చెయ్యలేని వాళ్లూ చేతకాని వాళ్లూ ఈ పవిత్రప్రేమ అనే కర్టెన్ని అడ్డం పెట్టుకుని దాగిపోతూ ఉంటారు. లోలోపల కోరికల్తో కాగిపోతూ ఉంటారు'' బిగ్గరగా నవ్వేస్తూ అంది కామిని.

"ఏంటి డాక్టర్! మీరు కూడా!" ఆశ్చర్యపోయాడు తరుణ్.

"యస్ మిస్టర్ తరుణ్! నేను పచ్చి నిజమే మాట్లాడుతున్నాను. మనం మామూలు మనుషులం! ఉప్పూకారం తింటున్నవాళ్లం! ఆహార నిద్రా భయ మైథునాలు మనిషికే కాదు సమస్త జీవజాలానికీ అతి సహజమైనవే కదా! వాటికి లేని కట్టుబాట్లు మనకేల?"

"కానీ మనం వివేచన ఉన్నవాళ్లం! ఆలోచనున్నవాళ్లం! జంతువులతో జతపడలేంకదా!"

"మనిషొక వింత జంతువు మిస్టర్ తరుణ్! అర్థంలేని తర్కాన్ని సృష్టించేదీ అతడే! అంతలోనే వితర్కించుకుని వాటికి సవరణలు పేర్చుకొచ్చేదీ అతడే! కట్టుబాట్లు పెట్టుకొనేదీ మనిషే! కట్టు తప్పి ప్రవర్తించేదీ ఆ మనిషే! కాదంటారా?"

"అయితే నా ప్రవర్తన సరైనదేనని సమర్థిస్తారా?

"ఎవరి ప్రవర్తననూ ఎవరూ సరైందని సమర్థించనూ అక్కర్లేదు, సర్టిఫై చేయనూ అక్కర్లేదు. ఎవరి సిక్త్ సెన్స్ వారిని ఎప్పటికప్పుడు ఏది మంచి? ఏది చెడు? అనేది హెచ్చరిస్తూనే ఉంటుంది. దాని గురించి వర్రీ చెందక్కర్లేదు. ఎటొచ్చీ ఆ వ్యక్తులు తమదైన సహజరీతి ప్రవర్తనను కోల్పోకుండా వుంటేచాలు!"

"అంటే!?"

"సపోజ్! మిమ్మల్నే తీసుకోండి! మీకు అమ్మాయిల్తో హాపీగా గడపడం సరదా అనుకుందాం! లెట్ ఇట్‌బీ యాజ్ యూలైక్! కోరికోరి ఓ అమ్మాయి మీ వెంటపడితే మడి కట్టుక్కూర్చొని, మరేదో సాకు వెతుక్కోవడం మీ నేచురాలిటీని దెబ్బతీస్తుందన్నమాట!"

"ఇఫ్‌యూ డోంట్‌మైండ్! నా నేచురల్ బిహేవియర్‌కి మీ మాటలు మరింత బలం చేకూర్చాయి! ఇంతసేపూ నన్ను రెచ్చగొట్టిన మీ మాటలు, ఇక చేతల్లోకి వెళ్లమంటున్నాయి''

"గుడ్! నా ట్రీట్‌మెంట్ వెంటనే పన్చేస్తోందన్నమాట!" అంటూనే, తన మునిపంటనొక్కిన కింద పెదవితో తరుణ్‌కి సిగ్నల్ ఇచ్చి, పరువాలు దాచిన పైటని గాలికొదిలేసింది కామిని.

"ఆc" అంటూ తక్షణం ప్రొసీడైపోతూన్న తరుణ్‌ని మరింత కవ్విస్తూ ఎంతో తమకంగా అతని మీద వాలిపోయిందామె.

వాళ్ల అల్లరి చూడలేక నైట్‌లాంప్ కళ్లు మూసుకుంది.

★ ★ ★

అలసిసొలసిన అనంతరం తానే లైట్ వేసింది రాణి.

ఆమె నుదుట స్వేద బిందువులు ముత్యాల్లా మెరుస్తున్నాయ్!

అల్లరిగా ఆమెనే చూస్తూ అడిగాడు గేమ్స్‌బాండ్ "నింఫోమేనియా అంటే ఇదా?" అని.

"ఊ!" అని మత్తుగా మూలిగి "కామప్రకోపం ఎక్కువైపోవడం అన్నమాట! జస్ట్ ఎ వీక్‌నెస్'' అంది రాణి గమ్మత్తుగా.

"అయితే నేను అసిస్టెంట్‌ని మార్చుకోవాలన్న మాట!" తాపీగా అన్నాడు గేమ్స్‌బాండ్.

"నోనో! ఏం కాదు... తమరిలా నా ఆగడాల్ని భరించలేకపోతే నేను వేరే మగతోడు వెతుక్కోవాల్సి వుంటుందన్న మాట!"

అదే మాడ్యులేషన్‌ని తిప్పి కొడుతున్నట్టు జవాబిచ్చింది రాణి.

★ ★ ★

"ఏమండీ! ఏమిటింత అర్ధరాత్రిదాకా?" అడిగింది దీపిక.

"అరె! ఇదో పెద్ద రాత్రా? పదకొండున్నరే గదా అయిందీ? అయినా మనలాంటి బిజినెస్ పీపుల్ రాత్రీపగలూ కష్టపడితే తప్ప పన్లు జరగవు''

"అంత కష్టపడి చూసుకోవలసినవి కొత్త దంపతుల విషయంలో వేరే పన్లుంటాయను కుంటాను'' కొంటెగా అంది దీపిక.

"యస్! అవునవును! నీ మాటల్లో సౌండ్ నాకర్థమైంది. కానీ బాగా టైర్డైపోయాను కంపెనీలో''

"అదే ఏ కంపెనీలో, ఎవరితో కంపెనీలో అనే నేనడుగుతున్నదీనూ!"

"అదేం మాటలు దీపా! అంత డౌటెందు కొచ్చింది నీకు?"

"అబ్బే! ఏం లేదు ఎనిమిది గంటలకి ఫ్యాక్టరీకి ఫోన్ చేస్తే అయ్యగారక్కడ లేరని సమాధానం వచ్చింది. అక్కడా లేక ఇక్కడికీ రాక తమరెక్కడ గడుపుతున్నట్టో! ఏం మహాశయా? పెళ్లయి ఆర్నెల్లు తిరక్కుండానే ఈ బొమ్మతో బోర్ ఫీలవుతున్నారా?"

అంత సూటిగా దీపిక అడిగేసరికి, తడబడిపోతూ తరుణ్ "ఛఛ! అదేంటి దీపా? నోనో! ఈ తరుణ్ గురించి ఇంతేనా నువ్వు తెల్సుకున్నదీ?"

"చాలా తెల్సుకున్నాను. కనుకనే అడుగుతున్నాను. చెప్పండి ఇంత రాత్రిదాకా ఎక్కడున్నట్టు?"

"అయ్యో! నీకెలా చెప్పను దీపా? ఐమీన్... నీకెలా చెప్తే అర్థం అవుతుంది?" తనకి అలవాటుగా మారిపోయిన అందాన్ని ఆరాధించే గుణం... తనలో ఇటీవల ఎక్కువైపోయిన కొత్తరుచుల ఆస్వాదన అనే గుణం... పడగవిప్పుతున్న కోరికల వెంట పరుగులెత్తే గుణం... గురించి దీపిక ఎక్కడ పసిగట్టేసిందోనని సతమతమైపోసాగాడు తరుణ్.

"మీరేం చెప్పక్కర్లేదు! మీ గుణం ఆ మాత్రం గ్రహించలేని అమాయకురాల్ని కాదు శ్రీవారూ''

"గుడ్! ప్రాణప్రదంగా ప్రేమించిన నువ్వు... నన్ను ఏరి కోరి పెళ్లాడిన నువ్వు నన్ను అపార్థాలు చేసుకోవడం అప్పుడే ప్రారంభించావన్న మాట!"

"ఇంకా బుకాయించకండి! మీకు దండం పెడతాను! నాకు తెలీదనుకుంటున్నారా మీ లీలలు!"

"ఏం తెలుసు?" ఊరకే సందేహిస్తోందనుకుంటున్న తరుణ్ కింకా ఏమూలనో చిరు ధైర్యం ఆమెకేమీ తెలీదని.

సోనీవల్ల కొంతా, రిసెప్షనిస్టు సలోమీవల్ల కొంతా సమాచారం రాబట్టి తనకి భర్త బలహీనత తెలిసిపోయిందని చెప్పెయ్యాలని ఓ క్షణం దీపిక ఆరాటపడిందిగాని, పెళ్లయి ఆర్నెల్లు తిరక్కుండానే పరస్పర నిందారోపణలూ దూషణ తిరస్కారాలూ తద్వారా సంసారం రచ్చచేసుకోవడం తన లాంటి ఎమ్.బి.ఏ. చెయ్యాల్సిన పని కాదని తమాయించుకుంది.

భర్తకెన్ని దుర్గుణాలున్నా, తనని అలక్ష్యం చేస్తున్నాడన్న సంగతిగాని గ్రహిస్తే ఏ భార్య మాత్రం ఊరుకోగల్గుతుంది?

ఆ విషయంలో దీపిక అందరిలాంటి ఆడదే!

తరుణ్‌ని, కొత్త చిలకల వెంట పడకుండా ఆపి తన దారికెలా తెచ్చుకోవాలా అని దీపిక మథన పడసాగింది.

★ ★ ★

అసలు దీపికకి అనుమానం కలగకపోయేదే! కాని తరుణ్ చేసిన చిన్న పొరపాటువల్ల అతడి బలహీనతను ఆమె గ్రహించేయగలి




గింది.

ఆ రోజు...

దీపిక ఫ్రెండ్ సౌందర్య తన ఇంటికొచ్చింది.

వస్తూనే "సారీనే! నీ మేరేజ్‌కి రాలేకపోయాను! ఏం అనుకోవుగదా! అసలేం జరిగిందంటే మా వారు వినయ్ తెల్సుగా! ఉత్త కంగారు అయోమయం మనిషి! కంపెనీలో ఏదో పొరబాటు జరిగిందట! దానికీయన నైతిక బాధ్యత వహిస్తానంటూ జాబ్‌కి రిజైన్ ఇచ్చి కూర్చున్నారు. రెండ్రోజులు హెూరాహెూరీ ఇంట్లో మా యిద్దరికీ ఇదే పోరాటం! ఎవడో చేసిన తప్పుకి మీరు రాజీనామా ఇవ్వడమేమిటని నేనూ, ఆ కంపెనీ డైరెక్టర్లలో ఒకడిగా ఆ వింగ్‌కి బాధ్యత వహిస్తున్నందుకు అదే సరైన డెసిషన్ అని ఆయనా. మొత్తం మాకున్న పార్టీలూ ఎంగేజ్‌మెంట్స్ అన్నీ ఆ యుద్ధంలో రద్దయిపోయాయి''

"సర్లేవే! యుద్ధంలో ఎవరు గెలిచారు? నువ్వా మీ ఆయనా!"

"మనమే వీరోచితంగా ఓడిపోయాం! అంటే... సరే మహాశయా! తమ చిత్తం వచ్చినట్టే కానీండి అని సరెండరైపోయాం"

'పోవే బడాయి! వచ్చేవంటే చాలు ఒకటే గలగల!"

"అవునూ! మీ ఆయనేరీ?"

"ఇదుగో! ఇక్కడ!" అంటూ, ఎన్‌లార్జ్ చేయించి లామినేటెడ్ ఫ్రేమ్ కట్టించిన తమ పెళ్లి ఫొటోలో వున్న తరుణ్‌ని చూపించింది దీపిక.

"ఈయనా? ఈయన్నెక్కడో చూశానబ్బా!" ఏదో గుర్తు తెచ్చుకుంటున్నట్టుగా అంది సౌందర్య.

"ఇంకెక్కడ చూసి ఉంటావ్? బహుశా మా ఫ్యాక్టరీలోనే అయివుంటుంది!"

"మీ ఫ్యాక్టరీకి నేనెప్పుడొచ్చానే తల్లీ? ఆc గుర్తొచ్చింది!" ఏదో చెప్పబోయి, తరుణ్‌తో తన అనుభవం గుర్తొచ్చి "అహ! ఏం లేదులే' అంది సౌందర్య.

ఆమె ఏదో దాస్తోందని అర్థమైపోయింది దీపికకి.

తరచి తరచి ప్రశ్నించాక, ఎప్పుడో ఏదో పార్టీలో అతడితో గడిపినట్టు చెప్పి, "తల్లీ! నువ్వు నా ఫ్రెండ్‌వని నీ దగ్గర దాపరికం ఎందుకని పూర్తిగా చెప్పేశాను అసలు రహస్యం. ఆఫ్‌కోర్స్! మా ఆయనకి నా కారెక్టర్ గురించి పెద్ద పట్టింపు లేదనుకో! ఎవరికి నచ్చిన వాళ్లతో వాళ్లు ఎంజాయ్ చెయ్యాలనే తత్త్వం మా ఇద్దర్దీ కనుక సరిపోయింది. ఆయన తిరుగుళ్లకు నేను అడ్డు వెళ్లనట్టే నా హాపీనెస్‌కి ఆయనా అడ్డురారు...

బట్... నీలాంటి సెంటిమెంటల్ బగ్స్‌క్కొన్ని బాదరబందీలున్నాయని, ఈ సంగతి చెప్పడానికి తటపటాయించాను ముందు. అంతకంటే ఇంకేమీలేదు'' అంది సౌందర్య.

"ఐసీ'' అన్నది కానీ దీపిక మనసు అప్పట్నుంచీ కుతకుత ఉడికిపోతూనే ఉంది. ఎంత నటన సూత్రధారి అని జెలసీతో రగిలిపోతూనే ఉంది.

ఫారిన్‌లో ఉన్నా మన సంప్రదాయాన్ని గౌరవించి, తానెంత కేర్‌ఫుల్‌గా తన పవిత్రతను కాపాడుకుంది!

భారతనారి తన భర్తతో తప్ప, పరపురుషునితో శారీరక సుఖం పంచుకోడానికి ఇష్టపడదనీ అసలా ఊహే భరించదనీ విదేశీయులు సైతం ప్రశంసించేందుకు ప్రతీకగా నిలబడిందే!

అటువంటి శీలవతి అయిన తనని తరుణ్ వంచిస్తాడా? రకరకాల భావోద్రేకాలకి లోనైనప్పటికీ అగ్నిపర్వతంలా ఏ క్షణాన్నయినా బరస్ట్ కావడానికి రెడీ అయినప్పటికీ లావాలాంటి ఆ నిజాన్ని ఆమె ఎప్పటికప్పుడు అణుచుకుంటూనే ఉంది.

అన్నిటికంటే ఆమెనెక్కువ బాధించిన

విషయం... దీన్ని మించి ఇంకొకటుంది.

అదే తరుణ్, సౌందర్యని చేసిన రిక్వెస్ట్ అట! "చూడు డార్లింగ్! చిన్నమాట! నా వైఫ్ చాలా సెన్సిటివ్. మారేజ్ మాకీమధ్యే జరిగింది. నాకిలాంటి ఎఫైర్స్ ఉన్నట్టు తెలిస్తే ఫీలవుతుంది. మన హై సొసైటీ మీటింగ్స్‌లో ఎప్పుడో ఒకప్పుడు ఆవిడ నీకు తారసపడక పోదు! అలాటిది జరిగితే మాత్రం కనీసం యధాలాపంగానైనా మన తిరుగుళ్ల గురించి ప్రస్తావించకు!"

అయితే తరుణ్ ఒక్కమాట మాత్రం మరిచిపోయాడు... తన పరోక్షంలో కూడా తామిద్దరి పరిచయ ప్రస్తావన ఎత్తొద్దు అని చెప్పడం.

ఆ చిన్న పొరపాటే అతడ్ని పరోక్షంలో దీపిక ముందు దోషిగా నిలబెట్టేసింది.

అతడి సమక్షంలో ఈ ఇన్సిడెంట్ జరిగి ఉంటే ఏదో రీతిన జాగ్రత్తగా కవర్ చేసేసుకొనేవాడే!

★ ★ ★

పల్లవి హుషారుకి పట్టపగ్గాల్లేకుండా పోయాయి.

తనకిక కన్పించడనుకున్న తన ప్రియుడు, కొత్త ఉత్సాహంతో కన్పించడం ఆమెకి మరింత ఆనందకరంగా ఉంది!

దానికితోడు ఈమధ్య కొత్తగా అతడు కళ్లజోడు ధరించడం, అది అతడి హుందాతనాన్ని పెంచినట్టు భావించసాగింది పల్లవి.

"చరణ్‌జీ! నౌ యూ ఆర్ రియల్లీ ఎక్స్‌లెంట్ హీరోవయ్యావ్!" అని కాంప్లిమెంట్ కూడా ఇచ్చిందోసారి కళ్లజోడు సవరిస్తూ.

"చచ్చాంరా దేవుడా! చరణ్ కళ్లజోడు పెట్టుకోడు కాబోలు!" అనుకుని, ఆ మర్నాటి నుంచే స్పెక్ట్స్ లేకుండా, కాలేజీకి వస్తే "ఏంటి డియర్! స్పెక్ట్స్‌లో నువ్వెంత బాగున్నావో తెల్సా! అసలా పూర్వం మనిషే వేరు! ఇప్పుడిప్పుడే అచ్చంగా నీలో కొత్త మెరుపుని చూస్తున్నాను. ప్లీజ్! నాకోసమైనా కళ్లజోడు పెట్టుకోవూ!" అంటోంది పల్లవి.

మరోసారి "జోడీగా కళ్లకు అద్దాలైతే వచ్చాయి! నీకు జోడీగా నాకామాత్రం అదృష్టం కూడాలేదా! నిత్యం నీతో ఉండే అదృష్టానికి నోచుకోలేదా! నేనా కళ్లజోడు పాటి చెయ్యలేకపోయానా?" అంటూ నిష్ఠూరమాడింది.

దాంతో బెంబేలెత్తిన తరుణ్, శృతిమించి పల్లవి రాగాన పడుతోందని గ్రహించి, అర్జెంటుగా రాంపండుని సంప్రదించాడు, "ఈ కొత్త ఆపద ఎలా తప్పించుకోవడం తండ్రీ?" అంటూ.

తీవ్రంగా ఆలోచించి ఓ అయిడియా చెప్పాడు రాంపండు.

అతడి సలహా మేరకు, ఓసారి అలా వెళ్లి ఆమె తండ్రి కంట్లో పడ్డాడు తరుణ్.

అంతే! రాంపండు ఊహించినట్టుగా, అంతా పాజిటివ్‌గానే అతడి ఐడియా పాచిక పారింది.

తరుణ్‌ని చూసి చరణ్‌గా అపోహపడ్డ సేఠ్ విక్రమ్‌చంద్ అదిరిపడ్డాడు.

'ఓహో! కూతురీమధ్య ఆనందంగా ఉండడానికి కారణం ఇదా?' అనుకున్నాడు కూడా!

కాని ఆ వెంటనే అతడికి స్ఫురించింది, "ఇదేమిటీ? వీడ్ని సఫా చెయ్యమని పురమాయించిన గ్యాంగ్‌మాస్టర్, పనైపోయిందని చెప్పి డబ్బులు పట్టుకుపోయాడే! పైగా శవం కూడా దొరికే ఛాన్స్‌లేదు, వరద మీద ఉన్న నదిలో కొట్టుకుపోయిందని నమ్మబలికాడుకదా. మరెలా తిరిగొచ్చాడీ మనిషి? లేక నిజంగా ముఠావాళ్లు వీడ్ని చంపకుండా బుకాయించేరా?

పరిపరి విధాలా ఆలోచన్లు పరిగెడుతుంటే టెన్షన్ భరించలేక గబగబా తన డైరీలో ఓ పేజీ తిప్పి, సదరు ప్రొఫెషనల్ కిల్లర్స్ డెన్‌కి ఫోన్ చేసేడు సేఠ్ విక్రమ్‌చంద్.





అనుకోకుండా అప్పుడే వరండాలో కొచ్చిన పల్లవి తండ్రి మాటలు వినేసింది.

మత్తుగా అవతల రిసీవర్ ఎత్తిన గూండా బాస్, ఫోన్లో సేఠ్ విక్రమ్‌చంద్ వేసిన అక్షింతలన్నీ ఓపిగ్గా భరించి "అలాగా సేఠ్! ఇప్పుడే నా మనుషుల్ని పంపిస్తున్నా! ఈ క్షణం నుంచే వాళ్లు అతడి వేటలో ఉంటారు! ఈసారి ప్రూఫ్స్ లేకుండా నిన్ను కలవం సేఠ్‌జీ! నమ్మకమైన సాక్ష్యాలతో వస్తాం! పోతే ఒక్కమాట. హత్యలే వృత్తిగా ఉన్న మాలాంటి వాళ్లని ఎప్పుడూ శంకించకు! అనవసరంగా నోరు పారేసుకున్నందుకు నీకో ఫైవ్‌లాక్స్ పెనాల్టీ వేస్తున్నా! శవం అదే నువ్వు కోరుకున్న వ్యక్తి సాక్ష్యాధారాల్తో సహా కావాలనుకుంటే, నేనడిగిన అమౌంట్ రెడీ చేసుకుని ఉండు! పని పూర్తయ్యాక కలుస్తా!" అనేసి ఫోన్ పెట్టేశాడు.

ఐదు లక్షలేం ఖర్మ! తన ప్రిస్టేజీకి క్వశ్చన్‌లా మారిన ఆ చరణ్‌ని హతమారిస్తే ఎంతైనా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్న విక్రమ్‌చంద్ ఈసారి తప్పకుండా తన పంతంలో విజయం సాధించగలడన్న నమ్మకంతో కూతుర్ని మళ్లీ కంట్రోల్ చెయ్యసాగాడు.

దాంతో తండ్రితో మరోసారి ఘర్షణపడి, ఫ్రీబర్డ్‌లా రోడ్డుమీద కొచ్చేసింది పల్లవి.

"పో! కూతురివన్న మమకారంతో నీకేలోటూ చెయ్యకుండా కోరినవన్నీచేస్తూ వచ్చాను. కొండమీది కోతినైనా కాదనకుండా తెస్తూ వచ్చాను! ఇంత చేసిన ఈ తండ్రికోసం నువ్వేం చేశావ్? కనీసం ఒకేఒక్క పని మానేయన్నాను. తాడూ బొంగరం లేనివాణ్ణి ప్రేమించద్దన్నాను! ఎట్‌లీస్ట్ కన్నతండ్రి కోసం ఈ చిన్న పని చెయ్యలేకపోయావ్! పో! ఎక్కడికి పోతావో ఎంత దూరం పోగలవో పో! వాడు కనబడకుండా పోయాక నువ్వే తిరిగొస్తావ్!" తాను ఒప్పందం చేసుకున్న గూండాల గురి తప్పదనే ధైర్యంతో కూతుర్ని నిర్దాక్షిణ్యంగా గెంటెయ్యడానికైనా సందేహించలేదు విక్రమ్‌చంద్.

తండ్రి మళ్లీ ఏదో పన్నాగం పన్నుతున్నాడని ఊహించేసిన పల్లవి, తన ప్రియుణ్ణి రక్షించుకోడానికి ఆత్రపడసాగింది.

ఆ విషయంలో ఎన్ని అడ్డంకులెదురైనా అధిగమించడానికి కృతనిశ్చయురాలై అంత రాత్రివేళ చరణ్ రూంవైపు పరుగుతీసింది.

కానీ ఆమెను వెక్కిరిస్తూ పెద్ద తాళంకప్ప అక్కడ దర్శనమిచ్చింది.

ఏం చెయ్యాలో తోచక అక్కడే అలా దిగాలుగా కూలబడిపోయింది పల్లవి.

★ ★ ★

కాంట్రాక్టర్ ప్రభుదాస్ తరుణ్‌కున్న ఆడబలహీనతను సొమ్ముగా మార్చుకోడానికి పథకాలు ప్రారంభించాడు.

అతడికి జీవితమంటే ధన సంపాదన ఒక్కటేగోల్! డబ్బు... డబ్బు.. నిరంతరం సొమ్ము సంపాదించే మార్గాలు అన్వేషించడమే అతడి జీవితలక్ష్యం! దానికోసం విలువలు పణంగా పెట్టడానికి సైతం అతడు జంకడు.

ముఖ్యంగా అతడి గురి ఎప్పుడూ బిగ్‌షాట్స్ మీదే ఉంటుంది. వాళ్లకుండే బలహీనతలమీద దాడి జెయ్యడానికి రకరకాల ట్రిక్స్ రెడీ చేసుకుంటూంటాడు. మొదటి భార్య మరణించాక అతడికీ డబ్బు యావ మరీ ఎక్కువైపోయింది.

నిరంతరం ధన సంపాదనలో మునిగిపోయాడు.

కూతుర్ని చూడ్డం కోసం రెండో పెళ్లి చేసుకున్నాడే తప్ప రంజనిని ఏనాడూ అతడు భార్యగా సుఖపెట్టలేదు. వయసు వేడి మీద ఉన్న రంజని, సమాజంలో సెక్యూరిటీ కోసం ఓ భర్త ఉండాలని అతడ్ని పెళ్లి చేసుకుంది తప్ప ప్రభుదాస్ ముచ్చు మొహం చూసి మోహించి కాదు! డబ్బు అనేది పారేస్తే ఏ సుఖాన్నైనా కొనుక్కోవచ్చు

నని ఆమెకి తెల్సు! ఏదీ కూడా అందుకు అతీతం కాదు! అంతేకాదు! కరెన్సీ నోట్ల పరదాల మాటున ఎంత విచ్చలవిడిగా ప్రవర్తించినా, ఏం తప్పులేదనీ డబ్బుతో ఎవరి నోరైనా నొక్కెయ్యవచ్చనీ ఆమె అనుభవపూర్వకంగా తెలుసుకుంది.

నీతి, నియమం, పవిత్రత.. ఇలాంటివన్నీ పనికిమాలిన మాటలనీ, ఉత్త ట్రాష్... రబ్బిష్ అనీ సుఖం కోరుకున్న విధంగా పొందడం చేతకానివాళ్లు సృష్టించుకున్నవనీ ఆమె ఏనాడో ఓ గట్టి నిర్ణయానికి వచ్చేసింది. తన మనోభావాల్ని ఆమె అక్షరాలుగా మార్చేది.

ప్రభుదాస్‌కి ఆమె మనోభావాలు తెలీకా కాదు! ఆమె బ్యాగ్రౌండ్ హిస్టరీ తెలీకా కాదు ఆమెని పెళ్లి చేసుకున్నది.

తనకి డబ్బు కావాలి! ఆమెకి అదే డబ్బు సమకూర్చి పెట్టగల సుఖాలు కావాలి! సో తమది ఒక కాంట్రాక్ట్ మారేజీలాంటిదని ఇద్దరికీ తెల్సు! కాంట్రాక్టింగ్ బిజినెస్‌లో కూడా భారీ మొత్తాల రాబడికి భారీగానే



వెచ్చించాల్సి ఉంటుందిగా! అది ఏ రూపంలోనైనా ఉండొచ్చు! చెల్లించే మూల్యం కానుక కావచ్చు! నైతిక విలువా కావచ్చు!

ఓసారి ప్రభుదాస్ చాలా క్లోజ్‌గా తరుణ్‌ని అబ్జర్వ్ చేశాడు. రంజని మీద అతడికి మోజుందని అందుకే అకేషన్ లేకపోయినా ఒకటిరెండు సార్లు తన ఇంటికి విజిట్ చేస్తున్నాడని గ్రహించేశాడు ప్రభుదాస్.

తరుణ్ భావి ఫ్యాక్టరీ అధినేత అనీ అతడ్ని గుప్పిట్లో పెట్టుకోవాలనీ ఆలోచిస్తున్న ప్రభుదాస్‌కి ఇదో మంచి అవకాశంగా తోచింది. రంజనినే తరుణ్‌కి ఎరగా వెయ్యాలనుకున్నాడు.

తాను ఒక ప్రయోజనాన్ని ఆశించి రంజనిని తరుణ్‌తో గడపడానికి పంపిస్తే ఆమె ఆ అవకాశాన్ని తనకు అనుకూలంగా మల్చుకుంది. ఎన్నాళ్లనుంచో తరుణ్ మీద మోజుపడ్డ ఆమె ప్రభుదాస్ ప్రపోజల్‌ని కాదనకుండా తన స్వంతం చేసుకుంది. తన శాయశక్తులా ప్రయత్నించి తరుణ్‌ని మళ్లీ మళ్లీ తన దగ్గరికి రప్పించుకొనేలాగ చేసింది. పరిస్థితులే ఆమెకి ఆ జాణతనం నేర్పాయి.

ఆ తర్వాతర్వాత ప్రభుదాస్ ప్రమేయం లేకుండా తానే తనకి ఇష్టమైనప్పుడల్లా ఏదో స్టార్ హోటల్లో రూం బుక్ చేసుకుని ఫలానా హోటల్‌లో ఫలానా రూం నెంబర్‌కి వచ్చెయ్యమని డైరెక్టుగా తరుణ్‌కే కబురు చేసే స్థాయికి ఎదిగిపోయింది రంజని.

ఓసారి...

మత్తులో సోలిపోయి నిద్రలోకి వాలిపోయిన తరుణ్ తర్వాతెప్పుడో మెలకువ వచ్చి చూస్తే తన గుప్పిట్లో నోట్లకట్ట ఉండటం గమనించి షాక్ తిన్నాడు.

'అరె! ఈ మనీ తన చేతిలోకి ఎలా వచ్చింది? ఇంత డబ్బు తనతో తీసుకురాలేదే!' అనుకుంటూ దిగ్గున లేచి బెడ్‌మీదే కూర్చున్నాడు. రంజనికోసం చుట్టూ చూశాడు.

ఓ పావుగంట తర్వాత ఫ్రెష్‌గా... అప్పుడే కడిగిన ముత్యంలాగా తయారై బాత్‌రూంలోంచి బైటికొచ్చింది రంజని పవిత్రతకి ప్రతిరూపం అనదగ్గ అచ్చమైన గృహిణి గెటప్‌లో.

'అంతకుముందే ఓ గంటక్రితం తనతో పడకపై గడిపింది ఈమేనా?' అనిపించి ఆశ్చర్యంగా చూస్తూండిపోయాడు తరుణ్.

"ఈ నోట్లు...?" టీపాయ్‌మీదకి విసిరేస్తూ దేనికిచ్చినట్టు అన్నట్లుగా అడిగాడు తరుణ్

"ఓహ్! ఏంటి బాసూ! సుఖపడ్డ మనిషి మనీ ఎందుకిచ్చిందో ఆమాత్రం అర్థంచేసుకోలేవూ? జస్ట్ ఎ టిప్ టూ యూ మై డియర్ హీరో!"

"నాకు నువ్వు టిప్ ఇవ్వడమా?"

"ఏం... ఇవ్వకూడదా? ఓహో! నీకు లక్షలకు లక్షలే ఉండొచ్చు! అంతమాత్రాన టిప్ తీసుకోడానికి గిల్టీగా ఫీలవడం ఎందుకూ? నాకు సంతోషం కలిగించినందుకు గిఫ్ట్‌గా నేనేమీ ఇవ్వకూడదా?"

"ఛ! ఛ! అదేంలేదు! చాలా ఇంట్రస్టింగ్‌గా ఉంది నీ చర్య! అంత ఆనందం నీకు ప్రభుదాస్‌వల్ల కలగడంలేదా?"

"ప్రభుదాస్... హుఁ! అతడో మృగం! మృగం ఏంచేస్తుంది? ఏదో ఆకలేసినప్పుడు ఆవురావురుమంటూ కచ్చాపచ్చాగా నమిలేసిపోతుంది. అతడూ అంతే! సెక్స్‌లోనేకాదు, తిండిలో కూడా! అసలు అతడు నన్నెందుకు చేసుకున్నాడనుకున్నావ్? ధనకాంక్ష ఎక్కువ దాసుడికి. అందుకోసం కట్టుకున్న పెళ్ళాన్నైనా... ఇదుగో ఇలాగే!" అంతలోనే కళ్లలో విషాదం కమ్ముకోగా సజల నయనాలతో బెడ్‌మీదే కూలబడింది రంజని.

"సారీ రంజనీ! నీ పర్సనల్స్ అడిగి నిన్ను బాధపెట్టినట్టున్నాను!" నొచ్చుకుంటూ అన్నాడు తరుణ్.

"ఫర్వాలేదు! డీసెంట్‌గా ప్రవర్తించి




నన్ను ఆనందపు అంచులకి తీసుకెళ్లిన నీలాంటివాళ్లకే ఆడవాళ్లను రంజింపచేయడం తెలుస్తుంది. నీతో చెప్పుకోవడంతో బాధని కూడా షేర్ చేసి, హృదయభారం దించుకున్నట్టు ఫీల్ అవుతున్నా!"

"ఓకే! చెప్పు"

"అతడిక్కావలసింది డబ్బే అయితే నాక్కావలసినవి ఆ డబ్బు అందించే సుఖాలు. నాకోసం ఎంత వెచ్చించుకున్నా ప్రభుదాస్ ఖర్చు అడగడు. ఉన్న ఒకే ఒక్క కూతురు మాత్రం అన్ని కట్టుబాట్లమధ్యా పెరగాలంటాడు. అలాగని ముద్దు, ముచ్చట్లు విషయంలో తక్కువ చెయ్యడు. ఒక్కమాటలో చెప్పాలంటే నేను అతనికి భార్యను కానేకాను! ఆ పిల్లకైతే ఆయాని! ప్రభుదాస్‌కైతే పర్మనెంట్ ఉంపుడుకత్తెని!" క్రమంగా ఆమె కంఠం రుద్ధమవడం గమనించాడు తరుణ్.

"నువ్వడగవచ్చు! అంత హీనంగా అతడికింద లొంగి ఉండడం దేనికని! ఏంచెయ్యను అంతకంటే? నాకు ముందూ వెనకా నా అన్నవాళ్లెవరూ లేరు. ఉన్న ఒక్క ముసలి తల్లీ ఈమధ్యే పోయింది. సమాజంలో నాకో అండ ఉండాలికదా! నన్నెంత అలుసుగా చూసినా, నిర్లక్ష్యం చేసినా భర్త అనే ఓ లైసెన్స్ వెతుక్కోవడం తప్పుకాదుగా తరుణ్! నేను నా సుఖం వెతుక్కుంటున్నట్టే అతడూ ఎవరెవర్నో వెతుక్కోగలడు! కొన్నిసార్లు అతడి మొరటు ప్రవర్తనకి నేను అభ్యంతరం చెప్పిన సందర్భాల్లో నాలాంటివాళ్లెందరో ఉన్నారన్న విషయం రూఢీ అయింది!"

"అంటే... అతడికీ అమ్మాయిల పిచ్చి ఉందా?"

"నా మొహం! అది పిచ్చికాదు! బలహీనత... పెర్వెర్షన్స్ అంటారే! అటువంటిదన్నమాట! అసలు ఏ స్త్రీ అయినా భర్త అనే ఓ బలమైన బంధానికి తానొక్కదాన్నే కట్టుబడి ఉండాలని, ఆ సామ్రాజ్యంలోకి మరో స్త్రీ ప్రవేశించకూడదని ఎంతగానో పరితపిస్తుంది తరుణ్! కాని... ఒకసారి తన నమ్మకం వమ్ము అయిపోయిందని తెలిశాక ఇక ఆ స్త్రీ ప్రవర్తనలో కూడా అలాంటి పర్వెర్షన్సే చోటు చేసుకుంటాయేమో...!

ఏ కొద్దిమందో దీనికి అతీతులుగా ఉండొచ్చేమోగాని, భర్త అనే లైసెన్స్‌డ్ పర్సన్ చాటున తమ ఆనందాన్ని తాము వెతుక్కోడానికి నూటికి తొంభైమంది మొగ్గుచూపిస్తారు. తమకి నచ్చినవాడికోసం తనువూ, మనసూ అర్పించేందుకు ఆరాటపడతారు. పతివ్రతలకాలం మారిపోడానికి కారణం నూతన ఆర్థిక సంబంధాలే! అదొక్కటే కాదు! స్త్రీకి మనసు మండితే ఏమైనా చెయ్యగలదు. తరుణ్! ఈ మగాళ్లు ఆ అగాధపు లోతుల్ని... నో! నో!... అంచుల్ని కూడా తాకలేరు'' రంజనిలోని రచయిత్రి విజృంభించింది.

"సారీ రంజనీ! నిజంగా నేన్నిన్ను హర్ట్ చేశానేమో! రియల్లీ వెరీ వెరీ సారీ!"

"ఇట్సాల్‌రైట్! నామీద నీకు నిజంగా ప్రేమో, సానుభూతో ఏది ఉన్నా ఆ టిప్ కాదనకు!" అంటూ కర్చీఫ్‌తో కళ్లొత్తుకుంటూ వెళ్లిపోయింది రంజని.

ఆమె వెళ్లాక ఆలోచనలో పడ్డాడు తరుణ్

"ఇంతకీ ఈ రంజని మనస్తత్వం ఏమిటి? ఇలాంటి విపరీతపు తీరున్న స్త్రీలున్నా ఉంటారా? తమని అలక్ష్యంచేస్తేనో, సాంసారిక బంధంలో భర్త బైటి తిరుగుళ్లకి అలవాటైతేనో వాళ్లూ ఇలాగే ప్రవర్తిస్తారా? అసలు... రంజని ఉద్వేగంగా అన్నమాటలు... ముఖ్యంగా ఆఖరున అన్న మాటలు... అతడి చెవుల్లో పదేపదే గింగురుమంటున్నాయి!

ఆమె ఏమన్నది...!

"స్త్రీకి మనసు మండితే ఏమైనా చెయ్యగలదు! ఈ మగాళ్లు ఆ అగాధపు లోతుల్ని... నో... అంచుల్ని కూడా తాకలేరు'' అనికదూ అంది. అంటే... పెళ్లయ్యాక స్త్రీ తన భర్తతో అన్నివిధాలా... దాంపత్య సుఖం పొందడంలో విఫలమైతే ఇలాగే ఆలోచిస్తుందా?

మారుతున్న సమాజంలో ఇది ఆసాంతం కాకున్నా కొంతైనా అనివార్యమా? ఒకప్పుడు స్త్రీకి ఇదే పరిస్థితి ఎదురైతే, ఇలాగే ఫీలయ్యేదా? ఆధునిక స్త్రీ అలనాటి సీత, సావిత్రివంటి పతివ్రతల తీరుని అవహేళన చేస్తోందా? భర్త ఎలాంటివాడైనా భరించే సహనశక్తిని కోల్పోయిందా?

ఏమిటి? ఆమె మాటలకి అంతరార్థం ఏమిటి? నవీన ధోరణులకి, ఈ ఫాస్ట్ ఫార్వర్డ్ వరల్డ్‌లో కొత్త ట్రెండ్స్‌కు ఇదేరీతిలో తన వైఫ్ దీపిక కూడా ఆలోచించడమంటూ జరిగితే?... అమ్మో! అసలు తానీ ఊహనే భరించగలడా? ఏదో సామెత చెప్పినట్టు 'తనదాకా వస్తే...' అనీ, తన దీపిక ఇలా చేస్తే? అమ్మో! ఆ ఊహే ఎంత భయంకరంగా ఉంది? రేపొద్దున్న ఇలాగే జరక్కూడదని ఎక్కడన్నా ఉందా? అప్పుడు తన పొజిషనేంటి? ఆమె తన తప్పు లేదని సమర్థించుకుంటే...? నో! అలాగే జరిగితే తానేమవుతాడు?

దీర్ఘాలోచనలో పడి టైమెంతయిందీ సైతం మర్చిపోయాడు తరుణ్.

అర్థరాత్రి దాటుతోంది...

ఈమధ్య దీపిక తనని అనుమానిస్తోంది కూడా! తన ప్రవర్తనలో తేడా గమనిస్తోంది. ఆలస్యమైతే కారణాలు ఆరా తీస్తోంది. భార్యలు అంత తక్కువ కాలంలోనే భర్తల బిహేవియర్‌లో తేడాలనెలా పోల్చుకుంటారో? బహుశా అది భగవంతుడు వాళ్లకిచ్చిన వరం కాబోలు! ఏదేమైనా తన ప్రవర్తన అనుచితమే! 'ఒక భార్యకు ఒక భర్త' అని తానెలా ఆలోచిస్తున్నాడో, 'ఒక భర్తకు ఒకే భార్య' అని ఆమె కూడా భావించడంలో తప్పులేదుగా!

'నో!... ఇకనైనా తాను బుద్ధిగా ఉండాలి! తన నైజం మార్చుకోవాలి! దీపికతో వీలైనంత ఎక్కువ సమయం, ఎక్కువ సాన్నిహిత్యంతో గడపాలి!'

నిర్ణయాలైతే చేసుకున్నాడుగాని అవి ఆచరణలోమాత్రం క్రమక్రమంగా జారిపోతున్నాయి!

తన మూమెంట్స్‌మీద తానే సెల్ఫ్ కంట్రోల్ విధించుకోలేకపోతున్నాడు.

కారణం - కొత్త అమ్మాయిల ఆకర్షణ లోంచి బయటపడలేనంతగా అప్పటికే కూరుకుపోయాడు కిరణ్.

తన బలహీనతని క్షమించి సర్దుకుపోగలిగే తత్త్వం ఉన్న స్త్రీగా కనబడదు దీపిక.

తరుణ్ మస్తిష్కం ఆలోచనల్తో వేడెక్కి, సన్నగా తలనొప్పి ప్రారంభమైంది.

ఇప్పుడతన్ని తొలుస్తున్నదొక్కటే ప్రశ్న - 'తాను తన నైజాన్ని వదులుకోకపోతే దీపిక తనని వదిలేసుకుంటుందా?' అనేదే ఆ ప్రశ్న.



"సారీఫర్ ది ఇంటరప్షన్' అంటూ బ్రేక్కొట్టాడు సునీల్.

కథ చెప్పడం ఆపింది నమీచి.

అతడేం అంటాడోనని జనమేజయంతో సహా అందరూ కుతూహలంతో ఉన్నారు.

"చూడండి మేడం! ఇలాంటి ప్రేమలూ, అపార్థాలూ, అపోహల కథలు అనేకం వచ్చాయి!" అన్నాడు సునీల్!




"అంతేనా! మెల్లగా ఇదీ ముక్కోణపు ప్రేమకథలోకి జారిపోతోందే!" సమర్థింపుగా అన్నాడు ఏమన్.

"ఇలాంటి సిన్మాలకి కొన్ని వందల ఉదాహరణలివ్వవచ్చు!" జంబులింగం కూడా అందుకున్నాడు.

"కావచ్చు! నేనేం కాదన్ను! అయితే మీరో విషయం మర్చిపోతూన్నారు. ఎన్ని ట్రయాంగిల్ లవ్‌స్టోరీలొచ్చినా, ఎన్ని డబుల్‌రోల్ చిత్రాలొచ్చినా అవి విజయవంతమవుతూనే ఉన్నాయి, అవుతాయి కూడా! దానికి ఒకే ఒక్క కారణం - 'లవ్, సెంటిమెంట్, మిస్ అండర్‌స్టాండింగ్' అనే మూడు లక్షణాలూ సార్వకాలీన సార్వజనీన ప్రపంచ సిన్మాలన్నిటికీ ఆయువుపట్టు! తరాలు మారొచ్చు కాని అంతరాలు మాత్రం మారవు! అదే 'ప్రేమ'కి కొత్త అర్థాలు చెప్పొచ్చు! అదే సెంటిమెంట్‌కి కొత్త భాష్యాలు చెప్పొచ్చు! అదే మిస్ అండర్‌స్టాండింగ్‌ని కొత్త కోణంలోంచి చూపొచ్చు! మీరిక్కడ మరో విషయం మర్చిపోతున్నారు. అసలీ మూడు లక్షణాల్లో ఏదో ఒక్క లక్షణమైనా ప్రధానంగా, ప్రస్ఫుటంగా డీల్ చెయ్యని, కనీసం వీటిల్లో ఏ ఒక్కటీ టచ్ చెయ్యని చిత్రం ఏదైనా ఒక్కటి... ఎనీ వన్ ఫిల్మ్ చూపించండి! నేను, నావల్ల జరిగే ఏ పనికైనా రెడీ! బెట్..." ఆవేశంగా అంది నమీచి.

ఒక్క క్షణం అందరూ మ్రాన్పడిపోయారు.

నమీచి చెప్పింది అక్షరసత్యం! అది ఖండించడానికి ఉదాహరణలు వెతకడం కూడా వ్యర్థప్రయత్నమేనని వారికి తెలుసు!

"మరొక్క విషయం మీకందరికీ మనవి చేస్తున్నాను! నేనిందులో డీల్ చేసిన ప్రతి పాత్రా సజీవమైనది. ఈనాడు మనమధ్యనే ఇటువంటి వ్యక్తుల్ని మీకు ప్రత్యక్షంగా చూపించగలను. ఫరెగ్జాంపుల్ ఇందులో రంజని ఎవరనుకుంటున్నారు? నేనే! యస్! ముమ్మాటికీ..."

"మరి నమీచి?" నసిగాడు కార్తవరాయ్.

చిలిపిగా నవ్వింది నమీచి.

"అదో మారుపేరు మహానుభావా! నమీచి ఉరఫ్ రంజని... ఇంకా ఫ్యూచర్లో నమీచి... ఉరఫ్... మరేదో అవుతుందేమో!"

"ఐసీ! ఇంటరెస్టింగ్‌గా ఉంది!"

"ఏంటి... ఈ కథా? నా కథా?" అడిగిందామె.

"ఈ కథలో ఇమిడిపోయిన నీ కథ" పూర్తిచేశాడు ఏ(ప్)మన్.

"అవును... సిన్మాటిగ్గా చెప్తూనే నిజంగా జరిగినట్లు వివరిస్తూన్న నీ వ్యథ!"

"థాంక్స్!"

"నాకో చిన్న డౌట్!" జనమేజయం అన్నాడు.

"అడగండి!"

"మరి... ప్రభుదాస్?"

"మిగతా కథ వెండితెరపై చూడుడు!" తమాషాగా అని, మళ్లీ కథ కంటిన్యూ చెయ్యడంలో నిమగ్నమైంది నమీచి.



చరణ్‌కోసం ట్రైచేస్తున్న గూండాలూ ప్లస్ వాళ్ల బాస్, అతడే టైమ్‌లో ఎక్కడుంటాడో, అతడినెలా ట్రాప్ చెయ్యాలో, అతడినెక్కడ కాప్చర్ చెయ్యాలో అర్థంకాక తల బద్దలు కొట్టుకోసాగారు. దొరికినట్టే అన్పిస్తూ చిక్కినట్టే కన్పిస్తూ అంతలోనే చేజారిపోతున్న తరుణ్, వాళ్లకో పజిల్‌లా తయారయ్యాడు.



రంజని మాటలే మాటిమాటికీ తలపులోకొస్తూన్న తరుణ్‌కి క్రమంగా ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ ఆవరించసాగింది.

'ఈమధ్య రెండు మూడుసార్లు దీపిక తనని తరచి తరచి ప్రశ్నించడం, తాను విసుక్కోవడం, ఆమె బాధపడడంతో ఇక



'ఈ మనిషి ఇంతే!' కాబోలు అనే నిర్ణయాని కొచ్చేసిందేమో దీపిక!' అనుకోసాగాడు తరుణ్.

దీపిక గురించి తానే ఓవర్‌గా ఆలోచిస్తు న్నాడా?

తన ప్రవర్తనలో మార్పు వచ్చినట్టే ఆమె ప్రవర్తనలోనూ మార్పు వస్తోందా...?

ఇటీవల ఒకటి రెండు ఇన్సిడెంట్స్‌ను చూస్తే దీపిక కూడా తనని నిర్లక్ష్యం చే స్తోందేమో అనుకోసాగాడు తరుణ్.

ఓసారి...

తాను ఇంట్లో ఉండగా ఫోన్ మోగింది.

దీపిక వడివడిగా ఆ ఫోన్‌కోసమే ఎదురు చూస్తున్నదాన్లా అక్కడికి వచ్చింది.

అనుకోకుండా తాను క్రెడిల్‌మీంచి తీశా డు ఫోను.

బిత్తరపోయి చూసింది దీపిక.

"హలో! అక్కడ ఎవరూ మాట్లాడు తూంట?"

"ఇంతకీ మీరెవరూ? ఎవరు కావాలి?"

"దీపిక అని ఓ అమ్మాయి ఉండాలి అక్కడ! ఇటు పిలువ్?"

అవతలి వ్యక్తి అంత అమర్యాదకరంగా, ఏకవచన ప్రయోగంతో మాట్లాడ్డం విస్మయా న్ని కలిగించింది తరుణ్‌కి. తనకి తెలి సినంతలో దీపికని 'అమ్మాయిగారూ!' అని సంబోధించే మగ గొంతులే తప్ప గౌరవ వాచకం వాడకుండా పిల్చే పురుషులెవరూ లేరు.

"అవునూ! నువ్వెవరయ్యా! ఫోనా పిల్లకి ఇయ్యి!" అవతలి కంఠం.

"నేను దీపిక భర్తను... తరుణ్‌ని"

అంతే... సడెన్‌గా ఫోన్ పెట్టేశాడు అవ తలి వ్యక్తి.

దీపిక గాభరాగా అక్కడే అటూ ఇటూ పచార్లు చేస్తోంది.

"ఎవరో నీకోసం ఫోన్‌చేసి, నేనని తెలీగా నే డిస్కనెక్ట్ చేసేశారు'' దీపికతో అన్నాడు తరుణ్.

ఆమె ఏమీ జవాబు చెప్పకుండా అక్క ణ్నించి వెళ్లిపోయింది.

ఆ తర్వాత రెండురోజులకి-

దీపిక ఫోన్లో ఎవరితోనో చాలా ఉల్లా సంగా మాట్లాడుతోంది. మాటల్నిబట్టి అవ తలి వ్యక్తి ఖచ్చితంగా పురుషుడే అని నిర్ధారించుకున్నాడు తరుణ్.

సరిగ్గా తాను ఇంట్లో అడుగుపెట్టేసరికి గాభరాగా కనీసం 'బై' అయినా చెప్పకుండా ఫోన్ పెట్టేసింది.

ఎవరూ అంటూ ఆరా తీయబోతే, "మీకు సంబంధించిన వాళ్లు కాదులెండి! అయినా మీకు అనవసరం!" అనే జవాబు వచ్చింది ఆమెనుంచి.

ఎందుకిలా ప్రవర్తిస్తోంది దీపిక?

తనకి తెలీని ఆ వ్యక్తి ఎవరైవుంటారు?

మరోసారి...

తాను బాత్‌రూంలో స్నానం చేస్తున్నాడు.

అంతకుముందే ఫ్రెష్‌గా తయారై, ఎవరి కోసమో ఎదురుచూస్తున్నట్టు అసహనంగా మాటి మాటికీ వాచ్ చూసుకుంటున్న ఆమె తాను స్నానం చేసి వచ్చేసరికి ఎక్కడికో వెళ్లిపోయింది.

హాల్లో సోఫా క్లీన్ చేస్తున్న పని కుర్రాణ్ణి అడిగితే, వాడు ముసి ముసి నవ్వులు నవ్వు కుంటూ, "అమ్మాయ్‌గారాండీ... ఆయన్తో ఎలిపోయేరండీ!" అన్నాడు.

"ఆయనెవర్రా?" అసహనంగా అడిగాడు తాను.

"ఏమో తెలీదండీ! ఎప్పుడూ చూళ్లే దండి!" ఇదీ వాడి జవాబు.

'ఖచ్చితంగా దీపికకీ ఏదో ఎఫైర్ ఉండే ఉంటుంది'... ఆ ఊహ మనసులోకి రాగానే తరుణ్‌కి ముచ్చెమటలూ పోయసాగాయి.




కంపించిపోతూన్నాడతడు.

★ ★ ★

చాలా అసూయగా ఉంది తరుణ్‌కి.

ఎవరు...? ఎవరు...? ఎవరా వ్యక్తి...?

దీపిక ఎందుకిలా దాగుడుమూతలాడు తోంది?

జెలసీకి అనుమానం కూడా తోడైతే నిప్పుకి గాలి జతపడినట్టు ఎన్ని ఘోరాలైనా జరిగిపోవడం తథ్యం!

తన దీపికని గోపికగా చేసి ఆడుకుంటూన్న ఆ కృష్ణమూర్తి అంతేమిటో చూడాలి!

అసలా కృష్ణమూర్తి ఉన్నాడా? లేక తన ఊహామూర్తేనా? అదీ తేల్చుకోలేకపోతున్నాడు.

అచ్చమైన సైకోలాగ తరుణ్ ఇప్పుడు అనుమానం అనే సైకిక్ డిజార్డర్‌తో బాధపడుతున్నాడు.

కాని తన డౌట్ క్లియర్ చేసుకోడానికీ, దీపిక ప్రవర్తనని ఓ కంట కనిపెట్టడానికీ అతడికి సరైన టైమింగ్స్ కుదరడంలేదు.

తాను ఎంతసేపు ఇంట్లో కూర్చోగలడు?

తానున్నంతసేపూ ఆమె తప్పుకొని తిరుగుతోంది.

భార్యను నిజాయితీగా ప్రేమించేవాళ్లకీ, మనస్సు నిర్మలంగా ఉంచుకొనేవాళ్లకీ అనుమానమనేదే అసలు కలుగదు.

తన ప్రేమలో ఎక్కడో లోపం ఉంది! లేదా... దీపిక ప్రవర్తనలోనే ఏదో తేడా ఉంది!

అది తేలీడం ఎలా?

తన సమస్యని గేమ్స్‌బాండ్ ముందుంచాడు తరుణ

ఏరి కోరి వరించిన అమ్మాయిమీద అభాండాలు వేస్తూన్న మిత్రుడిమీద పీకల్దాకా కోపం వచ్చింది బాండ్‌కి.

ముందు కొట్టి పారేశాడతడు. కాని తరుణ్ సీరియస్‌గా చెప్తూవుంటే, 'నిప్పులాంటి ఆ పిల్లమీద నిందలు వెయ్యడం నీలాంటివాడికి తగదు' అని హితవు చెప్పాడు. "అసలు నిన్ను... నిన్ను అనాలి! బుద్ధి తక్కువ పన్లు చేసేది నువ్వూను! పైగా ఆమెను అనడమూనా?" అంటూ చీవాట్లేశాడు.

అప్పటికీ "ససేమిరా వీల్లేదు... దీపిక సంగతులు ఎప్పటికప్పుడు నువ్వు కనిపెట్టి ఉండవలసిందే!" అంటూ ఆర్డర్ పాస్‌చేశాడు తరుణ్.

అన్యమనస్కంగానే అందుకు ఒప్పుకున్నప్పటికీ తప్పనిసరై దీపిక ప్రతి కదలికనీ అనుసరించసాగాడు గేమ్స్‌బాండ్.

మారువేషాల్లో ఆమెని ఫాలో చేస్తూ, ఓ వారం తర్వాత తన రిపోర్ట్ మిత్రుడి ముందుంచాడు అతడు.

"యస్! నీ డౌటు పాజిటివ్ వేలోనే ఉంది!" ఉపోద్ఘాతంగా అన్నాడు గేమ్స్‌బాండ్.

"చూశావా! నే చెప్పలేదూ! ఇంతకీ ఏ ఇన్సిడెంట్‌ద్వారా నిర్ధారణకొచ్చావ్? ఆ వ్యక్తి ఎవరు? రెడ్ హ్యాండెడ్‌గా పట్టుబడే ఛాన్స్‌లేమైనా ఉన్నాయా?" ప్రశ్నల వర్షం కురిపించాడు తరుణ్.

"ఆగాగు! ఒకేసారి ఇంత ఆత్రమా? నన్ను చెప్పనీయ్! ఆవిడను ఒకసారి కాదు, రెండుసార్లు కాదు, ఓ పదిసార్లయినా ఫాలోచేశాను. ఒకసారి టెలిఫోన్‌బూత్ దగ్గర ఎవరితోనో మాట్లాడుతూ కన్పించింది. ఫోన్ బైట. ఎందుకు చెయ్యాలి? ఇంట్లో ఫోనుందిగా! నెంబర్ టూ - స్నేహితురాల్తో కార్లో వెళ్తోంది. ఈవిడకీ, ఆమెకీ మధ్య ఓ పురుషుడున్నాడు. ఇంకోసారి నెక్లెస్‌లో రాళ్లేయించుకోడానికి ఓ జ్యూయలరీ షాపులో దూరింది. వెంట ఓ స్త్రీ మరో పురుషుడూ ఉన్నారు. సో..."

"సోది ఆపరా! నీ డిటెక్షన్ మండినట్టే ఉంది! నీ అతి తెలివి తిక్క చర్యలకి నాకు పిచ్చెక్కిపోతోంది. అసలు వ్యక్తెవరో చెప్పలేవుగానీ, ఆమె ఎక్కడికెళ్లిందో నాకు దేనికి?

సవాలక్ష పన్లమీద సవాలక్ష చోట్లకెళ్లొచ్చు! స్త్రీలూ, పురుషులూ ఆ సందర్భాల్లో వెంట ఉండొచ్చు! అదో గొప్ప సంగతా? నీవల్ల కాదులేగానీ నా తిప్పలేవో నేనే పడతాను!" అసహనంగా అక్కణ్నించి లేచి వచ్చేశాడు తరుణ్.

ఏది ఏమైనా ఒక్కటిమాత్రం నిజం...!

తన భార్య ఎవరితోనో తిరుగుతోంది. అదేదో స్వయంగా తానే తేల్చుకోదల్చుకున్నాడు తరుణ్.

★ ★ ★

షాపింగ్ సెంటర్లో సడెన్‌గా సౌందర్యని చూసి షాకయ్యాడు తరుణ్.

అలాగే తరుణ్‌ని చూసిన క్షణం సౌందర్య పరిస్థితి అంతే!

తరుణ్ సౌందర్యని ఆ ప్రదేశంలో, ఓ సేల్స్ డిమాన్‌స్ట్రేటర్‌గా చూడవలసి వచ్చినందుకు షాక్ తింటే, తరుణ్ కాపురంలో తాను చిచ్చుపెట్టగల నిజం అప్రయత్నంగానే తాను చెప్పాల్సి వచ్చినందుకు సౌందర్య గిల్టీ కాన్షస్‌తో షాక్ తింది.

కాని ఆమెకు తెలిని విషయం ఒక్కటె - తాను చెప్పిన రహస్యాన్ని దీపిక ఇంకా మనసులోనే దాచుకుందనీ, తన పేరు వెల్లడి చేయలేదనీనూ...

"అదేంటి సౌందర్యా! నీకీ జాబ్ చెయ్యాల్సిన ఖర్మేమిటి? క్రీగంట చూసి మగాడ్ని గింగిరాలు తిప్పించగల నీ స్ట్రక్చర్‌ని ఇలా వృధా చేస్తూ ఇక్కడ గడిపేయడమా? అంతగా డబ్బు అవసరమైతే నాకో ఫోన్ కొట్టలేకపోయావా? ఆరోజు పార్టీలో నువ్విచ్చిన ఆ అందమైన అనుభూతి నేనింకా మర్చిపోలేకపోతూన్నా! అదిసరే! అసలు పరిస్థితేంటి?" చొరవగా అడిగాడు తరుణ్.

తన భర్త జాబ్‌కి రిజైన్ చేసిన విషయం క్లుప్తంగా చెప్పి, "ఏం చెయ్యను డియర్! ఆయనదో వింత మనస్తత్వం! ఎక్కడా కుదురులేదు. ఒకే విషయంమీద కాన్సంట్రేషన్ చెయ్యడం తక్కువ. మరి నేనే ఏదో ఒకటి చెయ్యాలిగా!" అంది సౌందర్య.

"అరె! ఈ చేసే జాబ్ ఏదో మా ఫ్యాక్టరీలో నే చేద్దువుగాని... వచ్చెయ్యకూడదూ?"

"అమ్మో! కూడదు! రేపెప్పుడైనా మీ శ్రీమతి కంట పడితే ఇంకేమైనా ఉందా?"

ఓ బాణం చీకట్లోకి విసిరినట్టు ఆ డైలాగ్ వదలి తరుణ్ రెస్పాన్స్ కోసం ఆగింది సౌందర్య. ఆమెకింకా ఏ మూలనో చిన్న శంక ఉండిపోయింది. దీపిక తన స్నేహితురాలు కనుక తనవల్ల ఆ సంగతి ఎక్కడ లీక్ అయిందో చెప్పే ఉంటుందని.

"కరెక్ట్! నువ్వన్నదీ నిజమే! పోనీ ఓ పని చేద్దాం! ఆ జాబ్ ఏదో మీ శ్రీవారికే ఇద్దాం!"

దాంతో ఆమె గుండెల్లో గుబులు క్రమంగా దూరమైంది. అంటే దీపిక ఏమీ చెప్పలేదన్నమాట! తానెంత భయపడింది. హమ్మయ్యా! అనుకుంది సౌందర్య.

ఇప్పుడామెకి తరుణ్‌ని తనకు అనుకూలంగా వాడుకోవాలని, ఆడుకోవాలనీ అన్పించసాగింది.

"బట్.. మై స్వీట్ తరుణ్! ఆయన ఓ కంపెనీకి డైరెక్టర్‌గా చేసివున్న వ్యక్తి! ఏదో జాబ్ ఆయన చెయ్యరు! లెవెల్ తక్కువ పన్లు చెయ్యగలరా?"

"ఐసీ! సరే హైలెవల్ పొజిషనే ఇద్దాం! సర్‌ప్రయిజింగ్‌గా అపాయింట్‌మెంట్ లెటర్ ఇంటికి పంపించనా?"

"థాంక్యూ! నీదెంత మంచి మనస్సు తరుణ్! నువ్వాపని చెయ్! నేనూ సర్‌ప్రయిజింగ్‌గా ఈ సర్‌కి మళ్లీ మర్చిపోలేని మధురానుభూతి అందిస్తా!"

అన్నట్టుగానే ఓ సెక్షన్‌కి సౌందర్య భర్త వినయ్‌ని మేనేజర్ని చేసి ఆ మర్నాడే తన మాట నిలబెట్టేసుకున్నాడు తరుణ్.

అందుకు దీటుగా సౌందర్య కూడా కృతజ్ఞ




తతో కిరణ్‌కి మధురమైన జ్ఞాపకం మిగిల్చింది అతనింట్లో స్వంత బెడ్‌రూంలోనే!

ఆ సమయంలో దీపిక హాస్పటల్‌లో ఉన్న హృషీకేశ్‌గార్ని చూడటానికి వెళ్లింది.

ఆయన గత కొద్దికాలంగా డాక్టర్ల పర్యవేక్షణలోనే ఇన్‌పేషెంట్‌గా జాయినై ఓ స్టార్ నర్సింగ్‌హోంలో రెస్ట్ తీసుకుంటున్నారు. జబ్బేమీ లేదుగాని ఏదో ఉందన్న సందేహం! అంతే.

సర్‌ప్రయిజింగ్‌గా తరుణ్ ఇంట్లోనే సరసం చేసే సాహసం సౌందర్య చెయ్యడానికి కారణం దీపిక తనకు ఫ్రెండ్ కనుక ఆ ఇంటికి ఎప్పుడైనా ఏ సమయంలోనైనా యధేచ్ఛగా రాకపోకలు సాగించగల స్వేచ్ఛ ఉండటమే.

దీపిక ఇంట్లోలేని అవకాశాన్ని ఆమె ఆ విధంగా వాడుకుంది.

కాని తమ బెడ్‌రూం భాగోతం ఆమెకంట పడలేదనీ పడే అవకాశం లేదనీ తరుణ్, సౌందర్యలు భావించారు. అంత తొందరగా ఆమె అప్పుడు రాదని అనుకున్నారు. అయితే దీపిక సరిగ్గా ఆ సమయంలోనే వచ్చింది. ఏ దృశ్యాన్ని ఇంతకాలం చూడలేదో ఆమె అదే దృశ్యాన్ని తన కళ్లతో తానే స్వయంగా చూసింది.

దీపిక మనసు వికలమైపోయింది. తరుణ్ అలా ప్రవర్తించినందుకు మాత్రమే కాదు! భార్యాభర్తలయిన తామిరువురికే పరిమితం కావాల్సిన శయ్య అపవిత్రం అయిపోయినందుకు!

ఈ వైనమంతా ఒకరిలో ఒకరు లీనమై మైమరిచిపోయిన ఆ స్వేచ్ఛా శృంగార జీవులకు ఇసుమంత కూడా తెలీదు.

అప్పట్నుంచి తరుణ్ బలహీనత ప్రత్యక్షంగా తాను చూసిన దగ్గర్నుంచి అంతకు అంతా ప్రతీకారం తీర్చుకోవాలనుకుంది దీపిక.

★ ★ ★

దీపిక తనను వంచిస్తోందనే అనుమానంతో రగిలిపోతూ వున్న తరుణ్ కూడా అదే తరహా ఆలోచనలో ఉన్నాడు. అయితే తేడా ఒక్కటే!

ఒకరిది పూర్తిగా నిరాధారమైన అనుమానం!

మరొకరిది అక్షరాలా ప్రత్యక్ష ప్రమాణం!

★ ★ ★

అప్పటికే రెండుసార్లు దొరికినట్టే దొరికి, కార్లో జారిపోయిన తరుణ్‌మీద పీకల్దాకా కసిగా ఉంది గూండాగ్యాంగ్‌కి. "ఏం చెయ్యడం బాస్?" అంటూ జట్టు నాయకుడైన జుట్టు పోలిగాడికో ఫోన్ కొట్టి సలహా అడిగితే, అతడు అడ్డమైన బూతులూ తిట్టి "వాణ్ణి సఫా చెయ్యకుండా మీలో ఎవరు నా కంటబడ్డా కైమా చేస్తా'' అంటూ రిప్లయ్ ఇచ్చాడు.

ఈసురోమంటూ, మళ్లీ వాళ్లు వేటలో పడ్డారు.

★ ★ ★

తనకే స్వంతం అనుకున్నవారు, తనను కాదని వేరొకరితో ప్రణయం కొనసాగిస్తూంటే ఎంతటి సహనమూర్తులైనా సహించలేరనడానికి దీపికే తార్కాణం.

భర్తల్ని వంచించే భార్యలూ భార్యల్ని మోసం చేసే భర్తలూ ప్రపంచం మీద ఎక్కడ లేరు?

నిజాలనిగ్గుతేల్చి అలాంటి వాళ్లని ఆదుకోడానికే ప్రత్యేకంగా కొన్ని డిటెక్టివ్ ఏజన్సీలు ఇతర దేశాల్లో బయలుదేరాయి. తమ భాగస్వాములు బయట వెలగబెట్టే రాణికార్యాలో రాచకార్యాలో ఆరా తీయాలనే అనుమాన పీడితులకి సాయపడుతూ ఈ ఏజన్సీలు సదరు భర్తల లేదా భార్యల చాటుమాటు శృంగారాలు బయటపెడుతుంటాయిట!

బర్మింగ్‌హామ్‌లోని ఫిమేల్ ఇన్‌వెస్టిగేషన్ సర్వీసెస్ సంస్థ కేవలం మహిళల కోసమే





పనిచేస్తోందట.

ఇక్కడకు ఏ అనుమానపు భార్య అయినా వచ్చి తన పతిదేవుడి గురించి కూపీ తీయమంటే ఏజన్సీకి చెందిన అందమైన మహిళా డిటెక్టివ్‌లు ఎగిరి గంతేసి రంగంలోకి దిగుతారట!

ఇలాంటి ఏజన్సీలు లండన్, న్యూయార్క్ నగరాల్లోనూ ప్రారంభమయ్యాయిట.

తనని ఆదుకోడానికి ఇక్కడా ఇలాంటి ఏజన్సీ ఒకటి ప్రత్యేకంగా ఉంటే ఎంతో బాగుండేదికదా అనుకుంది దీపిక ఆ న్యూస్ బిట్ చదివాక.

అయినా ఆ లేడీ డిటెక్టివ్స్ మాత్రం ఏం చేస్తారు. రకరకాలుగా తమ అందాల్ని ఎరగా వేసి, నిక్ ఆఫ్‌ది మూమెంట్‌లో అనుమానం వున్న శ్రీమతికి ఆవిడ భర్తని అప్పచెప్తారు అంతేగా! దాంతో సమస్య తీరిపోతుందా?

ఘాటైన గుణపాఠం చెప్పి, దారికి తేగలిగిన సంస్థ ఏదైనా ఉంటే బాగుండును. అసలు ఆ ప్రయత్నమేదో తానే ఎందుకు చెయ్యరాదూ? అన్పించింది దీపికకు. ఆ ఆలోచన వచ్చిన వెంటనే ఆమె ఆ దిశగా ప్రయత్నం ప్రారంభించింది.

భర్త తన ధోరణే భార్యకూ ఉంటుందని ఉలిక్కిపడడంలో వింతేమీలేదు. ఈమధ్య తాను తరుణ్‌ను అబ్జర్వ్ చేస్తూ ఈ విషయం గ్రహించింది కూడా!

భుజాలు తడుముకుంటున్న గుమ్మడికాయల దొంగ చందంలా ప్రవర్తించే తరుణ్ చర్యల్ని అతడి ధోరణిలోనే ఎదుర్కోవాలని పథకం వేసుకుంది దీపిక.

భార్యని ట్రాప్ చేద్దామని వినయ్ పేరుతో గొంతు మార్చి కవ్వింపుగా తరుణ్ ఇంటికి చేసే ఫోన్ కాల్స్‌ని మొదట్లో ఆమె అంతగా పట్టించుకోనప్పటికీ తర్వాత ఆ వైపు కాల్స్ వచ్చినపుడు అంతకంటే రెట్టింపు కవ్వింపుతో రెస్పాన్స్ ఇచ్చి తరుణ్‌ని మరింత రెచ్చగొట్టడంలో కృతకృత్యురాలైంది ఆమె.

దాంతో దీపికకి కూడా ఏవో ఎఫైర్స్ ఉన్నాయనే బలమైన నమ్మకానికి వచ్చేశాడు తరుణ్.

★ ★ ★

భర్త మనస్తత్వాన్ని అంచనా వేస్తున్న దీపికకి, అతడు తన పట్ల కూడా ఇదే తరహా అనుమానాన్ని కలిగి ఉన్నాడని బోధపడింది. ముఖ్యంగా సౌందర్య భర్త అయిన వినయ్‌తో తనకేదో సంబంధం ఉన్నట్టు, అతడు భావిస్తున్నాడనీ ఆమె అర్థం చేసుకోగలిగింది.

అతడ్ని మరింత కవ్వించడానికే తాను కూడా వీలైనంత వరకు అతడి అనుమానానికి ఊపిరి పొయ్యడానికే ప్లాన్ చేసుకున్న దీపిక దొరికిన ప్రతి ఛాన్స్‌నీ వినియోగించుకోసాగింది.

ఆమె ఉద్దేశం ప్రకారం "భార్య అన్నిటా భర్తను అనుసరించాలని ప్రతి మగాడూ కోరుకుంటాడు, ఒక్క క్యారెక్టర్ విషయంలో చెడు తిరుగుళ్ళ వ్యవహారం మినహా! తానెంత మంది స్త్రీలతోనైనా సంబంధాలు కలిగి ఉండొచ్చు! కాని భార్య మాత్రం పరపురుషుణ్ణి కన్నెత్తి అయినా చూడకూడదు! సరిగ్గా అలాంటి ఆలోచనలే ఉన్న తన భర్తకి "పూర్ డార్లింగ్! క్యారెక్టర్ అనేది ఇద్దరికీ ఇంపార్టెంటే సుమా!" అని అర్థం అయ్యేలా తెలీజెయ్యాలి. అదే ఆమె తపన.

తన గ్లాస్ ఛాంబర్లోంచి వినయ్‌ని అబ్జర్వ్ చేస్తున్నాడు తరుణ్. అతడు ఏదో నెంబర్ తిప్పి ఫోన్‌లో మాట్లాడడం.. ఎంతో లవ్లీగా అవతలివైపు కంఠానికి రెస్పాండ్ అయి నవ్వుతుండడం.. పావుగంట దాటినా ఫోన్ వదలకపోవడం ఇవన్నీ చూస్తూ ఉక్రోషం పట్టలేకపోసాగాడు తరుణ్.

సరిగ్గా అప్పుడే అతనికో ఐడియా వచ్చింది.

బహుశా ఈ ఫోన్ దీపికకే అయి వుంటుంది.

ఎందుకైనా మంచిదని, ఆ సంగతి తేల్చుకోడానికి వేరే ఫోన్‌మీద తన ఇంటి నెంబర్‌కి డయల్ చేశాడు.

ఫోన్ ఎంగేజ్డ్...

సరిగ్గా వినయ్ ఫోన్ పెట్టేసిన వెంటనే, మళ్లీ రింగ్ చేశాడు. ఈసారి వెంటనే లైన్ దొరికింది.

సో... సందేహం లేదు... వినయ్ ఫోన్ చేసింది దీపికకేనని, తన అనుమానం మరింత బలపరుచుకున్నాడు.

రెండు రోజులు పోయాక...

వినయ్‌ని ఏదో మీటింగ్‌కి వేరే ఊరు పంపించి గొంతు మార్చి అతడిలాగే భార్య దీపికకి ఫోన్ చేశాడు తరుణ్.

"హల్లో వినయ్! ఏంటి కబుర్లు? అయినా ఇప్పుడమ్మా ఫోన్ చేయడం? అరె! అన్నట్టు మీ బాస్ అక్కడ ఛాంబర్లో లేడా? ఉంటే మాత్రం ఏం చేస్తాడని కదూ! ఎందుకంటే ఆయనదీ మన కేటగిరీయేకదా!" నవ్వుతూనే రెచ్చిపోయి మాట్లాడుతున్న దీపిక చర్యకి ఉడికిపోతూ పీక పిసికి చంపెయ్యాలన్నంత కసితో కాగిపోతున్నాడు తరుణ్.

"భార్యల్ని నమ్మొద్దు బ్రదర్... ఎవరూ కారు మేడ్‌ఫర్ ఈచ్ అదర్' అంటూ సోలో సాంగ్ అందుకున్నాడు తరుణ్.

★ ★ ★

రాంపండుతో మాట్లాడి నిజం తెల్సుకున్న పల్లవి, ఆశ్చర్యపోతూ "ఇది నిజమా సార్! అయితే ఆయన చరణ్ కాదన్నమాట! అదీ సంగతి! అందుకా ఆయన తప్పుకొని తిరుగుతున్నారు?" అంది.

"అవునమ్మా! చరణ్ ఏమయ్యాడన్న సంగతి ఇంకా తేలలేదు. అతడి ఆచూకీ కనిపెట్టమని, ఓ ప్రయివేట్ డిటెక్టివ్‌ని కూడా మేం ఎంగేజ్ చేశాం!" అన్నాడు రాంపండు.

"ఎవరాయన?"

"డిటెక్టివ్ గేమ్స్‌బాండ్!"

"ఓహ్! ఆయనా?"

"నీక్కూడా తెలుసా?"

"ఆయన అసిస్టెంట్ రాణి, నా చిన్నప్పటి స్నేహితురాలు. ఎలిమెంటరీ క్లాసెస్ ఇద్దరం కలిసే చదువుకున్నాం"

"గుడ్! ఇంకా డౌట్ ఏమన్నా ఉంటే సంప్రదించు, బాండ్‌ని"

"డౌటేం లేదుకాని ఆయన గురించిన ఆచూకీ ఏమన్నా తెల్సిందో లేదో ఓసారి ఎంక్వయిరీ చేసి రావాలి! సరేగాని సార్! నేను ఇంట్లో ఘర్షణపడి బైటికొచ్చేశాను. నాకు ప్రొటెక్షన్ కావాలి! మీరు నాకు తండ్రిలాంటి వారు! ఓ ప్రిన్సిపాల్‌గా మీ శిష్యురాలికి మాత్రం ఆశ్రయం కల్పించగలరా?"

"ష్యూర్! మా ఇంట్లో నిరభ్యంతరంగా ఉండొచ్చు!" హామీ ఇచ్చాడు రాంపండు.

అదే రోజు సాయంత్రం, చరణ్ గురించిన సమాచారం ఏమయినా తెల్సిందేమో కనుక్కుందామని గేమ్స్‌బాండ్‌ని కలిసింది పల్లవి.

మాటల్లో తన తండ్రి పంపిన గూండాలు తరుణ్‌ని చరణ్‌గా భావించి ఏ ఆపదైనా తలపెట్టవచ్చునని పల్లవి చెప్పడంతో తన ఫ్రెండ్ ప్రమాదంలో పడబోతున్నాడన్న ఆదుర్దాకొద్దీ పల్లవిని వెంటబెట్టుకుని నీరసంగా తరుణ్ దగ్గరకొచ్చాడు గేమ్స్‌బాండ్.

పల్లవిని చూస్తూనే ఐస్ అయిపోయినా అంతలోనే తమాయించుకున్నాడు తరుణ్.

ఆదరాబాదరాగా వచ్చిన బాండ్‌ని ఒక్క ముక్కకూడా మాట్లాడనీయకుండా తాను దీపికని ట్రాప్ చేసి టెస్ట్ చేసిన వైనం ఆపకుండా పూసగుచ్చినట్టు వివరించి "అబ్బబ్బ! ఈ సమస్యతో సతమతమై చచ్చిపోతున్నానా బాబూ!" అని ముక్తాయించాడు తరుణ్.




"ఇప్పుడు మరో కొత్త సమస్య వచ్చి పడింది సార్! మా నాన్న ఏర్పాటు చేసిన గూండాలు మీరే చరణ్ కాబోలునని ఏక్షణా న్నైనా దాడిచేయడానికి రెడీగా ఉన్నారు. అవకాశం కోసం తెగ తిరుగుతున్నారు. ఎందుకైనా మంచిది! మీ జాగ్రత్తలో మీరుండండి! అది చెప్పడానికే వచ్చాను!" అంది పల్లవి ఎంతో నమ్రతగా.

"చచ్చాంరా బాబూ! ఈ రామాయణంలో అదో పిడకల వేటా?" తలపట్టుకున్నాడు తరుణ్.

"కాదు! కాదు పీడ కలలవేట" సవరించాడు గేమ్సుబాండ్.

★ ★ ★

డాక్టర్ దత్తాత్రేయ, తనకు తెలిసిన అన్ని రకాల మూలికా వైద్యాలతోనూ వివిధ ఆయుర్వేద పద్ధతులతోనూ ఎంతో శ్రద్ధగా చేసిన చికిత్సలకి క్రమేపీ కోలుకున్నాడు చరణ్.

అతడికి పూర్తి స్వస్థత చేకూరడానికి నాలుగున్నర మాసాలు పట్టింది.

దెబ్బ తగిలిన వెంటనే రక్తం గూడుకట్టుకుపోయి, సరైన సమయానికి చికిత్స అందక కొంత టైమ్ గడిచిపోవడం, నీళ్లలో కొట్టుకుపోవడంవల్ల తగిలిన దెబ్బలు చీము పట్టిపోవడం... ఇలాంటి అవాంతరాలవల్ల వెంటనే కోమాలోకి వెళ్లిపోయిన చరణ్ అంతకాలానికి పరిపూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు.

రెండు చేతులూ జోడిస్తూ "అపర ధన్వంతరిలా అహర్నిశలూ నన్ను కనిపెట్టుకుని వైద్యం చేసి నాకు పునర్జన్మని ప్రసాదించిన అమృతమూర్తులు మీరు. ఏం చేసినా మీ రుణం తీర్చుకోవడం కష్టం!" కృతజ్ఞతా సూచకంగా అన్నాడు చరణ్.

"ఇదో పెద్ద ఘన కార్యమా నాయనా! అసలు నిన్ను రక్షించుకోవడం, స్నేహధర్మానికి కట్టుబడిన వ్యక్తిగా నా బాధ్యత కూడా! ఇక రుణం తీర్చుకోవడంలాంటి పెద్దపెద్ద మాటలేం నువ్వు ప్రయోగించక్కర్లేదు బాబూ! మా దీపిక మెళ్లో ఆ మూడు ముళ్లూ వేస్తే చాలు!" అన్నాడు దత్తాత్రేయ.

"నా ప్రాణాలు కాపాడిన కృతజ్ఞతకొద్దీ, మీరేం చేయమన్నా అది చేస్తాను. ఏం చేసినా అది తక్కువే అవుతుంది! కానీ నేనెవర్నో ఏమిటో ముక్కూమొహం తెలీకుండా నాకో పిల్లనిచ్చి కట్టబెట్టాలనుకుంటున్నారంటే..."

చరణ్ మాటలకు అడ్డొస్తూ, "ఆపవయ్యా! అక్కడ ఆపు!" అన్నాడు దత్తాత్రేయ.

చరణ్ అంతవరకూ దీపిక అనే అమ్మాయి ఆయన కూతురే ననుకుంటున్నాడు.

"ఆగక్కడ! దీపిక ఎవరో మర్చిపోయిన వాడిలా మాట్లాడతావేమిటయ్యా తరుణ్! నీలాంటి విద్యావంతుడు అనదగ్గ మాటేనా ఇది? ఆ పిల్ల నీమీదే అన్ని ఆశలూ పెట్టుకుంది. హృషీకేశ్‌గారు నీకు మున్ముందు ఏకంగా తన ఫ్యాక్టరీనే రాసిచ్చేద్దామనుకుంటున్నారు'' అంటున్న దత్తాత్రేయవంక తేరిపారజూస్తూ "అయ్యా! క్షమించాలి! ఆగవలసింది నేను కాదు మీరే! ఎందుకంటే మీరు పొరబడి ఒకరికి బదులుగా ఒకర్ని గూర్చి మాట్లాడుతున్నట్టున్నారు, నా పేరు తరుణ్‌కాదు! చరణ్! పండూ ట్యుటోరియల్స్ అండ్ టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో లెక్చరర్ని!"

"మతి ఉండే మాట్లాడుతున్నావా?"

"మీ చికిత్సవల్ల అంతా బాగయిందనే అనుకుంటున్నాను. ఇప్పుడు మీ మాటలకే నాకు మతిపోతోంది''

"నీక్కాదోయ్! నాకు నాకు మతిపోతోంది! నిక్షేపంలాగ, అంచక్కని పెద్ద పొజిషన్లో ఫ్యాక్టరీ రన్ చేస్తోన్న పెద్దమనిషివి ప్లేటు ఫిరాయించి లెక్చరర్ని అంటావేం?"

"అయ్యా! వైద్యాచార్యా! మీరు కన్ఫ్యూజైపోయి నన్ను కన్‌ఫ్యూజ్ చేసేస్తున్నారు. నేను ముమ్మాటికీ చరణ్ అనబడే ఓ బడి పంతుల్ని! మీరు చెప్తున్న దీపిక అనే శాల్తీని

ఇంతవరకూ నేను కలలో కూడా చూడలేదు, నేను చూసిందల్లా ఒక్క పల్లవి అనే పిల్లని మాత్రమే! అదీ ఆమె నన్ను వదలకుండా జిగురులా పట్టుకోబట్టి సరా?"

"లేదు లేదు! ఇదంతా ఏదో డ్రామా! అసలు నేనే పొరపాటు చేశాను. నువ్వాస్థితిలో నా దగ్గరికి చేరిన వెంటనే నా ఫ్రెండ్ హృషీకీ వాడి కూతురు దీపికకీ కబురు పంపి ఉండాల్సింది. కంగారుపడతారని తాత్సారం చేశాను. తీరా ఇప్పుడు నువ్వు వాళ్లెవరో ఎరగనట్టు మాట్లాడుతున్నావ్!"

"నిజం డాక్టర్‌గారూ! మీరు నమ్మకపోతే నాతోరండి! నేనెవరో ఏమిటో ప్రూవ్ చేసుకుంటాను''

"ఆల్‌రైట్ అదే బెస్ట్ పద"

చరణ్‌ని వెంటబెట్టుకుని డాక్టర్ దత్తాత్రేయ నగరానికి ప్రయాణం కావడానికే నిర్ణయించుకుని డేట్ ఫిక్స్ చేసుకున్నాడు.

★ ★ ★

సరిగ్గా అదే రోజు...

తరుణ్‌తో ఇక తన దాగుడుమూతలకి ఫుల్‌స్టాప్ పెట్టేయాలని చివరికి నిర్ణయించుకుంది దీపిక.

అనుకున్నట్టుగానే ఈసారి గొంతు మార్చి వినయ్ పేరుతో తన భర్త తరుణ్ చేసిన ఫోన్‌కి ప్రతిస్పందిస్తూ "హోటల్ హెవెన్ రూమ్‌నెంబర్ ఫైవ్ నాట్ ఫైవ్‌లో కలుసుకో'మని అపాయింట్‌మెంట్ ఫిక్స్ చేసిందామె.

భర్త చాటున పరపురుషుడితో సరసానికి సై అంటూ హోటల్ రూమ్‌కి ఆహ్వానిస్తుందా! దీనిపని చెప్తా! అంటూ పళ్లు నూరుతున్న తరుణ్‌ని కలవడానికి వచ్చాడు గేమ్స్‌బాండ్.

"చూశావా! నా తడాఖా.. మొత్తం మీద నా అనుమానమే నిజమైంది! దోషిని పట్టుకోబోతున్నాను'' బిగ్గరగా నవ్వి, అదే హాల్లో గోడకి అందంగా అలంకరించిన పాతకాలం నాటి ఖడ్గాల జత డాలు సెట్‌లోంచి ఓ కత్తి ఛర్రున బైటికి లాగి, "ఈ కత్తివేటుతో నా అనుమానాన్ని పటాపంచలు చేస్తా!" అంటూ వీరోచితంగా కత్తి తిప్పసాగాడు తరుణ్.

"చాల్లే సంబడం! దీపిక ఎంతటి సౌమ్యురాలు? ఎంత సహనశీలి? ఆమె కాబట్టి నీలాంటి తిరుగుబోతుని ఇంతకాలం ఉపేక్షించింది, నీ అంతట నువ్వే మారతావని. నీలో ఎలాంటి మార్పూ లేకపోగా, పైగా ఆమె మీద లేనిపోని అభాండాలూ, అపనిందలూ వెయ్యడమే కాకుండా నీ అనుమానంతో ఇప్పుడేకంగా ఆవిడ్ని చంపెయ్యడానికే తయారవుతున్నావ్! తొందరపడుతున్నావురా ఒరేయ్! కాస్త తమాయించుకో!"

గేమ్స్‌బాండ్ ఎంత చెప్తూన్నా వినిపించుకోకుండా, "సర్లే! నీ వెర్షనే రైటో నా వోర్షనే కరెక్టో తెలియాలంటే ఫాలోమీ'' అనేసి కత్తిని కార్లో బ్యాక్‌సీట్‌లో పారేసి స్టీరింగ్ ముందు కూర్చున్నాడు తరుణ్.

సర్రున దూసుకుపోతున్న కారును ఆపే ప్రయత్నం చేస్తూ "ఆగరొరేయ్!" అంటున్న గేమ్స్‌బాండ్ మాటలు వృధా అయ్యాయి. కారు అప్పటికే ఫర్లాంగు దూరం వెళ్లిపోయింది.

★ ★ ★

తన ఆహ్వానాన్ని మన్నించి, అనుమానంకొద్దీ తరుణ్ తప్పకుండా వస్తాడని, అతడ్ని ఆశ్చర్యంలో ముంచెత్తాలనీ ప్లాన్ చేసుకున్న దీపిక అద్దం ముందు నిలబడి, తన అలంకరణకు ఫినిషింగ్ టచెస్ ఇచ్చుకుంటోంది.

కొసమెరుగులు దిద్దుకోవడం పూర్తయ్యాక సంతృప్తిగా తనని తాను ఓకే అనుకుని ఫోన్ దగ్గరికి వెళ్లి "హలో! ఈ నెంబర్‌కి కనెక్షన్ ఇచ్చి సౌందర్యని పిలవండి'' అంటూ హోటల్ రిసెప్షనిస్ట్‌కి ఓ నెంబరిచ్చి, ఫైవ్ నాట్ ఫైవ్ సూట్‌లో అటూఇటూ పచార్లు




చేయసాగింది దీపిక.

రెండు నిముషాల్లో కనెక్షన్ దొరికి, సౌంద ర్య లైన్‌లో ఉండడంతో "మేడమ్! మాట్లా డండి'' అంది రిసెప్షనిస్టు.

"హలో! ఎవరూ సౌందర్యేనా? నేను దీపికని! హొటల్ హెవెన్‌నుంచి మాట్లాడు తున్నాను. వెంటనే 505 రూమ్ నెంబర్‌కి వచ్చేసెయ్! ఎందుకూ ఏమిటి అని అడ క్కు'' ఫోన్ పెట్టేసింది దీపిక.

★ ★ ★

తరుణ్‌ని ఫాలో అవుతున్న గూండాలు, ఓ కాలనీ వీధి మలుపులో ఓ పార్కు కార్నర్‌లో అతన్ని అటాక్ చేశారు.

స్కూటర్లు అడ్డంగా ఆపి, నలుగురూ ఒక్కసారిగా విరుచుకుపడ్డంతో తరుణ్‌కి వా ళ్లతో ఫైట్‌సీన్ తప్పనిసరైంది.

అందుబాటులో ఉన్న ఆయుధం కావ డంతో కారు బ్యాక్‌సీట్‌లోంచి ఛర్రున కత్తి దూసి వాళ్లతో తలపడ్డాడు. చిత్రవిచిత్రంగా కత్తితిప్పుతూ జానపద చిత్రాల్లోని కత్తియుద్ధా న్ని తలపింపజేశాడు తరుణ్.

"అరె! వీడుత్త బుద్ధూ అనుకున్నాం! ఇంత బలం, తెగువా వీడికెప్పుడొచ్చిందిరా భాయ్?" అంటూ పడుతూ లేస్తూ ఇద్దరు దౌడు తీశారు. మరో ఇద్దరు చిత్తుగా తన్నులు తిని మూల్గుతూ చెరోవైపూ పడ్డారు.

ఈ హొరాహొరీ పోరాటంలో దురదృష్ట వశాత్తు కత్తి కారు టైర్‌కి గుచ్చుకుపోయి, గాలి పూర్తిగా పోయింది. కారు కదలదని తెలీడంతో పళ్లు నూరుతూనే గూండాలు ఎక్కివచ్చిన ఓ స్కూటర్‌ని స్వాధీనం చేసు కుని కత్తిమాట అక్కడే మర్చిపోయి రివ్వున దూసుకుపోయాడు తరుణ్.

★ ★ ★

దూకుడుగా తనని ఫాలోమీ అంటూ వెళ్లిపోయిన తరుణ్‌నెలా వెంబడించాలో అర్థంకాక క్షణంపాటు బుర్ర బ్లాంక్ అయిపో యింది గేమ్స్‌బాండ్‌కి.

అంతలోనే తేరుకుని, ప్రిన్సిపాల్ రాంపండు దగ్గరికి తన డొక్కువాహనంమీద బయల్దేరి వెళ్లి విషయమంతా వివరించాడు గేమ్స్‌బాండ్.

"ఐసీ అలా జరిగిందా? ఇప్పుడేమిటి దారి?" అంటూ మీనమేషాలు లెక్కెడుతున్న రాంపండుని కుదిపేస్తూ ఆయన రక్షణలో ఆశ్రయం పొందుతున్న పల్లవి "ఓ ఐడి యాసార్! మనం ఇప్పుడు అర్జెంటుగా దీపికని రక్షించాలంటే ఒకే ఒక్కదారి! వాళ్ల ఫాదర్ హృషీకేశ్‌గార్ని అర్జెంటుగా కూతురి దగ్గరకు పంపించే ఏర్పాటు చెయ్యడమే!" అంది.

"గుడ్! అన్నట్టు ఆయన ఆ హొటల్‌కి దగ్గర్లోనే ఉన్న ఓ నర్సింగ్‌హోంలో బెడ్‌రెస్ట్ తీసుకుంటున్నారు. ఉండండి! ఇదీ ఫోన్ నెంబర్!" గబగబా జేబులోంచి ఓ పాకెట్ ఫోన్ నెంబర్స్ బుక్ తీసి ఓ నెంబరు చెప్పాడు గేమ్స్‌బాండ్.

ఆ నెంబర్‌కి డయల్ చేయసాగింది పల్లవి.

★ ★ ★

సౌందర్య భర్త వినయ్ అప్పుడే సరిగ్గా క్యాంప్‌నుంచి తిరిగొచ్చాడు. సౌందర్య ఆందోళనగా "దీపిక ఏదో అత్యవసర పరిస్థి తిలో ఉన్నట్టుంది వినయ్! హొటల్ రూం నుంచి ఫోన్ చేసింది! ఎలా వెళ్లాలా అను కుంటుంటే సమయానికి దిగబడ్డావు! శ్రమ అనుకోకుండా కాస్త నన్నక్కడ డ్రాప్ చేద్దూ! నీకు పుణ్యం ఉంటుంది'' అంది.

ప్రాధేయపూర్వకంగా అడుగుతూన్న సౌందర్య అభ్యర్థనని కాదనలేక ఆమెని ఎక్కించుకుని స్కూటర్ స్టార్ట్ చేశాడు హొటల్ హెవెన్‌వైపు.

★ ★ ★

సరిగ్గా పల్లవి ఫోన్ చేసే సమయానికి- రిసీవర్ అందుకున్నాడు చరణ్.

వాళ్లంతకు ముందు కొద్దిసేపటి క్రితం హృషీకేశ్‌గారి దగ్గరకు చేరుకుని విషయం వివరిస్తూన్నారు.

ఇంతలో ఫోన్ రావడంతో, దగ్గర్లోనే ఉన్నందున అందుకున్న చరణ్ "హలో! ఎవరు కావాలి?" అని అడిగాడు.

అతడి అమాయకమైన కంఠస్వరాన్ని గుర్తుపట్టి "హేయ్! చరణ్‌జీ. వాటె సర్‌ప్రయిజ్? మీరేమిటి? అక్కడేం చేస్తున్నారు? నేను పల్లవిని! అబ్బ! నాకెంత సంతోషంగా ఉందో, ఫోన్లో చెప్పలేను'' అంటూ ఇటు పల్లవి డాన్స్ చేసేస్తుంటే- "ఏమ్మా? ఏమిటా



ఆనందం?" అడిగాడు రాంపండు.

"సార్! సార్! మన చరణ్‌జీ... అక్కడ హృషీకేశ్‌గారి దగ్గర ఫోన్లో దొరికారు సార్!" ఆనందంగా చెప్తోంది పల్లవి.

"అలాగా! ఏదీ-ఇటివ్వమ్మా! నేను మట్లాడతాను'' అంటూ ఆత్రపడబోతూన్న రాంపండుని ఆపి, గేమ్స్‌బాండ్ "పరామర్శలూ, కుశలప్రశ్నలూ తీరిగ్గా తర్వాత ఏడవ్వొచ్చు. అక్కడో అమ్మాయికి ప్రాణంమీదిక

చ్చేలా ఉంది. ఆ సంగతి చూడండి ముందు!" అంటూ ఉరిమిచూశాడు అసహనంగా.

అటు- చరణ్ కూడా పల్లవి గొంతు గుర్తుపట్టి "ఆం! ఇలా వచ్చేనో లేదో అప్పుడే నీ కళ్లబడ్డానా? ఓర్నాయినో!" అని, మౌత్‌పీస్‌కి చెయ్యి అడ్డంపెట్టి, "చూడండి డాక్టర్‌గారూ! నామాట అబద్ధమేమో మీరే చూడండి. నగరంలోకి ఇలా అడుగుపెట్టి అరగంటైనా అయిందో, లేదో ఆ పల్లవి అనే పిల్ల ఒళ్లంతా కళ్లు చేసుకుని నన్ను ఫోన్లో దొరకబుచ్చుకుంది! మీరే వినండి!" అంటూ రిసీవర్ డాక్టర్ దత్తాత్రేయ కివ్వబోయాడు.

"ముందా అమ్మాయి ఎవరో- నాకోసం నర్సింగ్‌హోమ్ కెందుకు ఫోన్ చేసిందో కనుక్కోండి ముందు!" వాళ్లమాటలేవీ అర్థంకాక తెల్లబోయి చూస్తున్న హృషీకేశ్‌గారే రిసీవర్ అందుకున్నారు.

"సార్! హృషీకేశ్‌గారున్నారా?"

"నేనేనయ్యా బాబూ! ఇంతకీ మీరెవరు?"

"అరె! గొంతు మారినట్టుందే- చరణ్ కాదుకదా!" రాంపండు సందేహం.

నెత్తి మొత్తుకుంటూ "అబ్బ! నువ్వెవరయ్యా తండ్రీ! చరణ్ అనే కుర్రవాడు ఇక్కడే ఉన్నాడుగాని, అసలు మీకెవరు కావాలి? ఏమిటి సంగతి?"

"నన్ను రాంపండు అంటారు సార్!"

"రాంపండో, జాంపండో ఏదో పండు. విషయమేమిటో చెప్పు?"

"మీ అమ్మాయి దీపిక... చాలా పెద్ద ఆపదలో చిక్కుకుందని తెలిసిందండి. మీరు అర్జెంట్‌గా హోటల్ హెవెన్ 505 నెంబర్ రూంకెళ్ళాలి!"

"ఆం... మా ప్రిన్సిపాల్ రాంపండుగారు కూడా అక్కడే ఉన్నారా? ఆహా! దైవలీల! చూశారా డాక్టర్‌గారూ! ఆట్టే శ్రమపడక్కర్లేకుండా, మీ డౌటు వెంటనే తీర్చేయగలను!" అవతలనించి మాట విన్పించనివ్వకుండా హృషీకేశ్‌గారి చేతిలోంచి రిసీవర్‌ని దాదాపు లాక్కోబోయేంత ఆత్రం ప్రదర్శించాడు చరణ్.

ఆయన ఉరిమి చూసి, "నువ్వుండవోయ్! మధ్యలో నీ గోలేంటి?"... "ఆ నువ్వు చెప్పు" అంటూ ఫోన్ మరీ దగ్గరగా ఆనించుకున్నారు హృషీకేశ్‌గారు.

"ఇక చెప్పేదేంలేదండి! ఫోన్ పెట్టేసి వెంటనే బయల్దేరండి. అక్కడ ఆవిడ పొజిషనేంటో' అనేసి ఫోన్ పెట్టేశాడు రాంపండు.

రాంపండూ- పల్లవీ ఒక టాక్సీలో బయల్దేరితే, ఆ వెనుకనే తన డొక్కు బులెట్‌మీద అనుసరించాడు గేమ్స్‌బాండ్.

ఇటువైపునుంచి దీపిక తండ్రి హృషీకేశ్‌గారు, ఆందోళనగా ఓ కార్లో బయల్దేరారు.

డాక్టర్ దత్తాత్రేయ క్కూడా, దీపిక ఆపదలో చిక్కుకుందని తెలిసి నిలువరించుకోలేక చరణ్‌ని తీసుకుని హృషీకేశ్‌గారి కారులోనే హోటల్ రూంవైపు బయల్దేరారు.

దారిలో... చరణ్ "జస్ట్ ఎ మినిట్!" అని హృషీకేశ్‌గార్ని రిక్వెస్ట్ చేసి కారు ఆపుచేయించి, పబ్లిక్ టెలిఫోన్ బూత్ దగ్గరకెళ్లి గబగబా సేఠ్ విక్రంచంద్ షాపుకి డయల్‌చేసి "వివరాలేం అడక్కండి. మీ అమ్మాయి మీకు కావాలంటే, హోటల్ హెవెన్ రూమ్ నెంబర్ ఐదొందల ఐదుకి రండి!" అని ఫోన్ పెట్టేశాడు.

సరిగ్గా- అదే సమయానికి, తరుణ్‌చేత తన్నులు తిన్న గూండాలు సేఠ్ విక్రంచంద్ ఎదురుగా నిలబడ్డారు దీనవదనాలతోనూ, చిరుగు వస్త్రాలతోనూ.

వాళ్ల పొజిషన్‌ని చూసి, విషయం అర్థం చేసేసుకున్న విక్రంచంద్, తన కూతురు పల్లవిని చరణ్ హోటల్‌రూమ్‌లో నిర్బంధించాడనుకుని తానొక కారులో అక్కడికి బయలుదేరాడు.




ఇంచుమించు అందరూ కొద్దిసెకన్ల తే డాతో, హోటల్ హెవెన్‌కు చేరుకున్నారు.

పార్కింగ్ ప్లేస్‌లో ఒక్కొక్కరూ వాహనా లు దిగసాగారు.

★ ★ ★

విపరీతమైన సుడిగాలి వేగంతో అటూ ఇటూ ఉన్న రూంనెంబర్లు చకచకా చూసు కుంటూ, కారిడార్లో స్కేటింగ్ చేస్తున్నట్టుగా వస్తోన్న తరుణ్‌కి ఓ రూంమీద 505 అనే నెంబరు ప్లేట్ కనపడింది.

డోర్‌పక్కనే ఉన్న కాలింగ్‌బజర్ నొక్కా డు ఆవేశంగా.

"కమిన్'' అనే తీయని స్వరం విన్పించి, చివ్వున లోపలికి అడుగుపెట్టాడు.

సరిగ్గా తరుణ్ లోపలికి అడుగుపెడుతూ న్నప్పుడే, అటాచ్డ్ బాత్‌రూం వున్న ఆ గదిలో "జస్టెమినిట్' అంటూ దీపిక బాత్రూంలో దూరి తలుపేసుకుంది.

అరచేతిలో, చిన్న పిడికిటి పోటొకటి ఇచ్చి "షిట్! రానీ! దీనిపని చెప్తా!" అంటూ అసహనంగా బెడ్‌మీద కూర్చుండిపోతూన్న తరుణ్ దృష్టికి టీపాయ్‌మీద ముత్యాలకోవ లాంటి గుండ్రని అక్షరాలతో... "మై స్వీట్ హార్ట్ తరుణ్‌కి'' అని అడ్రస్ చేస్తూన్న పొడ వాటి కవర్ కన్పించింది. దాని మీదొక తడి ఆరని తెల్ల గులాబి.

ఆత్రంగా దాన్ని అందుకుని, అందులోని అక్షరాల వెంట తన కళ్లని పరుగులు తీయించాడు.

నిముషంలో ఉత్తరం చదవడం తరుణ్ పూర్తిగా చల్లారిపోవడం చకచకా జరిగిపో యాయి.

ఆ ఉత్తరంలో ఏం ఉందంటే-

"మై స్వీట్ తరుణ్!

తీయటి ముద్దులతో... స్వాగతం పలకటా నికి ముందు మీకు ఓ విషయం చెప్పాలి!

గత కొద్దికాలంలో, చాలా అరుదుగానైనా మీతో సాన్నిహిత్యానికి నోచుకోలేని నేను... అవకాశం వస్తే మీలాగే మానసిక శారీరక బలహీనతలకు లోనై నైతికంగా పతనమవుతా నేమోననేకదూ మీరనుకున్నారు నాకు-తెలు సు...

కాని మీ ఊహే తప్పు. తాళి కట్టినవాడు తప్పుదార్లు తొక్కినా, ఏనాటికైనా తన దారికి వస్తాడన్న నమ్మకంతో, అతడినే దైవంగా భావించి ఆరాధించే సంస్కారాన్ని, సహనా న్నీ ప్రబోధించే సాంప్రదాయంలో పుట్టి పెరి గిన నేను... మీ భార్యను.

మాట్లాడకముందే మీ మనోభావాలని అర్థం చేసుకునే మీ అర్ధాంగి... గొంతుమార్చి మీరు మాట్లాడినంత మాత్రాన మిమ్మల్ని పోల్చుకోలేనంత అమాయకురాలు కాదు.

నైతిక పతనంతోపాటు, విలువైన జీవితా లూ, అంతస్తులూ, చివరికి ఆస్తులూ అధఃప తనదిశగా పయనిస్తున్నాయని తెలుసుకోలేక, మీ ప్రవర్తనను నాకు ఆపాదించి అంతా మీలాగానే ప్రవర్తిస్తారని ఊహిస్తున్నా ఓరి మితో, నేరాలెంచకుండా నిత్యం సంసార శ్రేయస్సే కాంక్షించే ఆంధ్రుల ఆడపడుచున్నే ను.

కాలం కాలరాసేసి కాటేసినా, సాక్షాత్తు భర్తే రాచిరంపాన పెట్టినా అంతా విధిలిఖి తంగా భావించి- అందులోనే చిరుఆశల జ్యోతుల్ని వెలిగించుకోడానికో చిన్న ప్రయ త్నం చేస్తారు, భారతీయ వనితలు!

అంతేకాని...

ప్రతీకారంతోనో, జెలసీతోనో, రగిలే పగ తోనో, రెట్టింపు ఆవేశంతోనో ఎదురుతిరిగి మనసు గుర్రపుకళ్లేల్ని స్వేచ్ఛగా వదిలేసే అల్పజ్ఞులూ, బలహీన మనస్కులూ కాదండీ స్త్రీలు.

అపోహ తొలగి, మీ అర్ధాంగి ఏమిటో మీకు అర్థమయితే, శాశ్వతపు విలువల కుండే ఔన్నత్యాన్ని గ్రహించగల్గితే క్షణికోద్రే కపు సుఖలాలసతకు మీరు గుడ్‌బై చెప్పగల్గి

తే ఈ దీపిక ధన్యురాలే!

ఎప్పటికీ
మీ
దీపిక"

ఉత్తరం చదివి, పశ్చాత్తాపంతో అలాగే వెనక్కి వాలిపోయాడు తరుణ్.

అతడి అణువణువూ, తన తప్పులకు దీపిక ఏ ప్రాయశ్చిత్తమైనా విధిస్తే బాగుండు ననిపించసాగింది.

తానామెని మన్నించడం కాదు. ఆమే తనని క్షమించాలి! ఆమె మన్నింపు కోసం తహతహలాడసాగాడు తరుణ్.

సరిగ్గా అప్పుడే లోపలికొచ్చాడు గేమ్స్ బాండ్.

అతడి ఉద్దేశం ప్రకారం- అంత ఆవేశంగా బయల్దేరిన తరుణ్ ఈపాటికి ఏదో కీడు తలపెట్టి ఉంటాడని...

అందుకే లోపలికొస్తూనే "ఏదీ? ఎక్కడ మర్డర్? జరిగి ఎంతసేపైంది?" అంటూ హడావుడిగా గదిలో కలియతిరగసాగాడు. బెడ్‌మీంచి లేచి "నీ బొంద! ముందు కంగారు తగ్గించు! ఇక్కడ మర్డర్లేం జరిగిపోలేదు'' అని గేమ్స్‌బాండ్ నెత్తిన మొట్టాడు తరుణ్.

ఆ వెనకే రాంపండూ, పల్లవీ కంగారుగా లోపలికొచ్చేశారు.

వాళ్ల వెనక "అమ్మా! దీపికా! సరైన టైమ్‌కే వచ్చేశానా! అమ్మయ్య! నీకేం కాలేదుగదా!" అంటూ వచ్చిన హృషీకేశ్‌గారు, గదంతటినీ పరికించి, తరుణ్‌ని చూసి "ఏదీ? మా అమ్మాయినేం చేశావ్?" అంటూ ఆయాసపడబోతూంటే "కూర్చోండి మామగారూ! కాస్త రిలాక్స్ అవండి!" అన్నాడు చిర్నవ్వుతో తరుణ్.

ఆ వెనుకనే వచ్చిన చరణ్ కళ్లజోడు సర్దుకుంటూ పల్లవివైపు చూసేసరికి ఆమె మరింక ఆగలేక, అతడి పక్కన చేరిపోయింది.





ఆఖర్న లోపలికొచ్చిన సేఠ్ విక్రంచంద్, చరణ్ పక్కన కులుకులొలుకుతూ నిలబడ్డ తన గారాలపట్టి పల్లవిని గుడ్లురిమేలా చూస్తూ, ఆ చూపునలాగే చరణ్ మీదకీ మరల్చి "మిమ్మల్ని ఇద్దర్నీ కట్టగట్టి కలిపి పాతరేయిస్తా!" అంటూ పళ్లు నూరసాగాడు.

ఇద్దరూ చిర్నవ్వుతో, తరుణ్‌వైపు చూడమన్నట్టుగా సేఠ్‌జీకి సైగ చేశారు.

అంతవరకూ అక్కడ అంతమంది ఉన్నా, కేవలం అతడి దృష్టికి పల్లవి, చరణ్‌లు మాత్రమే ఆనసాగారు. వాళ్ల సైగమేరకు, తరుణ్‌వైపు దృష్టి సారించాక, స్టన్నయిపోయాడు సేఠ్ విక్రంచంద్.

కళ్లు నులుముకుని ఇద్దర్నీ మార్చి మార్చి చూడసాగాడు సేఠ్‌జీ. అతడికంతా అయోమయంగా ఉంది.

డాక్టరు దత్తాత్రేయా, ప్రిన్సిపాల్ రాంపండూ అతడికి చెరోవైపూ నిలబడి, ఆ ప్రేమజంటని అతడేం చెయ్యకుండా కనిపెట్టి ఉన్నారు, అప్రమత్తంగా.

చివర్న వచ్చిన సౌందర్యదంపతులు, చరణ్ తరుణ్‌లను ఆశ్చర్యంగా చూస్తూ, "ఇది కలా? నిజమా? మా భ్రమా? అంతా వింతగా ఉంది? ఇద్దర్లో దీపిక భర్తెవరు? అసలు దీపికేదీ?" అని అడిగారు.

"అవును! దీపికేదీ?" అడిగారంతా కోరస్‌గా... ఒకర్నొకరు చూసుకుంటూ.

అదే క్షణంలో బాత్‌రూం డోర్ తెరుచుకుని బయటకొచ్చింది దీపిక.

అంతా తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు.

శాంతికి ప్రతీకలాంటి ఓ తెల్లగులాబీని ఆప్యాయంగా పట్టుకుని, దీపికకు ఎదురెళ్లి, "నన్ను మనస్ఫూర్తిగా క్షమించవూ!" అంటూ ఎంతో ఆర్ద్రంగా అడిగాడు తరుణ్.

ఇద్దరి నేత్రాలూ ఆనందంతో సజలసీమలయ్యాయ్!

"నిజం దీపా! నేనిప్పుడు పూర్తిగా పశ్చాత్తాపదగ్ధ పునీతమనస్కుడిని'' కొంచెం ఆగి "వెనకటి తరుణ్‌ని కాను'' అన్నాడు స్థిరంగా.

"అబ్బా! తెలుగు కాస్త హెవీగా ఉందోయ్! నాకు తెలుగుమీద ఎంత అభిమానం ఉన్నా, ఓవరైపోతే భరించలేనని నీకూ తెల్సుగా!" వాతావరణాన్ని ఉల్లాసపరుస్తూనట్టు అన్నారు హృషీకేశ్‌గారు.

"ఓ.కే. మామాజీ! ఇంతకాలం నేను 'పారనాయిడ్ సైకోసిస్' అనే మనోవ్యథతో నా అనుమానాల్ని, అపోహల్ని దీపికమీద రుద్ది, ఆమెని మానసికంగా చాలా హింసించాను. ఆ నరకం ఏమిటో అనుభవించిన దీపికకు తెలుసు! దానికి్కారకుడిన్నెన నాకు తెలుసు! అంత హింస పెట్టిన నేను క్షమించమని అడగడానికి ఎన్ని హెవీ వర్డ్స్ వాడినా తక్కువే'' అంటూ, దీపికనే చూస్తూ "ఏఁవోయ్! అంతేకదూ'' అని కొంటెగా కన్ను గీటాడు.

ఆ ఆహ్లాదకర వాతావరణాన్ని మరింత లైటర్ వెయిన్‌లోకి మారుస్తూ, ప్రిన్సిపాల్ రాంపండు "సార్! నాదో చిన్న సందేహం! మీరిద్దరూ కవలలా? అచ్చం ఒకే పోలికలో ఉన్నారు?" అని అడిగాడు.

దాన్నే అందిపుచ్చుకుని... "ఒకే తల్లికి పుట్టి, సినిమాల్లో లాగా చిన్నప్పుడే విడిపోయారనుకుంటాను'' తన డౌట్‌నీ వ్యక్తం చేశాడు డాక్టర్ దత్తాత్రేయ.

"నో! నో! అదేం లేదు. సృష్టి విచిత్రం! నూటికో కోటికో అతిఅరుదుగా ఎక్కడో మనిషిని పోలిన మనిషి ఉంచొచ్చునని మీరు వినలేదా...?"

తరుణ్ చెప్తూన్న వాక్యాన్ని అందిపుచ్చుకుని "ఇప్పుడు ఇక్కడ చూస్తున్నారు... ఎక్కడో, అమెరికాలోని కాన్సాస్ నగరంలో జాన్‌టోలర్ ఎమల్ మాజిస్‌లు ఓ పుస్తకాల షాప్‌లో ఇలాంటి విచిత్రస్థితిలోనే తారసపడ్డారట ఒకరికొకరు! ఆ టైపు వ్యక్తులం మేం!" అంటూ పూర్తిచేశాడు చరణ్.

"ఓహో! అదా సంగతి! అందుకే టైపు ఇన్‌స్టిట్యూట్ దగ్గర నాకు తారసపడ్డారూ!" రాంపండు దీర్ఘం తీశాడు.

ఒకర్నొకరు చూసుకుంటూ, ఇద్దరూ ఒకరికొకరు షేక్‌హ్యాండ్ ఇచ్చుకుంటూ "దేవుడు కలిపిన ట్విన్స్ మేం! స్వరూపాల్లో, స్వభావాల్లో అన్నిటా ఒక్కటైన స్వరూపద్వయం మేం" అన్నారు ముక్తకంఠంతో.

గ్రూప్‌ఫొటోకి తక్కువైందన్నట్టుగా ఉన్న రాణి సైతం చివరలో వచ్చి, గేమ్స్‌బాండ్ పక్కన నిలబడింది.

పదిజతల చేతుల క్లాప్స్‌తో- ఐదొందల ఐదోనెంబర్ రూం మార్మోగింది.



నమీచి కథ చెప్పడం ఆపి, అందరివంకా సాలోచనగా చూసింది.

"చాలా బాగా చెప్పారమ్మా! అచ్చంగా సిన్మా చూస్తూన్నట్టే ఉంది'' మొట్టమొదటగా నోరువిప్పి కామెంట్ పాస్‌చేశాడు రూంబాయ్ దస్తగిరి.

"థాంక్స్! ఆ ఫీలింగ్ కలిగించగలిగితే, సక్సెస్ అయినట్టే'' ఇటువైపున ఉన్న జనమేజయంవైపు తిరిగి "డ్యూయల్ రోల్... అందునా మీరు అనుకున్న కామెడీ హీరోగారికి సూటయ్యేవిధంగా ఉందా డైరెక్టర్ సాబ్?" అడిగింది నమీచి.

"ఏమీ మాట్లాడకుండా అంతా విన్న నిర్మాత సదాశయంగారు ఇక్కడే ఉన్నారుగా! పెట్టుబడి పెట్టేది ఆయన. వారినే అడిగి చూడండి'' దూరం ఆలోచించి తప్పించుకోబోయాడతడు. ఎటుతిరిగి ఎటొచ్చినా, తన మీద ఎలాంటి భరోసానీ, భారాన్నీ పెట్టుకోకుండా.

సదాశయం వరస చూస్తూంటే, ఈ కథ నచ్చినట్టే అన్పించడంవల్ల కూడా జనమేజయం ఆ మాట అన్నాడు. అదీగాక- ఆమె కథ చెప్పిన తీరు అతడికి అసూయని... గొప్ప జెలసీని కలిగించింది.

ముఖ్యంగా- ప్రతి చిన్న పాయింటూ,

షాట్ డివిజన్ చేసి చూపించినట్టుగా, ఎడిటింగ్‌ని సైతం దృష్టిలో ఉంచుకుని కథ పకడ్బందీగా నడిపించినట్టుగా ఫీలయ్యాడు.

చాలాచోట్ల- సంభాషణలకి ప్రాధాన్యత లేని సందర్భాల్లో ఆమె, విషయాన్ని దృశ్యపరంగా... అంటే- విజువలైజ్ చేసి సైలెంట్ షాట్స్ కింద విడగొట్టిన అనుభూతికి లోనయ్యాడు.

ఎంతైనా ఆమె పూర్వాశ్రమంలో రచయిత్రికదా!

సదాశయం ఓ రెండు నిముషాలు ఏమీ మాట్లాడలేదు.

"నిర్మాతగారేదో యోచిస్తున్నట్టున్నారు" జనమేజయం అన్నాడు.

కథ జరుగుతూండగా మధ్యలో కొన్నిసార్లు కల్పించుకున్నప్పటికీ, నిర్ణయాల దగ్గరకొచ్చేసరికి- అది నిర్మాతా దర్శకుల వ్యవహారం కనుక తాము తలదూర్చకూడదని ఘోష్టు షష్టకం నోర్మూసుకున్నారు.

సదాశయం, తన అభిప్రాయంమేరకు ముందుగా తన అభిరుచిని ఏమాత్రం చెప్పకుండానే, జనమేజయం ఉద్దేశమేమిటో తెల్సుకోదల్చుకున్నాడు.

గత రెండు నెలలుగా, అతడినీ, అతడి అనుచరగణాన్నీ మేపుతూ ఖర్చుకు కూడా వెరవకుండా అడిగినదల్లా అరేంజ్ చేస్తూన్నప్పటికీ నేటివరకూ కథ ఫైనలైజ్ కాలేదు.

'కొంపదీసి ఇతడికి నిజంగా వర్త్ అనేది ఉందా- లేదా? లేక 'లక్కు తన్నుకొచ్చి' హిట్స్ వస్తూంటే అదంతా తన ప్రతిభేనని విర్రవీగుతూ ఉన్నాడా?' అనుమానం సదాశయానిది.

అందుకే ఈ కథ జడ్జిమెంట్‌మీద అతడి సత్తా కనిపెట్టదల్చుకున్నాడతడు.

నమీచి, సదాశయం వంక ప్రశ్నార్థకంగా చూసింది.





"నో! నో! ఇంతకాలం ప్రతిదాంట్లోనూ వేలు పెట్టానే తప్ప, కథల విషయంలో మాత్రం నా పిక్చర్లు వేటికీ నేను కల్పించుకోలేదు. లక్షల్లక్షలు... లక్షలేమిటి? కోట్లు నష్టపోయాను. ఇప్పుడూ అదే పొరపాటు చెయ్యడం నాకిష్టం లేకపోయినప్పటికీ కథ విషయంలో తుదినిర్ణయం అన్నీ చూసుకుంటున్న జనమేజయానిదే ఆయనకు ఏమన్నా సందేహాలున్నాయేమో'' అంటూ ఓరకంట నమీచినే చూస్తూ ఆగాడు సదాశయం.

నిర్మాత తనకి ఓవర్ వెయిటిచ్చినందుకు, జనమేజయం తెగపొంగిపోతూ, నమీచి కథమీద చెలరేగిపోవడం ప్రారంభించాడు.

"మేం అనుకున్న కామెడీ హీరోగారికి మాత్రమే ఏం ఖర్మ? ఏ కుర్ర హీరోకైనా సూటయ్యేలా దీన్ని ఒప్పించగలం! ఎయిటీ పర్సెంట్ మాకాఛాన్స్ డైరెక్టర్స్‌మి కనుక ఉంటుంది. నో ప్రాబ్లెం! కానీ దీన్ని తీసుకొనే ముందు కొన్ని షరతులున్నాయని మొదట్లోనే చెప్పానుకదా! దీనికి 'క-స్క్రి మా- పా-ద' గా మా పేరే ఉంటుంది. అలా వేసుకుంటే దీని జయాపజయాలకి మేమే బాధ్యులమవుతాం. దీంట్లో మార్పులూ, చేర్పులూ ఏం చెయ్యడానికైనా మాకు పూర్తి స్వేచ్ఛ ఉంటుంది''

"ఇప్పుడు మాత్రం స్వేచ్ఛ లేదని ఎందుకనుకుంటున్నారు? మీకు నచ్చిన మార్పులు మీరు చెయ్యొచ్చుగా!" నమీచి అంది.

"అమ్మమ్మ! ఎంత ఆశ? చక్కగా దీన్ని అన్నివిధాలా అనుకూలంగా మేం మల్చుకోవాలా? హిట్ స్టోరీ అందించిన పేరు మీకు రావాలా?"

"సరే! దీన్ని యధాతథంగా తీయండి! అప్పుడా క్రెడిట్ ఏదో నాకే దక్కుతుంది''

"ఒకవేళ అపజయం పాలైతే దానికి నువ్వు బాధ్యత వహిస్తావా? సపోజ్... పెట్టుబడిమీదనే నష్టం వచ్చిందనుకో! నువ్వు రిక

వరీ చెయ్యగలవా? మేమైతే ఈ ఫీల్డులోనే ఉన్నవాళ్లం కనుక, ఓ నిర్మాత మునిగిపోగల పరిస్థితే ఏర్పడితే... దాన్లో లాస్‌ని మరో హిట్‌తో కవర్ చేసెయ్యగల్గుతాం"

"నేనూ చెయ్యగలను ఆ పని. సిన్మాకి నష్టం వస్తే- ఆ డబ్బు వెంటనే 'చెక్' రాసి ఇచ్చెయ్యగలను..."

"అంత శ్రీమంతురాలివా? ఆఫ్టరాల్... ఓ కాబరే డాన్సర్‌వి!" ఈసడింపుగా అన్నాడు జనమేజయం.

"చూడు డైరెక్టర్! డోంట్ లూజ్ యువర్ టంగ్ అన్‌నెసెసర్లీ''

"ఏంటే? ఏంటీ?" మీదకి రాబోతూన్నట్టుగా అన్నాడు అహం దెబ్బతిన్న జనమేజయం.

అతడిది రఫ్ కారెక్టర్ అన్న సంగతి ఆమెకస్సలు తెలీదు.

"మిస్టర్! నువ్వు మర్యాదస్తుడవనుకున్నాను. స్టోరీ చెప్పేను. దాని గురించి మాట్లాడు. అంతవరకే. నువ్వేదో నామీద పెత్తనాలు చెలాయించాలనుకుంటే మాత్రం దెబ్బతిని పోతావ్! నిజానికి నాకున్న సెక్యూరిటీ నీకిక్కడ లేదు. నామీద ఈగ వాలినా, నువ్వీగది లోంచి బైటికిపోలేవ్'' తానూ ఏకవచన ప్రయోగంలోకి దిగిపోతూ అంది నమీచి.

"ఇదంతా అనవసరం జనమేజయంగారూ! మీ ఒపీనియన్ ఏంటో సూటిగా చెప్పండి'' సదాశయం కల్పించుకుంటూ అన్నాడు.

"చెప్పడానికేముంది ఇందులో? ఈరోజున ఒక ఫిల్మ్ హిట్టు కొట్టాలంటే, బాక్సాఫీస్ దగ్గర విజయం సాధించాలంటే సమస్త చిత్రవిజయ సూత్రాలూ అందులో ఇరికించాలి! పైగా ఫీల్డులో పాతుకుపోయివున్న కొన్ని సెంటిమెంట్స్‌ని శాటిస్‌ఫై చెయ్యాలి! మీకేం సార్? అన్నీ తెలిసి కూడా అలా అంటే నేనేం చెప్పను? అదలా ఉంచండి! నేను ముందే చెప్పినట్టుగా నా సిన్మాలో అంతర్లీనంగా మెస్సేజ్ ఫ్లోట్ కావాలి''

"రామాయణం అంతా విని రాముడికి సీత ఏమవుతుంది? అని అడిగాట్ట వెనకటికెవడో. కథ అంతా విన్నాక కూడా, మీకిందులో మెసేజ్‌లాంటిదేం ఉన్నట్టు అన్పించడం లేదా?" నమీచి అందుకుంది.

"ఉన్నాయని నువ్వనుకుంటున్నావా?" ఆమెనే సూటిగా చూస్తూ అన్నాడు జనమేజయం.

"అనుకోడమే కాదు. సెంట్ పర్సెంట్ ఉన్నాయని ఆత్మవిశ్వాసంతో అంటున్నాను. కథ ఇట్టే చెప్పగానే- అట్టే పాయింట్ పట్టేసుకోగలవాడే డైరెక్టర్ అంటే. మరి మీరు హిట్ డైరెక్టరెలా అయ్యారో నాకు అర్థం కావడం లేదు''

"వెటకారం ఆపి వివరించగలవా?"

"ఓ... తప్పకుండా! సూపర్‌హిట్ మసాలాలన్నీ దీన్లోనే ఉన్నాయని అంటాను కూడా! వినండి. కాస్త శృంగారపు పాలెక్కువ ఉండే మోటుహాస్యం. అదీ బయ్యర్స్ తృప్తికోసం ఉండాల్సిందే. ఉదాహరణకి... డిటెక్టివ్ గేమ్స్‌బాండ్ రాణి పాత్రలు అలాంటివే!

ఇద్దరు హీరోయిన్లకీ ప్రాధాన్యత ఇస్తూ ఓపక్క ఓ హీరోయిన్‌ని కేవలం డాన్సింగ్ డాల్ అన్పించకుండా బ్యాలెన్స్ చేస్తూ పాటలు సమానంగా పంచాలి. పల్లవికెన్ని సీన్లున్నాయో ఈ కథలో దీపికకీ అన్ని సీన్లున్నాయి.

కుటుంబగాథలకి ఉన్న ప్రాముఖ్యత... ముఖ్యంగా హీరోయిన్ పాత్ర చిత్రణ ఉదాత్తంగా ఉండాలి. దీపిక క్యారెక్టరైజేషన్ ఎక్కడా వక్రమార్గాన నడవలేదుగా!

లాగుడు సన్నివేశాలుండకూడదు. ఎడిటింగ్‌లో క్రిస్ప్‌గా ఉన్నట్టు కన్పించడానికి కొన్ని సన్నివేశాలకు డైలాగ్ ప్రాధాన్యత లేకుండా చేసి కేవలం సైలెంట్ షాట్స్‌తోనే నడిపించాను.



'భార్యాభర్తల మధ్య అవగాహనా, ఆత్మీయతానురాగాలూ ఉండాలి తప్ప, అపార్థాలూ, అపోహలూ ఉండకూడదు' అనే సందేశం అందించాను.

చెప్పండి! ఇవన్నీ బాక్సాఫీస్ హిట్ ఫార్ములాలు కావా?"

నిర్మాత సదాశయం చప్పట్లు కొట్టాడు.

అంతవరకూ తానేనాడూ ఏ కథకూ నోరు విప్పి ఎలాంటి అభిప్రాయమూ ప్రకటించని ఆ నిర్మాత "వెరీగుడ్! చాలా బాగా చెప్పేవమ్మా! ఇంతమందిని పోగేసుకుని, అందరి బ్రెయిన్లూ తలా కాస్తా వాడుకుని, ఇంతకాలం ఏవో హిట్స్ అందిస్తూన్నప్పటికీ ఈ జనమేజయం ఇసుమంతైనా స్వయం ప్రతిభ లేనివాడని ఈ దెబ్బతో తేలిపోయింది.



"గతనెలన్నరా, రెండు నెలలుగా ఫుల్‌గా బాటిల్స్‌మీద బాటిల్స్ కొట్టేస్తూ నన్ను పీల్చి పిప్పిచేసేశారే తప్ప, కథాదస్త్రం ఒక్కటీ విప్పలేదు. అసలు వీళ్ల దగ్గర కథలుంటే కదా! బుర్రలు కావు, అవి ఉత్త చవిటిపర్రలు... హిపోక్రసీ తప్ప వేరేమీ తెలీని గడకర్రలు'' నిరసనగా చూశాడు వాళ్లవైపు.

"ప్రతి సీనూ, ఆ అల్లికా ఎంతో సమర్థుడైన డైరెక్టర్ చేతిలోంచి ఊడిపడ్డట్టుగా ఉంది. చెప్పిన వరస కూడా ఓ.కే. ఆత్మవిశ్వాసంతో చివర్న నువ్విచ్చిన వివరణ ఉంది చూశావ్. అది నాకు అన్నిటికంటే బాగా నచ్చింది'' అంటూ నమీచిని ప్రశంసించాడు నిర్మాత సదాశయం.

"తన కాళ్లమీద... ఐమీన్ తన కథ కాళ్లమీద తాను నిలబడలేనివాడు తనమీద తనకే సెల్ఫ్‌కాన్ఫిడెన్స్ ఏమాత్రం లేనివాడు ఇదుగో! ఇటువంటి 'బృందగానా- బజానా'లకి దాసోహమంటాడు. డైరెక్షన్‌వరకూ నీకో ఇద్దరు బెస్ట్ అసోసియేట్స్‌ని ఎలాట్ చేస్తే ఈ కథని నువ్వే డైరెక్ట్ చెయ్యగలవు.

నాకా నమ్మకం ఉంది. గో ఎ హెడ్! లెటజ్ స్టార్ట్ అవర్ ఫిల్మ్. రేపే ప్రెస్‌మీట్ పెట్టి, నిన్నే డైరెక్టర్‌గా డిక్లేర్ చేస్తాను. నీ కిష్టమే నా?" అప్రిషియేటివ్‌గా చూస్తూనే అడిగాడు కూడా.

జనమేజయం బృందానికి నోటమ్మట మాట రాక, తల కొట్టేసినట్లయి నిశ్చేష్టగా ఉండిపోయారు.

ఎక్కిన మందునిషా దిగిపోయింది.

సదాశయం ఇలా ప్లేటు ఫిరాయించేస్తాడ నుకోలేదెవ్వరూ.

"అవునమ్మగారూ! మీరు కత సెప్తా వుంటే, సిన్మా చూస్తూన్నట్టు ఉంది'' దస్తగిరి బలపరిచాడు.

"ఇటు ఇక్కడ డాన్సర్‌గానూ, అక్కడ సెట్లో డైరెక్టర్‌గానూ నేనిప్పుడు రెండు పోర్ష న్లు ప్లే జెయ్యాలన్నమాట!" నవ్వుతూ అంది నమీచి, తన అంగీకారాన్ని పరోక్షంగా సూచి స్తూనే.

"సమస్యా? చెప్పండి... మీ హోటల్ ఓనర్ ఒప్పుకోడని ఏం భయమా?"

"నో! నో! అదేం లేదు''

"మీ ప్రాబ్లెం చెప్పండి. అవసరమను కుంటే ఆయన్ని నేను ఒప్పిస్తా! మీరు డైరెక్టర్‌గా... ముఖ్యంగా అతి అరుదైన లేడీ డైరెక్టర్‌గా ఫీల్డులో నిలబడిపోవడం ఖాయమ మ్మా!" అంటూనే "ఇందాక మీరో మాట అన్నారు నమీచీ. నష్టమొస్తే, అది భరించడా నికి మీరెంత నమ్మకంగా సిద్ధపడతాను అనగలిగారో నాకు తెలీదు. కాని పెట్టుబడి పెట్టే ఓ నిర్మాతగా నేను మాత్రం నమ్ముతు న్నాను. ఇది పక్కా మాస్‌మసాలా మిళా యించిన సిన్మా అయి తీరుతుంది''

స్థిరంగా చెప్పిన సదాశయం మాటలకి విజయగర్వం తొణికిసలాడుతూండగా "థాంక్స్! నామీద మీకున్న భరోసాకి జోహార్'' అంది నమీచి.

"ఆవిడగారి ద్విపాత్రాభినయంమాట ఏమోగాని, మీరు మాత్రం రెండునాల్కల ధోరణిలో వ్యవహరిస్తున్నారు సదాశయంగా రూ? అది చాలా డేంజరస్! మీకు అంతగా అడ్వెంచరే చెయ్యాలనిపిస్తే ఈవిడ్నే డైరెక్టర్ గా పెట్టి నెక్స్‌ట్ పిక్చర్ తీసుకోండి. అంతే గానీ... ఇప్పుడిలా మాట మార్చొద్దు. కమిట్ అయినందుగ్గానూ, ప్రెస్‌మీట్లో అన్నిటికీ తలూపి నా పేరు అనౌన్స్ చేసేసినందుగ్గా నూ... ఈ పిక్చర్‌కి నేనే డైరెక్టర్ని! ఇప్పుడు కాన్సిల్ అంటే... ఏంటి? ఇదేం పిల్లల ఆటా? ఊరుకోడానికి నేనేం వాజమ్మనా? నా తడాకా ఏమిటో చూపిస్తా!" మందు తలకెక్కిన మొండిధైర్యంతో ఛర్రున లేచాడు జనమే జయం.

ఆ వెంటనే అతడి మిత్రబృందం కూడా సదాశయంమీద దాడికి రెడీ అయింది.

సమయానికి దస్తగిరి, హోటల్ ఓనర్‌ని పైనున్న ఆఫీస్ ఛాంబర్‌నుంచి పిల్చుకు రాకపోయిఉంటే... అక్కడో ఫైటింగ్ హోరాహోరీగా జరిగి ఉండేదో ఏమో!

కాని, వచ్చినది కేవలం సాక్షాత్తూ యజ మానిగా మాత్రమే కాదు, ఆ వచ్చిన అతడు నమీచికి భర్తగా కూడా...

ఆ వచ్చిన వ్యక్తి మిష్టర్ ప్రభుదాస్.

అతడి కాంట్రాక్టు బిజినెస్‌ల చెయిన్ అనంతం.

స్మూత్ మేటర్స్ అనదగ్గ హోటల్స్ నిర్వహణ మాత్రమే కాదు. అతడికి అవసర మైతే తలకాయల్ని పుచ్చకాయల్లా లేపేసె య్యగల మర్డర్ ఛానెల్ కూడా ఉంది.

ఆ సంగతి తెలిసిన తక్షణం, తోకముడి చిన జనమేజయం బృందం అక్కడినుంచి మాయమైపోయింది.

నమీచి డైరెక్టర్‌గా, ఆ నెలలోనే నిర్మాణం ప్రారంభమైంది.







# చతుర కతలు

## అసలు సంగతి

**బ్యా**గ్‌ని గుండెలకి హత్తుకొని విసుగ్గా వాచీ వైపు చూసుకుంది గిరిజ. పదీ ఇరవై, ఇంకో పదినిమిషాల్లో బ్యాంకులో ఉండకపోతే పెద్ద దండకం చదువుతాడు మేనేజరు. పది



గంటల బస్‌కి హడావిడిగా వస్తుంటే సరిగ్గా అప్పుడు తెగింది పాడు చెప్పు. కుట్టించేసరికి ఆ బస్సు మిస్సయిపోయింది. బస్‌స్టాప్‌లో మనుషులు లేరు. ఒక్క ఆటో కూడా లేదు. ఈ మారుమూల కాలనీకి ఆటోలెందుకొస్తాయి? పోనీ సెలవు పెట్టిపారేద్దామా అంటే ఇయర్ ఎండింగ్ వర్క్ వున్నప్పుడు సెలవు పెడితే మెమో ఇస్తాడా చాదస్తం ముసలాడు. కొద్దిగా కిందకి జారుతున్న బ్యాగ్‌ని నిట్టనిలువుగా, పదిలంగా పట్టుకుంది. అబ్బా! ఏం బస్సులో ఏమో? ఛీఛీ ఒక్క ఆటో కూడా లేదు. ఛఛ ఏం బ్రతుకో ఇది. అన్నిటిమీదా వరసబెట్టి విరక్తి పుడుతోంది పాతికేళ్ల గిరిజకి.

పెద్ద చప్పుడుతో ఆటో ఆగింది గిరిజ ముందర. చాలా సంతోషమేసిందామెకి. బ్యాగ్‌ని జాగ్రత్తగా పట్టుకొని ఆటోకేసి నడిచింది. ఆటోలోంచి కుటుంబనియంత్రణ పాటించని ఓ పెద్ద కుటుంబం దిగింది. ఆటో ఎక్స్ట్రా చార్జి గురించి చిన్నిసైజు యుద్ధం జరిగింది కుటుంబయజమానికి, ఆటో అతనికి. ఐదు నిమిషాలక్కడే గడిచిపోయాయి. రెస్ట్‌లెస్‌గా కదిలింది అటూ ఇటూ.

"కహా జానా?" ఎర్రటికళ్లతో ఆమెనీ, ఆమె చేతిలో బ్యాగ్‌ని పరీక్షగా చూస్తూ ప్రశ్నించాడతను.

"అబిడ్స్. తొందరగా పోనీ'' ఆటో ఎక్కి

బ్యాగ్‌ని పక్కన పడెయ్యకుండా ఒళ్లోనే భద్రంగా పెట్టుకు కూర్చుంది.

సైడ్ మిర్రర్‌లోంచి గిరిజనే పరికించి చూస్తున్నాడు ఆటోడ్రైవర్. మనిషి హడావిడిగా ఉంది. మొహంలో అసహనం, కంగారు, అలసట. అన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆమె ఖంగారుకి, ఆ బ్యాగ్‌కి ఏదో సంబంధముందనిపిస్తోంది. అందులో తప్పకుండా బంగారమో, డబ్బో ఉండితీరాలి. డ్రైవర్ ఆలోచనలు వేరేవైపు సాగుతున్నాయి. అంతే ఆటో కూడా సర్రున వేరేవైపు తిరిగింది.

"ఏయ్! ఇటెక్కడికి?" అరిచింది ఖంగారుగా.

మౌనంగా ఒక నిర్మానుష్యమైన గల్లీలోకి ఆటో తిప్పి ఆపేశాడు. చుట్టూ చూశాడు. ఒక్క పురుగు కూడా లేదు. ఇదే ఛాన్సని ఒక్కుదుటున ఆమె బ్యాగు లాక్కుని జిప్పులన్నీ తెరిచి వెతికాడు. లంచ్‌బాక్సు, బస్ పాస్, చేతిరుమాలు, ఇరవైరూపాయల నోటు, కొద్దిగా చిల్లర తప్ప మరేమీలేదు అందులో. ఖంగుతిన్నాడు డ్రైవరు. నిశ్చేష్టురాలై చూస్తోంది గిరిజ.

"నీయవ్వ! ఏముందని ఇందులో అంత బిగ్గరగా పడితివి?" వచ్చీరానీ తెలుగులో కోపంగా అరిచాడు. అప్పటికి స్పృహలోకొచ్చిన గిరిజ సన్నగా నవ్వి, "అదా నీ బాధ. బాక్సులో సాంబారుంది. అది ఒలికిపోకుండా పట్టుకున్నానంతే'' అసలు విషయం చెప్పి ఠీవీగా నడిచి వెళ్ళిపోయింది. బిక్కచచ్చిపోయాడా డ్రైవరు.

-గొల్లపూడి శైలజ

---

## శిక్ష

సింహాసనంపై దర్జాగా కూర్చున్నాడు యమధర్మరాజు.

ఆ పక్కనే కుర్చీలో చిట్టాను ఒడిలో పెట్టుకుని కూర్చునున్నాడు చిత్రగుప్తుడు.

ఎదురుగా కొందరు ఆరోజు నరకానికొచ్చిన దోషులు నిలబడి వున్నారు.

"చిత్రగుప్తా! ఇతను చేసిన నేరమేమిటి?" ఒక దోషివేపు వేలెత్తి చూపుతూ అడిగాడు యం.డి.రాజు.

"ఇతను సూర్యాపేటలో ప్రైవేటు చిట్టీలు నడిపేవాడు ప్రభూ! ప్రజలు కష్టపడి దాచుకున్న సొమ్ముకు ఎగనామంపెట్టి 'దివాళా' తీసినట్లు అబద్ధమాడాడండీ!" చెప్పాడు సి.గుప్తా.

"అలాగా, ఇతనికి రోజూ వెయ్యి కొరడా దెబ్బలచొప్పున పదిహేను రోజులపాటు శిక్ష విధిస్తున్నాను'' అన్నాడు యం.డి.రాజు.

భటులొచ్చి అతన్ని గుంజుకుపోయారు.

మరొక దోషివేపు వేలెత్తి చూపించి-

"మిస్టర్ గుప్తా! ఇతను చేసిన నేరమేమిటి?" అడిగాడు.

"ఇతను విజయవాడతోపాటు పలుపట్టణాలలో 'లక్కీస్కీం'లు నడిపి కొన్నివేలమంది అమాయకుల్ని నిలువునా ముంచాడు ప్రభూ!" చెప్పాడు సి. గుప్తా.

"అలాగా, ఇతనికో పదునైన శూలం గుచ్చి మన దర్బారు వెనకవేపు గుమ్మానికి పదిరోజులపాటు వేలాడదీయమని ఆజ్ఞాపిస్తున్నాను'' చెప్పాడు యం.డి.రాజు.

భటులు అతనిని బరబరా లాక్కుపోయారు.

"గుప్తాగారూ! ఇతను చేసిన అపరాధమేమిటి?" మరో దోషికేసి చూస్తూ అడిగాడు యం.డి.రాజు.

"ఇతను, ప్రతిజిల్లాకొక అమాయకుడ్ని నమ్మించి, వారినుండి దొరికినంత కట్నం గుంజి వారి కుమార్తెలను వివాహమాడినాడు ప్రభూ!" చెప్పాడు గుప్తా!






"ఇది భరించరాని నేరం. ఇతన్ని సలస లా కాగేనూనెలో పడవేయండి'' కోపంగా అన్నాడు యం.డి.రాజు.

భటులాతన్ని తన్నుకుంటూ ఈడ్చుకుపోయారు.

చివరిదోషిని చూపించి, "ఆ ఇతను చేసిన నేరం ఏమిటి?" అడిగాడు యం.డి.రాజు.

"ఇది మరీ విడ్డూరమైన కేసు మహాప్రభూ! ఇతనికి 'కవిత్వం' రాసే పిచ్చి. ఏ పత్రికా ఇతని కవితలు వేసుకోడానికి సాహసించలేదు. అందువలన, ఇతను తను నివాసముండే కాలనీవాసులందరితో పరిచయాలు చేసుకునేవాడు. సెలవురోజుల్లోనూ, ఆదివారంనాడూ అందరూ కుటుంబసమేతంగా ఆనందంగా గడుపుతున్న సమయంలో ప్రతి ఇంటికీ వెళ్ళి తన కవితలు విన్పించేవాడు. ఇప్పుడు ఇతని కాలనీవాసుల పరిస్థితి దయనీయంగా ఉంది. వారెప్పుడు కోలుకుంటారో, పిచ్చాస్పత్రి నుండి మళ్ళీ స్వంత ఇళ్ళకు ఎప్పుడు తిరిగొస్తారో చెప్పలేని విచిత్ర పరిస్థితి. సార్' చెప్పాడు సి.గుప్తా.

"అటులనా, ఇతనికి మన దూరదర్శన్ తెలుగు కార్యక్రమాలు వరుసగా ఇరవైనాలుగు గంటలూ చూపించే ఏర్పాటు చేయండి. 'బృందగానాలు' వచ్చినప్పుడు సౌండు ఎక్కువ జేయటం మరువద్దు'' తీర్పు చెప్పి లేచాడు యం.డి. రాజు.

ఆ దోషి విలపిస్తూ ఆయన కాళ్ళమీద పడ్డాడు.

"మీరే శిక్షన్నా విధించండి. ఈ శిక్ష మాత్రం భరించలేను మహాప్రభో!" అని విలపించసాగాడు.

అదేమీ విన్పించుకోకుండా 'పాశం' ఊపుతూ ముందుకు సాగాడు యం.డి.రాజు.

"ఆగండి యమధర్మరాజా! మీరు నాకు ఎలాగూ వేశారు. సరేగానీ, నా కవితలు నాలుగు విని నన్ను ధన్యుడిని చేయండి. అభ్యర్థించాడు ఆ దోషి. "మీకు నచ్చితే, అవి మీకే అంకితం ఇస్తాను'' హామీ ఇచ్చాడతను.

నిలువెత్తు మనిషి యమధర్మరాజుగారూ మరుక్షణం ఓచేత తలపట్టుకునీ, మరోచేత గుండె నొక్కుకుంటూనూ కింద కూలబడ్డాడు.

-పంతంగి రవీంద్ర శ్రీనివాస్

# కావాల్సినవాళ్లు

ట్రాఫిక్ రూల్స్‌ని ఉల్లంఘించి యమాస్పీడుతో యమహామీద పోతున్న రమేష్, సురేష్, కామేష్‌ల్ని ట్యాంక్‌బండ్ దగ్గర ఆపేశారు ట్రాఫిక్ ఇన్స్‌పెక్టర్ వెంకటప్పా, కానిస్టేబుల్ కనక సుందరం.

షోరూంనించి ఆరోజే సురేష్ యమహా మోటార్‌సైకిల్‌ని కొన్నాడు. ఎన్నో రోజుల్నించీ బండి కొనాలని కన్న కలలు సఫలమైనందుకు ఉత్సాహంగా మిత్రుల్ని ఎక్కించుకుని హోటల్ వైస్రాయ్‌లో టిఫిన్ ఇప్పించడానికి తీసుకువస్తున్నాడు.

అంతలోనే ఆపేశారు ట్రాఫిక్ ఇన్స్‌పెక్టరూ, కానిస్టేబులూ.

"ఏమయ్యా, చదువుకున్నవాళ్ళ మాదిరిగా వున్నారు. జ్ఞానం లేదూ! బుద్ధిలేదూ! మోటార్‌సైకిలు వుందని మీ ఇష్టం వచ్చినట్లు నడపడమేనా? రూల్స్ పాటించే పనిలేదా? బండికి నంబర్ కూడా లేదు. కేసు బుక్ చెయ్యాలి. మీ పేరేమిటి;?" అంటూ ఇన్స్‌పెక్టర్ వెంకటప్ప కేసుబుక్ చేతిలోకి తీసుకున్నాడు.

"అది కాదు సార్..." అని కామేషూ,

"ఎక్స్‌క్యూజ్‌మీ సార్..." అని సురేషూ ఇన్స్‌పెక్టర్ని బ్రతిమిలాడుకోవడం మొదలు పెట్టారు.

"ముందు మోటార్‌సైకిల్‌ని ఆ పక్కన పార్క్‌చేసి ఇవతలకి రండి. తరువాత మాట్లాడుకుందాం" సీరియస్‌గా అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"మన్నించండి సార్!"

"క్షమించండి సార్!"

"ప్లీజ్... సార్..."

అని వాళ్లు కాళ్లు పట్టుకున్నంతపని చేస్తున్నా ఇన్స్‌పెక్టర్ వెంకటప్ప తొణకలేదు.

"ముందు మీ పేరు చెప్పండి. కేసు బుక్ చేయాల్సిందే. మహాస్ట్రిక్ట్‌గా వుంటేనే మీలాంటివాళ్లు రూల్స్ పాటిస్తారు. అందులో నేను యమా స్ట్రిక్ట్' అన్నాడు యమా సీరియస్‌గా వెంకటప్ప.

"ఈ ఒక్కసారికి విడిచిపెట్టండి సార్. కొత్తగా ఈరోజే బైక్ కొన్నాం. కొన్నరోజే కేసు బుక్ చేస్తే అది మాకూ, బైక్‌కీ అపశకునం సార్!" వెంకటప్ప గడ్డం పట్టుకోబోతూ సురేష్ బ్రతిమిలాడుతున్నాడు

అదేం పట్టించుకోకుండా వెంకటప్ప ట్రాఫిక్‌ని క్రమబద్ధం చేయటానికి పని వున్నట్లుగా ఇంకో పక్కకి వెళ్ళాడు.

"నిజంగా బండి ఇవ్వాళేనా కొన్నది'' కానిస్టేబుల్ కనకసుందరం అడిగాడు.

"అమ్మతోడు, దేవుడితోడు! నిజంగా ఇవ్వాళే సార్. ఇందులో అబద్ధం లేదు సార్. కావాలంటే ఇదుగో ఈ బిల్ కూడా చూడండి సార్!" అన్నాడు సురేష్.

"ఎలాగయ్యా మరీ. మీరు రూల్స్ పాటించకుండా మీ ఇష్టం వచ్చినట్లు నడిపితే కుదురుతుందా?"

"ఈ ఒక్కసారికీ పోనివ్వండి సార్'

"మిమ్మల్ని విడిచిపెట్టడానికి నాకేం అభ్యంతరం లేదు. కానీ ఇన్స్‌పెక్టర్‌గారేమో చండశాసనుడు. పదికీ, ఇరవైకీ లొంగే ఘటం కాదు''

"ఎలా సార్?"

"సరే, ఒక్క పచ్చనోటు తీయండి. సార్‌కి ఎలాగోలా నచ్చచెప్పి ఒప్పిస్తాను''

"వంద రూపాయలే' కామేష్ ఆశ్చర్యపోతూ అన్నాడు.

"హండ్రెడ్ అంటే చాలా తక్కువయ్యా! త్వరగా తీయండి. మళ్ళీ సార్ ఇటు వస్తే కేసు బుక్ చేస్తాడు''

"వంద రూపాయలు లేవుకదా సార్'





"మీ దగ్గర హండ్రెడ్ లేకపోవటం ఏమిటయ్యా? ఇవ్వకపోతే చాలా ఇబ్బంది పడతారు. స్పాట్‌లో ఫైన్ వేయడానికి కూడా సార్ ఒప్పుకోరు. మీరు బండిని వదిలిపెట్టిపోవాలి. తరువాత కోర్టు చుట్టూ తిరగాలి. కేసు ఒకపట్టాన తెగదు. ఎందుకు వచ్చిన రిస్క్. గోటితో సింపుల్‌గా పోయేదానికి గొడ్డలిదాకా ఎందుకు? త్వరగా ఇవ్వండి. సార్‌కి నేను ఎలాగోలా నచ్చచెపుతాలే!"

"ఇచ్చుకోక తప్పదంటారా?"

"త్వరగా ఇస్తే మీరే త్వరగా వెళ్ళిపోతారు''

స్టోరీ రాద్దామనుకుంటున్నాం"

అంతలో వెంకటప్ప అక్కడికి వచ్చాడు. ఆయన చెవిలో కనకసుందరం గుసగుసలాడాడు.

"ఏమిటీ, మీరు జంతర్ మంతర్ పేపర్ జర్నలిస్టులా? ఆమాట ముందే చెప్పొచ్చుకదా సార్! ఇంత గొడవ జరిగేది కాదుగదా!"

"మీరు మమ్మల్ని ఎప్పుడు చెప్పనిచ్చారు?"

"సరే సరే! మాతో మీకూ, మీతో మాకూ ఎప్పుడూ అవసరాలు వుంటుంటాయి. జరి



"సరే ఇవ్వరా. డబ్బు పోతే పోయింది. మనకి మంచి న్యూస్ ఐటమ్ దొరికింది. చాలారోజుల్నించీ ట్రాఫిక్ పోలీసులమీద రాద్దామనుకుంటున్నాంకదా! ఇవ్వాళ బ్రహ్మాండంగా కలానికి పదును పెడదాం" రమేష్ ఉత్సాహంగా అన్నాడు.

"ఏమిటి మీరనేది?" కనకసుందరం అర్థంకాక అయోమయంగా అడిగాడు.

"మేం జంతర్ మంతర్ న్యూస్ పేపర్ రిపోర్టర్స్‌మి. మీ చేతులు తడిపితే మేం చేసిన నేరం మాఫీ అవుతుందన్నమాట. ఈ విషయంమీద రేపు మా పేపర్‌లో మంచి

గిన విషయం మనసులో పెట్టుకోకండి. మనం మనం కావాల్సినవాళ్ళం. సారీ, జరిగిన పొరపాటుకి ఏమీ అనుకోవద్దు. వెళ్ళిరండి. వాళ్ళ బైక్ ఇవ్వు. త్వరగా వెళ్లిపోతారు. అవతల ఎన్నిపనులు వున్నాయో'' వాళ్ళని సాదరంగా సాగనంపుతూ కనకసుందరాన్ని విసుక్కున్నాడు వెంకటప్ప.

-మొలకలపల్లి కోటేశ్వరరావు

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# 'పునరావాసం'పై సమీక్షలు

ఫిబ్రవరి నెలలో ప్రచురితమైన, నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన ఎ. అప్పల్నాయుడు రచన 'పునరావాసం'పై అందిన ఉత్తమ సమీక్షలను పాఠకులకు అందిస్తున్నాం.

## మరో చక్కని నవల

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

**చ**తుర అందించిన మరో ఆణిముత్యం ఎ. అప్పల్నాయుడుగారి "పునరావాసం" ఆర్థికంగా, విద్యాపరంగా, సమాజపరంగా వెనుకబడిన ప్రాంత ప్రజలను గురించి ఆలోచింపచేసే నవలలను అందిస్తున్న 'చతుర'కు కృతజ్ఞతలు.

రచయిత చాలా సహజంగా వ్రాశారు. గిరిజనుల ఆచార వ్యవహార సాంప్రదాయాలు, జంగంపండుగ, గువర్, కొత్తలపండగ సవరభాషల గూర్చి చక్కని శైలిలో వర్ణించారు. గిరిజనులు పోడుసాగు చేసి జీవనం కొనసాగిస్తుంటే ఆ భూమిని దురాక్రమణ చేస్తున్నారు ఇతరులు. నేడు కూడా పెత్తందారి వ్యవస్థలో గిరిజనులూ, మరెందరో బలిపశువులుగా మారుతున్నారు. విద్యావంతురాలైన బంతిని కూడా కుళ్లురాజకీయవేత్తల చేతుల్లో కీలుబొమ్మలైన అవినీతి అధికారులు, ఉద్యోగంనుండి నాటకీయంగా తొలగించారు. అధికారుల దొంగరాజకీయనాయకుల, ప్రభుత్వపరంగా ఖాకీల ఆగడాలు ప్రశాంతంగా వుండే పల్లెసీమల్ని అల్లకల్లోలం చేస్తున్నాయి. బంతి విషయం తెలిసి కూడా జీవితభాగస్వామిగా చేసుకున్న 'భీముని'లాంటి ఆదర్శవాదులు నేడు సమాజంలో ఒకరో అరో లేకపోలేదు. 'ఆట అయితే వదిలేస్తాం, ఇది బ్రతుకు! గాలికి వదిలేయలేము' లాంటి మాటలు భీముడి పరిణతను, జీవిత విశ్లేషణాశక్తిని తెలుపుతాయి. జగ్గారావులాంటి దొంగ కంట్రాక్టర్లు, వాసుబాబు లాంటి దోపిడీ వ్యాపారస్థులు, పేదల జీవితంతో చెలగాటమాడే సారా కంట్రాక్టర్లు నేటి సమాజంలో మనకు అడుగడుగునా తటస్థపడతారు. కంరుడు, ప్రకాశ్, కొ॥ కంచియ్యలాంటివాళ్లు కూడా సమాజంలో వున్నారు. పి.వో.లు, ఐటిడిఎ, గిరిజనమంత్రులు, ఎంపీలు, ఎమ్మెల్యేలు, ఫారెస్టువాళ్ళు గిరిజనులకు ఒరగబెట్టిందేమీ లేదు. సంక్షేమ పథకాల నిధుల్ని స్వాహా చేస్తున్నారు. అంతే! అయితే ప్రజలలో వున్న నిరక్షరాస్యత, అజ్ఞానం దోపిడికి గురవటానికి ఊతమిస్తున్నాయి. విప్లవానికి ప్రజాశక్తి ముఖ్యం. వారితో కలిసి మెలిసి స్థానిక సమస్యలతో పోరాడి ఉద్యమాలు నడిపిననాడు ఏ విప్లవం అయినా ముందుకు పయనిస్తుంది. "కుక్కలు మొరగడానికీ, పోలీసులు రెయిడ్ చేయటానికీ కాకపోతే మరిదేనికి" అని ఒక్క వాక్యంలో పోలీసు వ్యవస్థ తీరుతెన్నులు తెలి

పారు. కొసమెరుపులాంటి ముగింపు చక్కగా వుంది. నేడు జరుగుతున్న సంఘటనలకు దర్పణం ఈ నవల. తేనేపట్టు, కుంకుళ్లు, పండ్లు, ఫలాలు అందించే సహజ సంపద నరికి, యూకలిప్టస్, పామాయిల్ చెట్లు పెంచి కాలనీలు కట్టిస్తామని మభ్యపెట్టడం 'పునరావాసం' కల్పించడం ఎండమావిలో నీటికోసం వెదికినట్లే.

-బంటు కృష్ణయ్య
ముకుంధాపురం-508 218

## అడవి పువ్వులు

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

"పునరావాసం" అడవితల్లి ముద్దుబిడ్డల జీవన సమరాన్ని సమగ్రంగా చిత్రీకరించిన నవల. శక్తి కలిగివుండీ, కేవలం అమాయకత్వం కారణంగా స్వార్థపరులైన కాంట్రాక్టర్లు, ఫారెస్టు ఆఫీసర్లు, దళారుల చేతిలో ఎలా వీరు నిర్దయగా దోచుకోబడుతున్నారో రచయిత చక్కగా వివరించారు.

"గిరిజన సంక్షేమం" కోసం అంటూ వచ్చే స్కీంలు, పథకాలలో నిజాయితీ లేదని రచయిత స్పష్టం చేసిన తీరు బావుంది.

ఒక "ఆదివాసీ" యువతి విద్యావంతురాలై గిరిజన తండాల్లో 'చైతన్యం' తీసుకురావడానికి ప్రయత్నించటం ఆసక్తికరంగా ఉంది. "సాయుధ పోరాటం" కంటే "సమస్యా పరిష్కారం" కోసం శాంతియుత చర్చలు మంచివని... ఆమె తనవారిని పోరాటంనుంచి మరల్చటానికి ప్రయత్నించటం తన భర్త ఆయుధపోరాటంలో చనిపోయినా కూడా గిరిజన పాఠశాల నెలకొల్పి... వాళ్లని చైతన్యదీపాలుగా తీర్చిదిద్దాలనుకోవడం బావుంది.

నాగరీకులు గిరిజనులకు చేయూతనివ్వకుండా కూలీలుగా, బానిసలుగా, నిరక్షరాస్యులుగానే ఉంచి "నిమ్నస్థాయి" నుండి "అతి నిమ్నస్థాయి"కి నొక్కుతున్నారని రచయిత బాధపడ్డారు. అడవిలో పుట్టిన మన్యవీరులు భీముడు, కంతుల దైన్యస్థితి కళ్లకు కట్టినట్లు రాశారు. పోలీసుల దాడులు, అమాయక గిరిజనుల ఎన్‌కౌంటర్‌లు నేటికీ జరుగుతున్న నిజాలే.

నవల్లో గిరిజనుల్లోని ఆచార వ్యవహారాలు, వాళ్ల నమ్మకాలు విస్మయం కలిగించేలా ఉన్నాయి. ఆశ్రమ పాఠశాలలోని "వార్డెన్ల" అవినీతి క్షమించరానిది. "పునరావాస పథకాల" కింద బ్యాంకుల్లో గిరిజనులకు జరిగే అన్యాయాలు, "గిరిజన కార్పొరేషన్ల" భాగోతాలు, కూలీరేట్ల కోసం, భూమి పట్టాల కోసం గిరిజనుల పోరాటాలు చాలా సహజంగా చిత్రించారు. పునరావాసం, సంక్షేమాలవల్ల స్వచ్ఛమైన సవర సంస్కృతి కల్తీ అవుతుందన్నది నిజమే.

గిరిజన తండాల్లో "మెదడువాపు" లాంటి భయంకర రోగాలు వచ్చినా ప్రభుత్వం పట్టించుకోకపోవడం శోచనీయం. భూమి కోసం గిరిజనులకీ, గూండాలకీ జరిగినపోరు నవలకే హైలెట్. తన ఆఖరి రక్తపుబొట్టు వరకు పోరాడిన భీముడు నిజంగా అడవితల్లి "ముద్దుబిడ్డే"

"అడవి పువ్వు"ల గూర్చి రాసిన ఈ నవల ఆద్యంతం బావుంది. రచయితకు అభినందనలు.

డా. జె. సంధ్యారాణి
తణుకు-534 211

## గిరిజనుల యథార్థ జీవితగాథ

*(మూడవ బహుమతి*
*రూ. 50/- పొందిన సమీక్ష)*

'పునరావాసం'లో గిరిజనుల జీవన విధానం, వారు ఎదుర్కొంటున్న సమస్యలను గూర్చి రచయిత అన్ని కోణాలనుండి పరిశీలించి వివరించి చెప్పారు. గిరిజనుల భూములను షావుకార్లు, కాంట్రాక్టర్లు ఆక్ర




మంగా స్వాధీనం చేసుకొని వారి భూములు మీద వారికే అధికారం లేకుండా చేసి తమ డబ్బు బలంతో ఎలా నిరంకుశంగా వ్యవహరించారో స్పష్టంగా చిత్రీకరించారు. ఈ నేపథ్యంలో గిరిజనులకు 'భూమిసమస్య' ప్రధాన సమస్యగా తయారై జానెడు పొట్టకోసం వారు పడే అగచాట్లను రచయిత హృదయవిదారకంగా వర్ణించారు.

తమ సమస్యల పరిష్కారంకోసం 'గిరిజన సంఘాల'ను ఏర్పాటుచేసుకోవడం, అనేక పోరాటాలు జరిపి అందులో చాలా మంది ప్రాణాలు కోల్పోవడం చూస్తే పోరాటాల వెనుక కమ్యూనిష్టులు, 'అన్న'ల ప్రభావం ఎక్కువగా వుందని చెప్పవచ్చు. బంతిలాంటి ఒకరిద్దరు చదువుకొన్నవారు ప్రభుత్వాధికారులు, చట్టంమీద నమ్మకం కొద్దీ ఆశ్రయించినా తమ సమస్యలు పరిష్కారం కాకపోగా వారిమీద నమ్మకాన్నే కోల్పోవాల్సివచ్చింది. చివరకు దుర్మార్గులైన కామేశు, జగ్గారావులను 'అన్న'లు చంపి వీరి 'భూమి సమస్య'ను పరిష్కరించడం బాగుంది.

ప్రభుత్వం గిరిజన సంక్షేమ కార్యక్రమాలు చాలానే చేపడుతున్నా అవి ఆచరణలో ఏవిధంగా విఫలమౌతున్నాయో తెటతెల్లం చేసిందీ నవల. స్కూళ్ళలో ఉపాధ్యాయులు సరిగా హాజరుకాకపోవడం, తప్పుడు రికార్డులు లాంటి నీతిబాహ్యమైన చర్యలతోపాటు గిరిజనులకోసం మంజూరు చేసే లోన్‌లు వారికి ఏవిధంగా చేరేవి కావో, తమ పేరు మీద ఎవరో తీసుకొన్న లోనుకు ఆ బాకీలు మాత్రం తమమీద ఎలా పడేదీ చక్కగా వివరించారు.

"నవల కేవలం కాల్పనిక రచనకాదు, అది జీవిత రచన! మానవుని యథార్థ జీవితాన్ని వ్యక్తీకరించడానికి జరిగిన ప్రయత్నం" అన్న నిర్వచనాన్ని 'పునరావాసం'లో నిరూపించిన రచయితకు, ప్రచురించిన సంపాదకులకు కృతజ్ఞతలు.

**ఆర్. శంకర వడయార్**
**తిరుపతి - 517 502.**

## వేటగాళ్ళు

(నాల్గవ బహుమతి
రూ. 50/- పొందిన సమీక్ష)

'**పు**నరావాసం' నవల్లో గిరిజనులకు ప్రభుత్వం కల్పిస్తున్న అవకాశాలు, వాటిని వారు అనుభవించడానికి, అవి వారిని చేరడానికి మధ్య కలిగే అవాంతరాలు చక్కగా చిత్రించారు రచయిత. కొన్ని సంఘటనలు కాస్త 'సినీమాటిక్' గావున్నా సవరల ఆచార, వ్యవహారాలు, వారి సంస్కృతి, సంప్రదాయం, సంస్కారం వంటి విషయాలు చక్కగా వివరించారు రచయిత.

బంతిని రాజారావు ఉద్యోగం యిప్పిస్తానని పట్నం తీసికెళ్ళడం, ఉద్యోగం వేయించి ఆమెను తన సరదాకి వాడుకోడం, ఆమె ఖర్మకి ఆమెను వదలి వెళ్ళిపోడంలాంటివి హర్షించదగ్గవికావు. సవర జాతి యువతి అయిన బంతి రాజారావుని ఏం చెయ్యకుండా విడిచిపెట్టడంతో కాస్త 'పస' లోపించింది. సవర స్త్రీలు చాలా శక్తి ధైర్యం కలిగివుంటారు గదా! వారి కట్టుబాట్లు చాలా కఠినంగానూ వుంటాయి గదా! నాగరికత నేర్చిన పల్లెప్రజలు పట్నవాసపు మోజు కలిగివుండడం సహజమే!

ఏజన్సీ ప్రజలకు సేవచేయాలని ప్రభుత్వ సకల్పం కాని ప్రభుత్వ కార్యాలయాలు ఏవీ సరిగా పనిచెయ్యవు. బలహీన వర్గాలకు యిళ్లు అనేకన్న 'బలహీనపు యిళ్లు' అనడం బాగుంటుంది. బ్యాంకుల ఋణాలు, మందులు, నర్సులు, డాక్టర్లు లేని ఆసుపత్రులు, టీచర్లు, పిల్లలు వసతులు, లేని పాఠశాలలు వీటి వివరణ చక్కగా వుంది. అవసరమైన మొక్కల్ని తీసి వ్యాపార ప్రయోజనంకోసం మొక్కల్ని పెంచడం గిరిజనాభివృద్ధి అనుకోడం ఎంతవరకు సబబు? యుద్ధం పేరున తండ్రిని చంపారు, భూమి అడిగేడని భర్తని చంపారు. అంతకుముందే బంతి శీలాన్ని చంపారు. సరైన వైద్యం లేక బిడ్డ మరణించింది. ఈ వేటగాళ్ళ వలలో ఆ వలస

నష్టపోయిందెంతో? చదువు, సంధ్యలు లేక పోయినా, నాగరికత నేర్పకపోయినా వారి కట్టుబాట్లలో వారుంటూ, వారి వారి వృత్తులు వారు చేసుకున్నప్పుడే సవరలు సుఖమైన జీవితం గడిపేవారని అనిపించక మానదు. ఈ ప్రభుత్వ ప్రణాళికలు, అభివృద్ధి కార్యక్రమాలు, దళారులు బతకడం కోసమే అని పించక మానదు.

-పూడిపెద్ది నీలవేణి
శృంగవరపుకోట -535 145.

## కనువిప్పు

*(అయిదవ బహుమతి*
*రూ: 50/- పొందిన సమీక్ష)*

'**పు**నరావాసం' ఇతివృత్తాల్లాంటివి కథలు, నవలలుగా ఇదివరలో కూడా వచ్చినప్పటికీ సంఘటనాస్థలితో, కాలంతో, పాత్రలతో రచయితకు గల సాన్నిహిత్యం, సవర భాషా పరిజ్ఞానం నవలకు జీవాన్ని, గమనాన్ని ఇచ్చేయి.

గిరిజన పోరాటాల భూత, భవిష్యద్వర్తమానాలకు ప్రతీకలుగా కంతుడు, బంతి, భీముడు ముందు నడుస్తూ కథకు అంతరాయం కలుగకుండా పటుత్వాన్నిచ్చేరు. రాక్షస వివాహ వ్యవస్థను బంతి వ్యతిరేకించినప్పుడూ, దారిమామిడి చెట్టుదగ్గర అన్నలను చూసి వచ్చిన తర్వాత బంతితో మాట్లాడిన మాటల్లోనూ, గవర్నమెంటు స్కీముల్లోని ఎండమావుల్ని ఎండగడుతూ ప్రకాశరావుతో మాట్లాడిన మాటల్లోనూ కంతుడి ద్వారా - మారిపోతున్న సాంస్కృతిక విలువలపట్ల తమ దయనీయ, నిస్సహాయ పరిస్థితిపట్ల ఆక్రోశం, ఆవేదన వ్యక్తంచేయించేరు రచయిత.

రుణమేళాలకు, తదితర గిరిజనోద్ధరణ కార్యక్రమాలకు ఎన్ని శ్రమ దమాదులకోర్చి వాళ్లు వస్తున్నారో, వాళ్లు పొందుతున్న లబ్ధి, ఆ శ్రమదమాదులముందు ఎంత దిగదుడుపో, వార్తాపత్రికల్లో ఆ కార్యక్రమాల వివరాలు చదివినప్పుడు, మన ఊహకందని విషయాల్ని మన కళ్లముందుంచింది. అయితే ఆ జనారణ్యాల్లో వాళ్లను కొల్లగొట్టే జగ్గారావులు, కపట రాజకీయ నాయకులతోపాటు, సేదదీర్చే డి.టి.డబ్ల్యూ లాంటివారున్నా ప్రస్తుత వ్యవస్థలో వారెంత నిస్సహాయులో, రాజకీయ 'చెద'రంగంలో ఎలా తమనాశ్రయించినవారితోపాటు తామూ బలైపోతున్నారోనన్నది మనకి అరుదైన అనుభవమైనా, ప్రకాశరావు వ్యక్తంచేసిన నిస్సహాయత మనందరికీ నిత్య అనుభవైకవేద్యమే. పల్లపు ప్రాంతాల్లో ఆర్థికంగా వెనుకబడి, బతుకు పోరాటాన్ని సాగించలేకపోతూ, ప్రభుత్వ స్కీములన్నీ తన్నుకుపోతారని గిరిజనులపట్ల అసూయనూ, ద్వేషపూరితమైన అవహేళనను పెంచుకున్న మనలాంటివాళ్లకు గిరిజనులకందుతున్న లబ్ధి నేతి బీరకాయేనని, ఇరువర్గాలవారూ దగాపడిన తమ్ముళ్లేనని తేల్చి చెప్పింది 'పునరావాసం'. కంతుడి గత అనుభవాల నేపథ్యంలో భీముడి పోరాట పంథాలోని ఔచిత్యాన్ని ప్రశ్నించిన బంతికి 'ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురుచూసి మోసపోకుమా!' అని చెప్పి భ్రష్టుపట్టిపోయిన దోపిడీ వ్యవస్థతో పోరాట పథం దిశగ తప్పనిసరిగ నడిపించాయి పరిస్థితులు.

గిరిజనుల దైన్య జీవితాలపట్ల ఒక అవగాహన, మన పరిధిలో వాళ్లకు వీలైనంత చేయూతనిచ్చి ఆదుకోవాలనే అభిప్రాయాన్ని కల్గించేటటువంటి ఒక చక్కని నవలను పాఠకులకు అందించిన శ్రీ అప్పల్నాయుడు గారికి అభినందనలు!

-కె.వి. రమాకాంత్
విజయనగరం

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 318181, 399444; Madras 470434; Vijayawada 476685; Visakhapatnam 52211; Tirupati 5291; Anantapur 22977; Rajahmundry 71390; Karimnagar 83216.

CHATURA Telugu Monthly Hyderabad–500 482 Regd. No. H/HD/402

# ఇలా చదవండిది, అలా తెలుసుకుంటారిక
# ఇకనుంచీ నీలిమందుని ఎందుకసలు వాడనేవాడరో అనే సంగతినిక !



సాధారణ 'బ్లూ' నీటిలో గడ్డలు కట్టడంతో మీ బట్టల పైన మడ్డి నీలి మరకలు పడుతాయి.



వైజ్ఞానికంగా రూపొందించిన, శక్తివంతమైన మైక్రోడిస్పర్షన్ ఫార్ములేషన్ కలిగిన 'ఉజాలా' నీటిలో అంతటా సమంగా కరిగిపోయి, మీ బట్టలకు ఇస్తుంది మిరుమిట్లు గొలిపే తెల్లదనం.

## కొత్త ఉజాలా ఫేబ్రిక్ వైట్‌నర్.
## మీ బట్టలకి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నితెచ్చే మచ్చలేని మంచి ఉపాయం.

నీలిమందు మీ బట్టలపైన చారల మరకల మచ్చల ఆనవాళ్ళని వదిలిపెడుతుంది, అయినా అతి పురాతనమైన ఆ నీలిమందును కలకాలంగా వాడుతూనేవున్నారు జనం – కారణం, దానికి బదులుగా మరొకటి లేకపోవడం. అది పాతమాట, వచ్చేసింది యిప్పుడిక ఉజాలా – బట్టలకు తెల్లని తెలుపునిచ్చే శాస్త్రీయమైన ఫేబ్రిక్ వైట్‌నర్. దాన్లోగల పదార్థాలతో, శాస్త్రీయమైన ప్రక్రియతో అబ్బింది దానికి ఆ లక్షణం.

<u>వి+ గల వైట్‌నర్ ఉజాలా</u>

అసలు వి+ ఎందుకని? ఏంచేస్తుంది మీ బట్టలకి యిది? మరి గమనించారా యిది – బట్టలని డిటర్జంట్‌తో ఉతికిన ప్రతిసారీ వాటి కాంతి పోగొట్టుకుంటాయి. నిజానికి డిటర్జంట్లు, మాసిన బట్టల్లోని మురికిని మాత్రమే తీసివెయ్యగలవు కానీ ఆ ప్రక్రియతో బట్టలు పాలిపోయినట్టు కనిపిస్తాయిక. మరి నీలిమందు, నీటిలో మడ్డి పదార్థాలను వదలటంతో అవి మీ బట్టలపైన చారల మరకల్ని వేస్తాయి. ఇక ఉజాలాలోగల 'మైక్రో డిస్పర్షన్ కేటలిస్ట్ వి+' నీటిలో సరిసమానంగా కరిగిపోయే, బట్టల పోగుపోగులోకీ తక్షణమే చొచ్చుకు పోయే, వాటికి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నిచ్చే ఒకేఒక వైట్‌నర్. అదే వి+ ప్రత్యేకత.

<u>మిరుమిట్లుగొలిపే తెల్లదనం – చూడండి ప్రత్యక్షంగా మీకు మీరే</u>

మరొక పనికొచ్చే కిటుకు – ఉజాలా, కేంద్రీకృతమైన గాఢతగల ద్రవం కావడంవలన, కొద్దిచుక్కలు వేస్తే చాలు యిది. పొదుపే పొదుపు. ఆ మిరుమిట్లుగొలిపే తెల్లదనపు అత్యుత్తమ ఫలితాలకోసం, పక్కన సూచించిన పద్ధతుల్ని అనుసరించండి. అనుభవంలోకి వస్తుంది మీకే.

ఇక చారల మచ్చలుపడే నీలిమందును ఎందుకు వాడాలి, పట్టుక్కూర్చోవాలిగనక? ఉందిగదా తెల్లదనాన్నిచ్చే కిటుకు ఉజాలా, వుందిగదా అందుబాటులో?

**నీలిమందుకన్న ఎంతో మరెంతో మెరుగు**

**ఉజాలాని సరిగ్గా వాడటానికి అంచెలు అంచెలుగాగల పద్ధతి**

1. ఉజాలా బాటిల్ లోపలి మూతకి సన్నని చిల్లు పొడవండి.
2. మీకు కావలసిందల్లా ఒక లీటరు నీటికి 4-6 చుక్కలు.
3. ఉతికిన బట్టల్ని నీటిలో ముంచి వుంచండి.
4. బట్టల్ని మెల్లిగా బాదించండి కొద్ది క్షణాల సేపు. వాటిని ఆరనివ్వండి.




**UJALA**

జ్యోతీ లేబరేటరీస్, బొంబాయి వారి నుంచి.

Situations/JL/22/